# పరిచయం

నేను వ్రాయబోతూన్న సంగతులు ఫాంటమారాలో గత వేసవికాలంలో జరిగాయి. ఫ్యూసినోసరస్సు యెండి దిబ్బ వేసుకొనిపోవడం మూలాన ఆ ప్రదేశం యీమధ్యనే వ్యవసాయ యోగ్యంగా చేయబడింది. ఆ సరస్సుకి ఉత్తరంగా ఉన్న మార్సికాజిల్లాలో ఫాంటమారా అనే అతిప్రాచీనమైన కుగ్రామం ఉంది. ఒక శిథిలమైన క్రీస్తుదేవాలయం చుట్టూరా ఎండకు పెళపెళలాడి, వానకు తడిసి కాలప్రవాహానికి తల ఒగ్గిన పూరిగుడిసెలు రమారమి ఒకవందవుంటాయి. అందులో కొన్నిటికి ఆకారమే లేదు. కొన్నిటికి అండలు జారుతున్నాయి. ఇటికలూ, మన్నూ, పెంకలూ, గడ్డీ, జమ్మూ మొదలైన వాటితో పైకప్పులు కప్పబడియున్నాయి. ఆ పూరిళ్ళకుఒకటే తలుపు ఉంటుంది. కిటికీ లుండవు. ఆ యిళ్ళల్లో స్త్రీలు, పిల్లలు, గాడిదలు, మేకలు, కోడిపెట్టలూ, పుంజులూ నిద్రిస్తాయి, తింటాయి, సంతానాన్ని కంటాయి.

నేను చెప్పబోయే సంగతులు మినహాగా ఫాంటామారాకు తదితరమైన యే ప్రాముఖ్యత లేదు. నా జీవితంలో మొదటి యిరవైయేళ్లు ఫాంటమారాలోనే గడిపాను. అంతకంటే అధికంగా దాన్నిగూర్చి చెప్పవలసిందేమీ కనపడదు.

ఎల్లప్పుడు ఒకే విధంగాఉండి విసుగుపుట్టిస్తోండే ఆ ఆకాశం ఆ భూమి, ఆ మంచు, ఆ గుడిసెలు, ఆచర్చి, ఆ పండుగలు, ఆ అన్నం, ఆ ఫాంటమారా దరిద్రం యిరవైయేళ్ళు చూశాను. అనంతమైన ఆ దారిద్ర్యం తాతలు తండ్రులకూ,

తండ్రులు కొడుకులకు, ఆ కొడుకులు తమ కొడుకులకు, మనుమళ్ళకు, మునిమనుమళ్ళకు ఈ విధంగా నిరంతరాయంగా, వంశపారంపర్యంగా అందిస్తూండే ఆ దరిద్రంలో నేనుకూడా భాగం పంచుకున్నాను. ఆ గ్రామస్థుల జీవితపరిస్థితులు కాల పరిభ్రమణానికి లోబడి మారకుండా శాశ్వతంగా ఒకే విధంగానే ఉంటాయని తోచేది.

మొట్టమొదట ఊడ్పులు, తరువాత కలుపుతీత, ఆకు పూత, ఆపైన పనికిరాని రెమ్మల్ని, కొమ్మల్ని, తుంచివేయటం, కోతలూ, ద్రాక్షపళ్ళని ప్రోగుచేయటం. ఆపైన యేమిటి? ఊడ్పులూ, కలుపుతీత, ఆకు దూతా, త్రుంచివేతా, కోర ద్రాక్షపళ్ళ ప్రోగుచేతా.

ఎప్పుడూ ఈ విధంగానే ఉండేది. అందులో యేమీ మార్పు ఉండేది కాదు. సంవత్సరాలు దొర్లుకు పోతాయి. పళ్ళు మేట్లుపడ్డాయి. వయస్సులో ఉన్న యువకులు ముసలాళ్ళయ్యారు. వృద్ధులు చచ్చిపోయారు. ఊడ్పులు, కలుపుతీత త్రుంచివేత, కోత, ప్రోగుచేత యథాప్రకారంగానే సాగిపోతూండేవి. ఆ తరువాత యేమిటి? మామూలు ధోరణే. దాని తరువాత యేం జరిగేది? ఏరకమైన మార్పు లేదు. ప్రతి సంవత్సరం క్రిందటి సంవత్సరంలాగే ఉండేది. ప్రతిఋతువు క్రిందటి ఋతువులాగూ, ప్రతి తరము వెనకటి తరంలాగే ఉండేది.

తీరికసమయాల్లో ఆవూరివాళ్లు స్వంతపనులు చూసుకొనేవారు. అంటే కోర్టుకెక్కేవారన్నమాట. ఫాంటమారాలో సంబంధ బాంధవ్యాలు లేకుండా యేరెండు కొంపలూ లేవు.

పల్లెటూళ్ళల్లో ప్రతిఒక్క కుటుంబం ప్రక్కన కుటుంబాలతో బంధుత్వం కలిగిఉంటుంది. అందుచేత ఏవో తగాదాల్ని పెట్టుకొని దరీ, దాపూ లేకుండా కక్షలు పెంచుకొని కోర్టుల చుట్టూపట్టుకొని వేళ్ళాడుతారు. ఆ తగాదాలు, ఆ కక్షలు. తరతరాలకీ వారసత్వపు హక్కుల్లాగ సంక్రమిస్తాయి. ఈ కక్షలకు మూలం యే తుప్పో, యే ముళ్ళపొదో, ఏ గట్టో, పుట్టో అయివుంటుంది. ఈ కంచెగాని, తుప్పగాని తెగలబడి పోయినా ఆ తగాదాలుమాత్రం చల్లారవు.

ఈ వివాదాల్నుంచి బయటపడే మార్గం లేదు. ఎవరైనా ఒకరు నెలకు రెండు రూపాయలో, మూడురూపాయలో నిల వెయ్యవచ్చును. వేసవికాలములో పది రూపాయలవరకు నిల వెయ్యవచ్చును. కాని ఏ రోగమో, తుప్పో వచ్చి పదేళ్ళ నిలవనీ ఒకసారి హఠాత్తుగా మింగేస్తుంది. అప్పుడు మళ్ళీ మొదట్నుంచి ఆరంభం చేయాలి. నెలకి కూడబెట్టిన యీ రెండు మూడు రూపాయల్ని ఏ అవాంతరమోవచ్చి తుడిచి పెట్టుకుపోతోంటే మళ్ళీ నిలవ చేయడానికి ఆరంభిస్తూ ఉండాలి.

మైదానప్రదేశాల్లో అనేకమార్పులు వచ్చాయి. కాని కొండ మార్గాలో యేమీ మార్పులేదు. అక్కడి భూమి చాలా తక్కువ. రాళ్ళమయం. ఆ కొద్దిభూమీ ఖండ ఖండాలుగా పంచిపెట్టబడింది. ఏ ప్రతీకూడా తాకట్టులో లేకుండా లేదు. ఏ రైతుకు పట్టుమని రెండు మూడెకరాలు లేవు.

ఎనభై యేళ్ళక్రితం ఫ్యూసినో సరస్సు ఎండిపోయింది అప్పటి నుండీ ఆ చుట్టుపట్ల కొండలు మరీ వేడెక్కిపోయి వ్యవసా

ప్యానికి ఉపయోగించటం లేదు. ఆలివ్ చెట్లతోపులు పూర్తిగా ధ్వంసమైపోయాయి. ద్రాక్షతీగలకి ఏదో క్రొత్తరకపు రోగం పట్టి పళ్ళు పూర్తిగా ముగ్గేవి కావు. ఆ పళ్లని మంచుగడ్డల వర్షాలు పడేముందే అక్టోబరు నెలాఖరుకి కోయ్యవలసి వచ్చేది. ఆ పళ్ళు నిమ్మకాయరసంలా బాగా పుల్లగా ఉండేవి. వాటిని పండించిన ఆ దౌర్భాగ్యపు రైతులే వాటిని తిన వలసివచ్చేది.

ఫ్యూసినో సరస్సు ఎండిపోయాక ఆ ప్రదేశం ఇటలీలోకల్లా అతి సారవంతమై, వ్యవసాయయోగ్యమైనదిగా పరిశోభించింది. ఆ భూమిని సాగుబడి చేయటంవల్ల వచ్చిన లాభం కంటే, చుట్టుప్రక్కల భూములు ఎండిపోవటంవల్ల కలిగిన నష్టం చాలా అధికం. ఆ జిల్లాఅంతా వ్యవసాయ బానిసత్వానికి ఉనికిపట్టయింది. ఆ భూమిని పండించే భాగ్యం ఆచోటుసి ఓలవకి రాజధానికి ఏటేటా ప్రయాణంకడుతోంది. ఫ్యూసినో లోని ఎనిమిదివేల ఎకరాలూ, రోమన్ కాంపేనా, టస్కనీ ప్రాంతాలలోని విస్తారమైన భూప్రదేశం, టార్లోనియా యువరాజుకు చెందిఉన్నాయి.

గత శతాబ్దపు మొదటిరోజుల్లో ఒక ఫ్రెంచి పటాలాన్ని వెంటబెట్టుకొని రోమన్ నగరానికొచ్చిన టార్లోనే అనే ఆయన సంతతిలోనివాడీ యువరాజు. మొట్టమొదట యుద్ధ సమయంలోనూ, తరువాత శాంతిసమయంలోనూ వాటాల బజారులలో సాహసించి వ్యాపారం చేశాడు. అటుపైని ఉప్పు వాటాల వ్యాపారం, 1848 వ సంవత్సరంలో జరిగిన యుద్ధంలోనూ, దాన్ననుసరించిన శాంతి సమయంలోనూ,

మళ్ళీ 1859 వ సంవత్సరపు యుద్ధం, దాని తరువాతి శాంతి కాలం, బోర్బన్ ప్రభువుల పరిపాలన. వారి నాశన సమయాల్లోనూ, అనిశ్చితమైన సమయాల్లో సాహసించి వాటాలు కొని అమితమైన లాభం తీశారు. 1860 వ సంవత్సరం తరువాత ఫ్యూసినో సరస్సులోని నీటిని అవతలికి కొట్టేసేందుకు ఒక కంపెనీ మీద అధికారం సంపాదించి ఆ పని పూర్తి చేశారు. అతి చౌకగా వాటాలు కొన్నారు. నేపిల్సు రాజు నుండి తొంభై యేళ్ళవరకు ఆ భూమిమీద వచ్చే ఫలసాయాన్ని అనుభవించే హక్కుని టార్లోనీ సంపాదించారు. పైడమాంటీస్ మహారాజు వంశంవారికి చేసిన సహాయాలాన్ని ఆ హక్కు శాశ్వతకాలంవరకు పొడిగించబడింది, అంతే కాకుండా ముందు ప్రభువు, ఆ పైన రాజకుమార్ అనే బిరుదులుకూడా ప్రసాదించబడ్డాయి. పైడమాంటీస్ ప్రభువు వంశమువారు, నిజంగా వాళ్ళకే లేని అధికారాన్ని ఈ విషయంలో చలాయించారు.

పవిత్రమైన ఆ ఆస్తిని కాపాడుకొనేందుకు టార్లోనియా జమీందారు తన సొంత సిబ్బందిని ఉంచుకుంటున్నాడు. అతి విశాలమైన అతని జమీనుచుట్టుముట్టి నలభైమైళ్ళ కాలవ ఒకటి త్రవ్వబడింది. ఆ కాలవమీద రాత్రిళ్లు పైకి యెత్తేసేందుకు పగలు క్రిందికి దింపేసేందుకు వీలుండే ఇనుప బ్రిడ్జీలు వేయబడ్డాయి.

ఆ భూములమీద పదివేలమంది బీదరైతులు పనిచేస్తున్నారు. ఆ టార్లోనియా జమీందారు తన జమీనంతనీ చుట్టు ప్రక్కలవున్న బారిష్టర్లకీ, డాక్టర్లకీ, మోతుబరి రైతులకీ

మగతాల కిస్తూంటాము. వాళ్లు పాలేళ్లను, కూలీలను పెట్టి వాటిని సేద్యం చేస్తారు. ప్రతి ఉదయం ఫ్ల్యాసినో జమీ చుట్టుపక్కల ముఖ్య గ్రామాల్లో వ్యవసాయకూలీల బజారు లుంటాయి. మూడేసిమైళ్ళు, ఆరు, ఎనిమిది మైళ్ళుకూడా నడచి కూలీలు బజారులో పోగుబడి తమంతట తాము అమ్ము కొంటారు. ఏడెనిమిదిమైళ్ళుకూడా నడచి వాళ్ళు పనులోకి పోవలసి ఉంటుంది.

ఫ్ల్యాసినోజమీమీదనుంచి టార్లోనియోజమీందారు ఏటేటా ఆర్జించే అపార ధనానికి, రైతుకూలీల దరిద్రానికి లెఖ్ఖ లేనంత భేదం కనపడుతుంది. ఆఫ్ల్యాసినో జమీనుంచి సాలుకి 4,0000 టన్నుల పంచదార బీటుదుంపలు, 15,000 టన్నుల జొన్నలు, 2000 టన్నుల కూరగాయలు ఫలసాయం వస్తుంది.

యూరపులోని ముఖ్యమైన పంచదార ఫాక్టరీలలో వొకదానికి ఈ ఫ్ల్యాసినో బీటుదుంపలే ముడిసరకుగా ఉపయోగించబడు తున్నాయి. కాని, దుంపల్ని పండించే రైతుమాత్రం ఆ పంచదారను తిన నోచుకోనలేదు. ఈ పంచదార ఏడాదికి ఒక్కసారిమాత్రం క్రిస్టమస్ పండుగ దినాల్లో రొట్టెలద్వారా వాళ్ళిళ్ళల్లోకి ప్రవేశిస్తుంది. ఫ్ల్యాసినో జమీలో పండిన జొన్నపంట దాదాపు అంతా పట్టణానికి ఎగుమతి అవుతుంది. అక్కడ దాంతో తెల్లరొట్టెలు, బిస్కట్లు, జొన్నఉండలు తయారు చేయబడతాయి. ఈ రొట్టెలు పిల్లులకీ, కుక్కలకైనా కొరగానిరకపు క్రింద లభిస్తాయి కాని వాటిని పండించిన రైతులు యేడాదిలో యెక్కువకాలం మొక్కజొన్నరొట్టెలు మాత్రమే

తిని జీవితాల నీడ్చవలసి యుంటుంది. ఫ్యాసినో నుంచి రైతులకు లభించేదల్లా (పస్తుల జీతాలు) ఆకూలీ రైతుల బొందెల్లో ప్రాణాల్ని నిలుపుతుంది కాని, పూర్తిగా జీవించనీయదు.

పేద రైతులు అమెరికా దేశానికి పొట్టపోసుకునేందుకు వలస పోయిన రోజులుకూడా ఉండేవి. ప్రపంచ యుద్ధానికి ముందు ఫాంటమారా నివాసులు కొందరు బ్రెజీలు, అర్జంటైనాలలో తమతమ అదృష్టాలను పరీక్షించారు. నాలుగు డబ్బులు వెనక వేసుకోగలిగినవారు ఆ ప్రాంతాలలోనే ఉండిపోయారు. విఫలులైనవారు ఫాంటమారాకు తిరిగివచ్చి తళుక్కుమని మెరిసించిన అమెరికాలోని జీవిత దృశ్యాల జ్ఞాపకాన్ని భద్రపరిచుకొంటూ మామూలు దౌర్భాగ్యజీవితాన్ని గడుపుతున్నారు. అక్కడి జీవితము అనేకవందల సంవత్సరాలనుంచి మురిగిపోతున్నా గతసంవత్సరం జరిగిన కొన్ని సంఘటనలు ఫాంటమారాని మొదలంటా కదిపేశాయి. ఈ సంఘటనలు వెంటనే వార్తాపత్రికలలోకి యెక్కలేదు. కొన్ని నెలల తరువాత మెల్లి మెల్లిగా అనేక పుకారులు ఇటలీలోను, తక్కిన దేశాల్లోను వ్యాపించాయి.

ఇటలీ దేశ పటములోకూడా లేని కుగ్రామమైన ఫాంటమారా అకస్మాత్తుగా అందరినోళ్ళలోను పడింది. కొందరు ఫాంటమారా దక్షిణ ఇటలీ దేశానికి మారుపేరు అనికూడా భావించారు.

నే నింతక్రితమే చెప్పినట్టు ఫాంటమారా ప్రక్కగ్రామంలో నేను పుట్టాను. ఫాంటమారాలో యిరవైయేళ్ళు పెరిగాను. కాని యీ మధ్యను చాల ఏళ్లనుంచి అక్కడ లేకపోవడం

మూలాన్ని ఫాంటమూరాలో జరిగాయని చెప్పబడుతున్న అనేక వార్తలు పూర్తిగా నిజమేనా అని అనుమానం కలగక మానటంలేదు. ఒకవేళ యిలాంటివార్తలన్నీ కల్పించు వ్యక్తి మూలనున్న పల్లెటూరుకదా అని ఫాంటమూరాకు అంటగట్టారేమో అనేసందేహముకూడా నన్ను పీడిస్తోంది. అందుకే నా అక్కడ విషయాలన్నీ ప్రత్యక్షంగా తెలుసుకోవాలని ప్రయత్నించాను. కాని విఫలుణ్ణయ్యాను.

రోజులు గడుస్తున్నకొద్దీ ఆ విషయాలన్నీ మరచిపోతున్నాను. కాని అకస్మాత్తుగా ఎప్పుడనుకోని ఒక విషయం జరిగింది. ఒక రాత్రి చాల ఆలస్యంగా మా యింటికి తిరిగి వచ్చాను. వాకిలిముందు యిద్దరు మొగాళ్లు, ఒక ఆడదీ ముసుచుకొని పడుకున్నారు. వాళ్ల నెత్తికి చుట్టినపాగాలు, ప్రక్కను పెట్టుకున్న యాత్రికుల బుట్టలు చూసి వాళ్లు ఫాంటమూరా రైతులై ఉంటారని అనుకున్నాను. నేను వాళ్లదగ్గరకు వెళ్లగానే కళ్ళు నులుపుకుంటూ హడావిడిగా లేచారు. గాసు దీపపుకాంతి వాళ్ల ముఖముమీద పడింది. అవును వాళ్లు ఫాంటమూరా రైతులే!

ఆ యిద్దరి పురుషులలో వృద్ధుడు పొడుగ్గా, పలచగా నింపుగా ఉంటాడు. మందగొడ్డుగా యెలుగుబంటి మోస్తరుగాక చలాకీగా ఉంటాడు. అతని రాగివర్ణపు బొడ్డు ముఖం భయాన్ని వెల్లడిస్తోంది. అతని వెనుక, నీడలో అతని భార్యా కొడుకు నిలబడిఉన్నారు. వాళ్లందరు లోపలికొచ్చి కూర్చొని వాళ్ల కథను ఆరంభించారు.

మొదట ముసలాడు ప్రారంభించాడు. తరువాత అతని భార్య అందుకుంది. కొంత సేపైన తరువాత భర్త, ఆ పైన భార్య మళ్ళీ భర్త, తరువాత కొడుకు ఈ విధంగా ఒకరి తరువాత ఒకరు కథను చెబుతూ వచ్చారు. ఆఖరుకి ఆ వృద్ధుడు మళ్ళీ స్పష్టంగా సంగతులన్నీ చెప్పాడు. అతను పూర్తిచేసే టప్పటికి, తెల్లవారింది. వాళ్ళు చెప్పిన సంగతులే యీ పుస్తకములో ఉన్నాయి.

కాని మొట్టమొదట రెండు విషయాల్ని గూర్చి వివరంగా చెప్పవలసియుంది. దక్షిణ ఇటలీ దేశాన్నిగూర్చి యింతవరకు వ్రాయబడిన నవలలు, నాటకాలు, పద్యాలకీ, ఈ నవలలో వ్రాయబడిన సంగతులకీ యెక్కడా పొందూ పోలికా ఉండదు. అనేక పుస్తకాలలో దక్షిణ ఇటలీ దేశం ఆనందధామం అని సౌందర్యనిలయమనీ అక్కడ రైతులు పల్లెపడుచులు సాంప్రదాయసిద్ధమైన వారివారి దుస్తులను ధరించి సీతాకోకచిలుకల్లా కేరింతాలు కొడుతూ పనులలోకి వెడుతూఉంటారని, గండుకోయిలలు మధురంగాపాడుతాయనివర్ణించబడిఉంటుంది. కాని యెప్పుడూ ఫాంటమారాలో యీవిధంగా జరగలేదు. ప్రాంతీయవర్ణనల కోసం ఈ నవలని చదివేవారు నిరాశ పొందుతారు. సాంప్రదాయసిద్ధమైన దుస్తులనుగూర్చి గాని వారు మాటలాడుకొనే భాషనుగూర్చిగాని ఒక్కపదంకూడా యిందులో లేదు. ఫాంటమారా దగ్గర అడవి లేదు. పర్వత ప్రాంతం తక్కువ. ఆపినైనుపర్వతశ్రేణిలాగు యెండిపోయి చెట్లు, చేమలు మొలిచేందుకు అస్కారమివ్వదు. అక్కడ యేవో కొన్ని పక్షులుంటాయి, కాని ఒకకోయిలకూడా కన

పడదు. వాళ్లుమాట్లాడుకొనే భాషలో కోయిలకు పేరుకూడా లేదు. రైతులు కూలీపనుచులు అందరు కలసిగాని, ఒకొ్క-క్కరుగాకాని యెప్పుడు పాడుకోరు. తాగితందనాలాడేటప్పుడు కూడా పాడరు. వనులలోకి వెళ్లేటప్పుడు యెవళ్ల నోటనుంచీగా మాటే వినపడదు.

వాళ్లు పాడరు. శాపనార్థాలు పెడతారు. వారిలో యేదైనా సంతోషం, కోపం మొదలైన ఉద్రేకభావాలు పుట్టినప్పుడు బూతులు తిడతారు. వారి తిట్లలో గొప్పభావాలు, ఊహాలు ఉండవు. ఈ విషయంలో చూస్తే ఫ్లారంటెను వాస్తవ్యుల ఊహాశక్తి వీళ్లలో సున్న. వాళ్లకి తెలుసున్న పద పదాల్ని ఉపయోగించి శాపనార్థాలు, ఒట్లు పెడుతూంటారు. ఎప్పుడూ ఒకే తిట్లు ఒకే ఒట్లు. వాటిలో మార్పు ఉండదు.

నా చిన్నతనంలో ఫాంటమారాలో ఒక చెప్పులు కుట్టేవాడుండేవాడు. అతని క్కొక్కడికే అబిసీనియా యుద్ధాన్ని గూర్చి ఒక పాట వచ్చును.

జాగ్రత్త! "ఓ! బాల్డిస్సెరా!
నల్లవాళ్లను నమ్మేవు జాగ్రత్త! జాగ్రత్త!

ఈ రెండు పదాల్నే అదేపనిగా ఉదయం మొదలుకొని సాయంకాలంవరకు యేళ్లతరబడి పాడుతూండేవాడు. అతని వయస్సు మీరుతూన్నకొద్దీ కంఠంలో పటుత్వంతగ్గి క్షీణ స్వరంతో విచారసూచకంగా పాడుతోంటే బహుశా బాల్డిస్సెరాసేనాని పొరపాటువగాని, మందగొడ్డుగా ఉంటున్న మూలాన్నిగాని, పొగరుబోతుతనంచేతగాని ఆ నల్లవాళ్లను

నమ్మక ప్రాణాలకు మోసం తెచ్చుకుంటాడేమోనని ఊళ్ళో వాళ్ళు భయపడుతూండేవారు. చాలాయేళ్ళ తరువాత నిజంగా యీ దుర్ఘటన జరిగిందనీ, ఆ సేనాధిపతి నేను పుట్టకక్రితమే చచ్చిపోయాడని తెలిసింది.

నేను ఏ భాషలో యీ పుస్తకాన్ని వ్రాయాలీ అనేది రెండవ విషయం.

ఫాంటమారా గ్రామస్థులు ఇటాలియను భాష మాటలాడు తారని పొరబాటునకూడ అనుకోకూడదు. లాటిను, ఫ్రెంచి, ఎస్పరాంటో భాషలకిమల్లేనే ఇటాలియను భాషకూడా వారి శాలలలో నేర్పబడే భాష. మాకు ఇటాలియను పరభాష, మృతభాష. ఆభాష వ్యాకరణము, పదజాలము మేము ఆలో చించుకునే ఆలోచనలకీ, మేము మాటలాడుకొనే మాటలకీ సంబంధం లేకుండా వృద్ధిచేయబడింది.

మా దక్షిణ దేశంలోంచి పెద్ద పట్టణాలకి వెళ్ళినప్పుడు మాలో కొందరు జోళ్లు తొడుగుతారు. కాలర్లు, టైలు వేసు కొంటారు. ఆ విధంగానే ఇటాలియను భాషలోకూడ మా ప్రాంతంలో వాళ్లు కొన్ని పుస్తకాలు వ్రాశారు.

ఇటాలియనుభాష మా అభిప్రాయాల్ని చిదిమేసి రూపు మాపుతుంది. కొన్నికొన్ని భావాలు డొంకతిరుగుడుగాఉండి అనువాదాల్లోకిమల్లే మాతృకల్లోని సారస్వతాన్ని కోలు పోతాయి. అనువదించేటప్పుడు తన భావాల్ని పూర్తిగా ఆ భాషలోనే ఆలోచించటానికి అలవాటు పడాలి. నిజం

చెప్పవలసినస్తే ఇటాలియనుభాష, నాగరికత మాకు పరాయివి.

కాని మమ్మల్నీ, మా సమస్యల్నీ యితరు లర్థంచేసుకోవాలంటే మేము పాఠశాలలో నేర్చుకొన్న ఇటాలియను భాషలోనే వ్రాయవలసి ఉంటుంది. సాధ్యమైనంతవరకు మా జీవిత మరణ సమస్యల నన్నిటినీ ఆ భాషలోనే వ్రాసేందుకు కష్టించవలసి వచ్చింది.

ఫాంటమారా కథని పరభాషలో వ్రాస్తున్నప్పటికి వ్రాసే విధానంమట్టుకు మా సొంతపద్ధతే ఉంటుంది. కనీసం అదైనా ఫాంటమారా కళక్రింద ఉంటుంది. ఆ కళని దీర్ఘమైన రాత్రి సమయాల్లో నేతమగ్గాలవల్ల పుట్టే ఝుంఝుంధ్వనులలో మేము నేర్చుకొన్నాము.

ఒక పదం తరువాత ఒకటి, ఒక పంక్తి తరువాత ఒకటి, ఒక వాక్యం తరువాత మరొక వాక్యం క్రింద అల్లుకుపోతూండే కథలు చెప్పే కళ మన పూర్వులు నేతమగ్గాలమీద ఒక దారపుపోచ తరువాత మరొకటి, ఒకరంగు తరువాత మరొక రంగుని పరిశుభ్రంగా అందంగా నవకం చెడకుండేలా బట్టలు నేసే పద్ధతినే అనుకరించి ఉంటుంది. మొదట గులాబీ మొక్క వేళ్లు, ఆ పైన కొమ్మలు, తరువాత రెమ్మ రెమ్మకు ముళ్లు ఆకులు, పైన పూలగుత్తులు అల్లికలో వస్తాయి. మొదటినుంచీ కూడా గులాబి మొక్కనే మనం వేస్తున్నామని పట్టణవాస్తవ్యులు గ్రహిస్తారు. అందుచేత మనము తయారుచేసిన అన్ని వస్తువులూ ముతకగాను, అందవికారముగాను ఉంటాయని

పట్టణాల నాగరిక జనం తలుస్తోంటుంది. కాని మన మెప్పుడైనా పట్టణాలకు వెళ్ళి యీ వస్తువుల నమ్మ చూపామా? మనం మాట్లాడుకొనేరీతిగానే పట్టణంవాళ్ళనికూడా మాట్లాడమని కోరామా? లేదు యెప్పుడు కోరలేదు. తన కథని తనకు తోచిన విధంగా ప్రతి మనిషిని చెప్పనియ్యండి.

జ్యూరిచ్
1930 వేసవికాలం

ఇగ్నేషియో సైలోన్

# ఫాంటమారా

## ౧

నిరుడు జూన్ ఒకటో తారీఖున ఫాంటమారాలో మొదటి సారి ఎలక్ట్రిక్ దీపాలు ఆరిపోయాయి. రెండు, మూడు, నాల్గవ తారీఖులనాడుకూడా దీపాలు వెలగలేదు.

దీపాలు లేకుండానే వారాలు నెలలుకూడ గడచిపోతున్నాయి. ఆఖరుకి ఫాంటమారా చంద్రకాంతికి అలవాటుపడిపోయింది. వెన్నెల యుగానికీ, ఎలక్ట్రిక్ దీపాల యుగానికీ మధ్య ఒక శతాబ్దం గడిచింది. ఈ శతాబ్దములో నూనె దీపాలు, పెట్రోలు దీపాలుకూడ వెలిగాయి. కాని, మమ్మల్ని మళ్లీ అంధకారంలో ముంచేందుకు ఒక రాత్రి సరిపోయింది.

కుర్రాళ్ళకి తెలియదుగాని, ముసలాళ్ళకి బాగా తెలుసును. మా దక్షిణ రైతులకి పట్నంవాళ్లు తెచ్చిన వింతల్లో డెభ్భై యేళ్ల నుంచీ నిరంతరాయంగా వెలుగుతోన్నవి సిగరెట్లు, ఈ ఎలక్ట్రిక్ దీపాలును! ఆ ఎలక్ట్రిక్ దీపాల్ని మళ్లీ వాళ్ళు లాక్కుపోయారు. సిగరెట్లు కాల్చేవాళ్లు ఉక్కిరి బిక్కిరైనా మేం లెఖ్ఖచెయ్యం. మాకు పొగాకే సరిపోతుంది.

మొట్టమొదటిసారి, ఎలెక్ట్రిక్ దీపాలు వెలగకపోవడం ఎక్కువ ఆశ్చర్యాన్ని కలిగించవలసిన అవసరం లేదు. కాని మొత్తం మీద అది ఆశ్చర్యకరమైన విషయమే.

ఎలక్ట్రిక్ దీపం ప్రకృతిలో ఒక అంతర్భాగంక్రిందే మాకుంది. మేమెప్పుడు దానికి డబ్బు చెల్లించలేదు. ఎన్ని నెలలు గడిచినా ఒక పైసాకూడ మాలో యెవళ్ళు యివ్వలేదు.

బకాయీలు పడినవాళ్ళని అప్పులు చెల్లించెయ్యమంటూ నోటీసుల్ని కంపెనీ కలక్టర్లు యివ్వడంకూడ మానుకున్నారు. వాళ్ళిచ్చిన నోటీసు కాగితాల్ని మా పొగాకు గొట్టాల్ని తుడుచుకోనేందుకు ఉపయోగించే వాళ్ళం. ఆఖరుసారి వాళ్లు వచ్చినప్పుడు దేహాల్ని దక్కించుకొని బైటపడ్డారు. వాళ్ళ అదృష్టం మంచిదై పోయింది. లేకపోతే దేహశుద్ధి కావలసిందే. పెళ్ళాం బిడ్డలకు దూరమై ఉండేవాళ్ళే.

ఆ వచ్చిన కలక్టరు సాహసంకంటె విచక్షణాయుతంగా ప్రవర్తించడం మంచిదనుకున్నాడు. అందుచేత మొగాళ్ళు పనుల్లోకి పోయినప్పుడు ఫాంటమారావచ్చి ఆడవాళ్ళకిచ్చిపోతూండేవాడు. అతి వినయంతో ప్రవర్తిస్తూ సమాధాన పూర్వకంగా పరిహాసంచేసి

"ఒకటి తీసుకోండి. అది మీకేమీ అపకారముచేయదు. ఓ కాగితంముక్క ఇంట్లో ఉంటె యెందుకేనా పనికొస్తుంది", అంటూండేవాడు కాని యీ నక్క వినయాలవల్ల ఆవగింజంతయినా లాభంకలుగలేదు. ఓరోజునిఫాంటమారాలో కాదు లెండి; అవ్వూళ్ళో అడుగు పెట్టడంకూడా మానుకున్నాడు. ఆ చుట్టుపక్కలనేఉన్న ఓచిన్న పట్టణంలో ఓ బండివాడు ఆకలక్టరుతో "నిన్ను కాలిస్తే యేముందయ్యా? అన్ని పన్నులకీ నున్నాచట్టాలని చూస్తున్నాం. కాని ఒక గుండు పేలిం

దంటే పన్నులమాట యెలాఉన్నా మొట్టమొదట తపీమనే వాడవు మట్టుకు నువ్వే'' అని చూచాయిగా చెప్పాడు. అప్పట్నుంచి వాడా చుట్టుప్రక్కల ముఖం చూపించలేదు. ఫాంటమారా వాళ్ళమీద కోర్టులో దావాలు పడేసి డిక్రీలు పొందినా ఏమీ లాభం ఉండదని ఆలోచించి బుద్ధిమంతుడు కనుక ఆ ప్రయత్నం మానుకున్నాడు.

'' జలగలు పట్టించి, వీళ్లరక్తం పీల్చించే శిక్షవుంటే కోర్టుల్లో వీళ్లమీద దావాలు పడేసినా లాభం వుంటుంది. కాని అలాంటి శిక్షల్లేవు. అందుచేత ఎలక్ట్రిక్ సిటీని సప్లయి చేయకుండా ఉండటమే మంచిపద్ధతి'' అని ఒకళ్లతో ఒకసారి చెప్పాడట.

అసలు దీపాల్ని జనవరి ఒకటో తారీఖుకే కట్టివెయ్యాలని ప్రయత్నించారు. కాని, మార్చి మొదటితేదీ వరకు కూడా దీపాలు వెలుగుతూనే ఉన్నాయి. ఆఖరకు జూను నెలారంభంనుంచీ దీపాలు బందై పోయాయి.

ఇళ్లదగ్గర ఉన్న స్త్రీలూ, పిల్లలూ దీపాలు వెలగటంలేదని ఎంతో ఆలస్యంగా గాని గుర్తించలేదు. పనుల్లోంచి సాయంకాలం యింటికి తిరిగివస్తూన్న మా మొగాళ్లం ఈ విషయాన్ని ముందు గుర్తించాం. మిల్లులో పనిచేస్తున్న మాలో కొంతమంది పెద్దరోడ్డుమీద వస్తూఉన్నారు. కొందరు కొండ క్రిందనుంచి వస్తూన్నారు. ఇసుకత్రవ్వేందుకుపోయిన కొందరు కాలువగట్టుమీంచి వస్తున్నారు. వ్యవసాయ పనుల్లోకి పోయిన మిగతావాళ్ళు నాలుగు మూలలనుంచి యిళ్లకు

జేరుకుంటున్నారు. క్రమక్రమంగా చీకటి గాఢంగా అల్లుకుం టోంది. చుట్టుప్రక్కల ఊళ్ళల్లో దీపాలు వెలిగాయి. కాని ఫాంటమారా మాత్రం ఇంకా అంధకారంలోనే మునిగివుంది. చెట్లతోపుల్లోను, ముళ్ళపొదల్లోను, పేడకుప్పల చాటునా ఫాంటమారా దాక్కొని మాతో దోబూచులాడుతున్నది. దారీ డొంక, తెన్నూ తెరువూ తెలియకుండా ఉన్న ఆ పరి స్థితుల్లో ఎలక్ట్రిక్ దీపాలు లేకపోవడమంటే ఏమిటో మాకు బాగా తెలిసివచ్చింది. ఈ విషయం చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది. అయినా భ్రమ చెందవలసిన అవసరమూ లేదు.

పిల్లలు అది గొప్ప తమాషా అనుకున్నారు. మా పిల్లలకు సాధారణంగా వేళాకోళం ఆడుకొనేందుకూ, వెక్కిరించేం దుకూ ఏమీ అవకాశం చిక్కదు. ఏ మోటారుసైకిలు త్రొక్కేవాడో వెడుతూంటేనో, రెండు గాడిదలు కలుసు కున్నప్పుడో, ఏ యిళ్లయినా అంటుకొన్నప్పుడో వాళ్ళు మహా గోలచేస్తారు. ఏదైనా వీలు చిక్కిందంటే మట్టుకు వీళ్ళూరికే పోనీయరు.

మేం యింటికివచ్చేటప్పటికి బాల్డిసేరా సేనాని లబలబమొత్తు కుంటున్నాడు. వేసవికాలంలో అతని యింటి ముందుండే ఎలక్ట్రిక్ దీపపు వెలుతురులో చాలా రాత్రివరకు చెప్పులు కుట్టుకుంటూ ఉండేవాడు. పిల్లలంతా గుంపుగా అతని బల్ల చుట్టూచేరి మేకుల్ని, చాకుల్ని, కత్తుల్ని, తోలుముక్కల్ని చెల్లాచెదరు చేశారు. తోళ్ళను నానబెట్టే బాల్చీని అతని కాళ్ళ మీద ఒలకపోశారు. గొంతు చించుకొని శాపనార్థాలు

పెడుతూ, దృష్టికూడా తగ్గిపోయిన యీ వయస్సులో తన ఇంటిముందు దీపాన్ని తీసేసేందుకు తనెవళ్లకీ యే మపకారం చేశానని నెత్తి నోరు బాదుకున్నాడు. ఈ దుర్మార్గానికి హంబర్టురాజు ఏమనుకుంటున్నాడో?

ఈ దురన్యాయాన్నిగూర్చి హంబర్టురాజు ఏమనుకుంటున్నాడో వూహించడంకూడ కష్టమే.

ఆడాళ్లందరుచేరి గొణుక్కుంటూ, తిట్టుకుంటూనేయున్నారు. వాళ్లపేర్లు చెప్పడ మెందుకు్కాని వాకిళ్ళముందు కూర్చున్నారు కొందరు. పిల్లల్ని యెత్తుకొని అన్నాలుపెడుతున్నారు కొందరు. కొందరు రొట్టెలు చేసుకొంటున్నారు. మరి కొందరు అప్పుడే ఎవళ్ళో చచ్చిపోయినట్టు శోకన్నాల్ని యేడ్పు ఫక్కీలో చదువుతున్నారు. దీపాలులేని ఆ చీకటి రాత్రిలో వాళ్ల దరిద్రం మరీ భీభత్సంగాఉంది.

సోర్సనారా దొడ్డితడికముందు నేనూ, మిచలీ జోరిపా నిలుచున్నాము. లోసర్డో గాడిదని తోలుకుంటూ మా దగ్గిరికి వచ్చాడు. మరుక్షణంలో పాంజియో పిలాటోకూడ అక్కడికి వచ్చాడు. ఇతర పనులకి పోయిన ఆంటోనియో, సీయరప్పా బార్లెటా, వెనట్రీశాంటో, జలోండా, పాపాసిస్టో ఇంకా అనేకమంది వచ్చి గుంపుకూడారు. ఎలక్ట్రిక్ దీపాలు ఆరిపోటాన్ని గురించి, కొత్తపన్నులూ, పాతపన్నులూ, జిల్లా పన్నులూ, ప్రభుత్వపన్నులుగూర్చి మాట్లాడుకోడం మొదలు పెట్టాం. ఎప్పుడూ ఒకటే మాటలు. ఆ పన్నుల్లోనూ మార్పులేదు. మా మాటల్లోనూ మార్పులేదు. వందల

కొద్దీ సారులు వాటిని గూర్చే తర్కించాం. ఇప్పుడుకూడా వాటినిగూర్చే వాదించుకుంటున్నాం. హఠాత్తుగా మా గుంపుల్లోకి సైకిలుపుచ్చుకొని ఒక అపరిచితుడు ప్రవేశించాడు. రాత్రివేళవచ్చిన అతడెవరో ఊహించడంకూడ కష్టమే.

వాడు ఎలక్ట్రిక్ దీపాల మనిషికాదు. జిల్లా ఉద్యోగస్తుడూ కాడు. చాల అందమైనవాడు. నున్నగా క్షవరం చేయబడిన ముఖం, పగడపు పెదవులు, చిన్ననోరు, పల్చటి దేహం, మంచి బట్టలు మొత్తంమీద చాలా అందంగా ఉన్నాడు. సైకిలు పట్టుకున్న అతనిచెయ్యి బల్లికొమ్ము భాగంమల్లే పొట్టిగాను, కటువుగాను ఉంది. మడమలదగ్గిర్నుంచీ మోకాలు వరకూ సన్నటి తోలు చుట్టుకున్నాడు.

మేం మాట్లాడుకోటం మానివేశాం. ఇంకో క్రొత్తపన్ను వేశారని చెప్పేందుకే వచ్చాడు. అందుకేమీ సందేహం లేదు. అనుకనే వస్తే వాడి కాగితాలకికూడా ఎలక్ట్రిక్ దీపాల కలక్టరు కాగితాలకు పట్టిన గతే పడుతుం దనడంలో సందేహంలేదు. ఈ ప్రపంచంలో వాళ్ళు పన్ను వేయకుండా మానివేసిన వస్తు వేమిటా అనే మాకు పట్టుకున్నసందేహం. మేం అందరం బుర్రలు బ్రద్దలు కొట్టుకున్నాం. కాని ఎవళ్లకీ యేమీా తట్టలేదు.

ఈలోపుగానే ఆ నవీనుడు, మేక గొంతుకతో 'హోర్సనారా పీడుకి వితంతువు యెక్కడుంది?' అని రెండు మూడు ప్రశ్నలేశాడు.

వాకిలితలుపు దగ్గర పోర్సనారా విధవభార్య నిలబడి ఉంది. ఆమె కడుపుతో ఉంది. పాలిపోయిన ఆమె విగ్రహం వికృతంగా ఉంది. ప్రపంచయుద్ధంలో ఆమె భర్త చనిపోయాక, యిది మూడో కడుపో నాల్గో కడుపో. ఆమె భర్త యుద్ధంలో వీరుడిలా చనిపోయాడు కాబట్టి పెద్ద ఉద్యోగస్తులతో కూడ ఆమె పరిచయం కలిపించుకోనేది. ప్రక్కనున్న పట్టణంలో దేశభక్తుల స్మారకదినోత్సవం జరిగినప్పుడు ఆమెకి మతాధిపతి ప్రక్కనే కుర్చీ యిచ్చారు. ఆమె కెప్పుడు గర్భమొచ్చినా దాచుకొనేందుకు వీల్లేనంత వికృతంగా ఉండేది. ఆ మతాధిపతి కళ్ళింకా పో లేదుగా మరి.

"ఐతే అమ్మాయి, మళ్ళీ పెళ్ళిచేసుకున్నావా" అని అడిగాడు. ఆమె లేదని చెప్పింది. అతను ఆమె గర్భాన్ని గూర్చి ప్రస్తావించాడు. తత్తరపాటుతో చనిపోయిన తనభర్తే దానికి కారకుడని చెప్పింది.

దీన్నిబట్టి ఆమెకి గౌరవనీయులతో యేవిధంగా ప్రవర్తించాలో తెలుసునని తేలుతోంది. ఆ క్రొత్తవార్ని బల్లదగ్గర కుర్చీవేసి కూర్చోమంది. జేబులోంచి ఓ పెద్ద కాగితాలకట్ట తీసి బల్లమీద పెట్టాడు.

ఆ కాగితాలకట్ట చూడగానే మా అనుమానం దృఢమైంది. అవి తప్పకుండా పన్నుల నోటీసులే. కాని ఆ దేవన్కో అనే చిక్కుప్రశ్న మాత్రం మమ్మల్ని విడవడంలేదు.

ఆ నవీనుడు మాట్లాడ నారంభించాడు. మాటల ధోరణి చూచి వాడు పట్టణంవాడని ఒక్కక్షణంలో పసిబట్టేశాం.

అక్కడో మాట, అక్కడో మాట మట్టుకే మా కర్థ మవుతున్నాయి. కాని యే పన్నునుగూర్చి మాట్లాడుతున్నాడో మాత్రం తెలియడంలేదు. ఈ లోపుగ చాలా పొద్దుపోయింది. తట్టలు, పారలు గునపాలు, కొడవళ్ళు పట్టుకొని మేం నిలబడి ఉన్నాం. లోసర్డో వాడి గాడిదతో అక్కడే నిలబడిపోయాడు. వెనర్టి శాంటో, బారెట్టా, పాపాసిట్టోలు వెళ్ళిపోయారు. సీరప్పా, ఆంటోనియోలు ఫాడి వాగుణ్ణి కొద్ది నిముషాలు విని వాళ్ళుకూడా వాళ్ళింటికి పోయారు. లోసర్డోకి ఉండాలని ఉన్నా అలసిపోయిన వాడి గాడిద వాణ్ణి యింటివైపుకు లాక్కుపోయింది.

ఆ పట్టణంనుంచివచ్చిన మనిషీ మేమొక ముగ్గురంమాత్ర మే మిగిలాం చివరకు. మంచినీళ్ళ ప్రవాహంలా లొడలొడ వాగుతూనే వున్నాడుకాని మాకొక్క మాటైనా గూడా అర్థమవడంలేదు. ఆ క్రొత్త పన్నేమిటో, క్రొత్తపన్ను దేని మీద వేస్తున్నారో మాకేమీ బోధపడ లేదు.

ఆఖరికి ఆ మనిషి మాట్లాడ్డం మానేసి నావైపు తిరిగాడు. నేనే దగ్గరగా ఉన్నాను. చిన్న తెల్లకాగితాన్నితీసి ఓపెన్సిల్ని స్తూ 'దయయుంచి సంతకం చెయ్యండి' అన్నాడు.

ఎందుకోసం సంతకం చెయ్యమంటున్నాడు? అంత ఉపన్యాసంలో మాకు పనమాటైనా అర్థంకా లేదు. ఒకవేళ అర్థం అయితేమాత్రం. సంతకం చేయవలసిన అవసరం ఏముంది?

నా ప్రక్కనున్న మనిషివైపు తిరిగి పెన్సిల్నీ, కాగితాన్నీ అందిస్తూ సంతకం చెయ్యండి అయ్యా అని అడిగాడు.

నా ప్రక్కనున్న మనిషికూడా సమాధానం చెప్పలేదు. పట్టణంనుంచి వచ్చిన ఆ మనిషి మూడోవాడి కందిస్తూ "మీరు ముందు సంతకం చెయ్యండి. మీరుచేస్తే తక్కిన వాళ్ళుకూడా చేస్తారు" అని అడిగాడు.

ఇటికిగోడకు చెప్పినట్టే అయింది. ఒకమాటకూడా యెవరు చెప్పలేదు. అదేమిటో మా కర్థం కానప్పుడు మే మెందుకు సంతకం చెయ్యాలి ?

ఆ పట్టణవాసికి ఒళ్లు మండిపోయింది. వాడి మాటలధోరణిని బట్టి తీవ్రంగా నిరసిస్తున్నారని మాకు దోచింది. కాని పన్నులనుగూర్చి యేమీ మాట్లాడడం లేదు. క్రొత్తపన్నును గూర్చి యేమన్నా చెబుతాడేమోనని మే మెదురుచూస్తూ వుంటె దాన్ని తప్పించి యింకా అనేక విషయాల్ని గురించి మాటలాడుతున్నాడు. కొంత సేపయ్యాక సైకిలికకట్టిన కమిచీ తీసి నాముఖందగ్గిరగా వూపుతూ మాట్లాడ లేవేం మొద్దా ?" అని అరిచాడు. "నీతోటి మాట్లాడుతుంటే సమాధానం చెప్పవూ? ఎందుకు సమాధానం చెప్పలేవో చెప్పు?"

మేం మట్టిబుర్రల మనుష్యులంకామనీ, ఆయన యెంత చమత్కారంగా మాట్లాడినా ఆయన యేం పన్నులకోసమని వచ్చాడో అసంగతి బైటపడేస్తేకాని మాట్లాడలేవని చెప్పాము.

"ఆ విషయాన్నిగూర్చి మీ కిదివరకే తెలుసు. ఇలాంటివన్ని అనుభవాలయ్యాయి. ఇంటిపన్ను, దొడ్డిపన్ను, గాడిదపన్ను, కుక్కపన్ను, పచ్చగడ్డిపన్ను, పందిమీదపన్ను, బళ్లపన్ను,

సారాయి మీద పన్ను యీ పన్నులు చాలవూ? ఇంకా దేని మీద వేస్తారు?''

నేను హీబ్రూభాష మాట్లాడుతున్నట్లు నాకేసి చూశాడు. కొంచెం నిరాశపడినట్లు కనపడుతున్నాడు.

మనం యింతసేపట్నుంచి మాట్లాడుకుంటూనే వున్నాంగాని, ఒకరిమాట లొకళ్ళకి అర్థంకావడంలేదు. మనం ఒకేభాషలో మాట్లాడుతోన్నప్పటికీ, ఒకేభాష మాట్లాడం అన్నాడు.

ఆ విషయం నిజమే. పట్టణవాసి, పల్లెటూరి రైతు ఒకణ్ణొకరు అర్థంచేసుకోవడం చాలా కష్టం. పట్టణంనుంచి వచ్చిన మనిషిలాగు మాట్లాడాడు. పట్టణంనుంచి వచ్చినవాడిలాగు తప్పి వేరేవిధంగానూ మాట్లాడలేడు. మరి మేమో పల్లెటూరి బీదరైతులం! మేము రైతుల్లాగే అర్థం చేసుకో గలుగుతాం. పట్టణవాసులూ, పల్లెటూరి రైతులూ చాలా భేదంగా ఉంటారని నా జీవితంలో వేలకొద్దీసార్లు గుర్తించాను. అర్జంటైన్, పాంపామైదానాల్లో నా చిన్నతనంలో వుండేవాణ్ణి. స్పెయిన్ రైతులు మొదలుకొని యిండియన్ రైతులవరకూ అన్నిజాతుల కర్షకులతోటీ నేను మాట్లాడాను. ఫాంటమారాలో మా రైతుల మందరమూ యెంత సులాగ్గా ఒకళ్ళ నొకరము అర్థంచేసుకో గలుగుతున్నామో ఆవిధంగానే అక్కడకూడ మేమందరము మా కష్టసుఖాల్ని చెప్పుకుంటుండేవాళ్ళం. ప్రతి ఆదివారమూ ఒక ఇటాలియన్ ఉద్యోగస్తుడితో మాట్లాడుతుండేవాణ్ణి. ఆయన అమెరికాలో ఇటాలియన్ రాయబారంలో ఉంటుండేవాడు. ఒకళ్ళు మాట్లా

షేది మరొకళ్లకు తెలియకుండా సంభాషణ సాగించేవాళ్లం. ఒక్కొక్కప్పుడు మేం అన్నదానికి వ్యతిరేకార్థంకూడా చేసు కొనే వాళ్ళం.

ఆ కొత్తమనిషి తాను పన్నులకోసం రాలేదనీ తనకీ పన్నులకీ యేమీ సంబంధం లేదనీ, తాను వచ్చిన పని పూర్తిగా వేరనీ మళ్ళీ విశదపరిచాడు

రాత్రి ప్రొద్దుపోతోంది. చాలా చీకటిగాఉంది. అతడు చేతి అగ్గిపుల్లలు వెలిగించి ఒక్కొక్క కాగితాన్నే చూపిస్తున్నాడు. అవ్వన్నీ నిజంగా ఖాళీకాగితాలు. అవి పన్నుల నోటీసులు కావు. అవ్వన్నీ పూర్తిగా ఖాళీగా ఉన్నాయి. ఒక్క కాగితం మీద మాత్రం పైన ఏదో వ్రాయబడిఉంది. రెండు అగ్గి పుల్లలు వెలిగించి అదేమిటో మాకు చూపించాడు.

" ఈ క్రింది సంతకాలు చేసినవారు వారంతటవారే స్వయంగా పైన వ్రాయబడిన విషయాల నన్నిటినీ ఆమోదిస్తో, మిలిటరీ సేనాని గౌరవనీయులైన పెలినోగారికి వారి సంతకముల నిచ్చియున్నారు.

తానే గౌరవనీయుడైన పెలినోఅనీ, వాళ్ళంతా సంతకాలు చేసిన తర్వాత వాటిని ప్రభుత్వానికి పంపిస్తాననీ విశదపరి చాడు.

పై అధికార్లు ఆ కాగితాల్ని పెలినోకి యిచ్చారు. ఈ రక మైన కాగితాల్నే తన సహచరులు చుట్టుప్రక్కల గ్రామా లకి తీసుకెళ్ళారు. ఆ కాగితాలు ఒక ఫాంటమూరాకే కాదు అన్ని ఊళ్ళకీ కూడాను. ఆ మహాజరు అతని దగ్గర లేదు.

అందులో యేముందో కూడా అతనికి తెలియనిమాట నిజమే. పై అధికార్లచేత వ్రాయబడుతుంది. అతడు చెయ్యవలసిన పని అల్లా సంతకాలు పోగుచేసుకు రావడం, రైతులు చెయ్య వలసిన పనల్లా సంతకాలు పెట్టడం.

"పల్లెటూరి వాళ్లని ధిక్కరించి అసహ్యించుకునే రోజులు దూరమయ్యాయి. ఇప్పుడు గవర్నమెంటు రైతుల అభిప్రాయాల్ని లెక్కజేసే మనుష్యుల చేతుల్లోవుంది. అందుచేత సంతకాలు చెయ్యమని మిమ్మల్నందరని ప్రార్థిస్తున్నాను. మీ కష్టసుఖాలు విచారించేందుకు దయాపూర్వకంగా వారు పంపిన ఒక ఉద్యోగికి యీవిధంగా కృతజ్ఞత చూపండి''అని తన చిన్న ఉపన్యాసాన్ని ముగించాడు.

మా కింకా సందేహం పూర్తిగా పోలేదు. కాని, యీ లోపుగా బాల్డిసేరా మాదగ్గిరకి వచ్చి అతను చెప్పిన చివరి మాటలు విన్నాడు. "ఐతేసరే! గౌరవనీయులైన సభ్యులు మన మేమీ కొత్త పన్నులు యివ్వనక్కర్లేదని వాగ్దానం యిస్తే నేను మొదట సంతకం చేస్తాను'' అని చెయ్యి జాపాడు.

అన్నట్టే అందరికంటే ముందు సంతకం పెట్టాడు. ఆ తర్వాత నేను, ఆ పక్కని ఉన్న పిలాటో మిచలీ జోంపా, మేరి యుట్టాలు సంతకాలు చేశాం. ఐతే తక్కినవాళ్ళ సంగతేమిటి? అంత రాత్రివేళ తక్కినవాళ్ళ సంతకాలు యెలా దొరుకుతాయి? యింటింటికివెళ్ళి సంతకాలు తీసుకోవడం అసాధ్యమైన పని. గౌరవనీయుడైన పెలినోకి ఒక ఆలోచన

పెట్టింది. ఫాంటమారాలో ఉన్న రైతులందరిపీ పేర్లు మేం చెబితే తానే వ్రాసేస్తానని చెప్పినాడు.

ఆ విధంగానే మేము చేశాం. బెరార్డో వయోలా పేరుదగ్గర మాత్రం కొంచెం గమ్మత్తుగా సంభాషణ సాగింది. బెరార్డో అంటే ప్రాణంపోయినాసరే సంతకం చెయ్యడు అని నేను చెప్పినప్పటికీ పరవాలేదు, అంటూ పేరు యెక్కించేశాడు.

రెండవ పేజీ కూడా పేర్లతో నిండిపోయింది. ఆ నవీనుడు అప్పుడే ముప్పై నల్భై అగ్గిపుల్లల్ని వెలిగించాడు. ఆఖరి పుల్ల కాంతిలో మేజాబల్లమీద యేదో ఉన్నట్టు అనుమానం తట్టింది. అతనికి విస్మయాన్ని, భయాన్ని కలిగించింది. కాని అక్కడేం కనిపించలేదు. ఒక అగ్గిపుల్ల గీసి బల్లని జాగ్రత్తగా పరీక్షించాడు. వేలితో బల్లమీద చూపిస్తూ అతని మేక గొంతుకుతో గట్టిగా అరవటం మొదలెట్టాడు.

"ఇదేమిటి?" యీ వస్తువు ఎవళ్లది? ఎన్ని గుండెలతో దీన్ని యీ బల్లమీద పెట్టారు?"

ఏదో ఆపద కలుగుతుందని యెంచుతోన్నట్లు కనపడుతోంది. ఎవరూ సమాధానం చెప్పలేదు. సమయం కనిపెట్టి బాల్డిస్సేరా సేనాని యింటికి జారుకున్నాడు. ఆ అపరిచితుడు మూడు నాలుగుసార్లు అవే ప్రశ్నలు వేసి యెక్కువ కాంతివచ్చేందుకు మూడు అగ్గిపుల్లలొక్కసారే వెలిగించాడు. ఆ వెల్తుర్లో ఆ బల్లమీద ఏదో ఉన్నట్లు కన్పడింది— అది కదుల్తోంది.

మొట్టమొదట పిలాటో లేచి బల్లమీద వంగి దాన్ని జాగ్రత్తగా పరీక్షించి అది నాది కాదు అన్నాడు.

నేను కూడా అల్లాగే చేశాను. దాని కేసి చూసి, ముట్టుకొని పొగాకు గొట్టంతో ఇటూ అటూ దొర్లించాను. నేను యదార్థంగా చెప్తున్నాను. అది నాది కాదు. మిచీలీ జోంపా ఇదేమీ అర్థము కానట్లు నటించి చుట్ట కాల్చుకుంటూ ఆకాశం వేపు చూస్తున్నాడు. మేరియట్టా కూడా బల్లమీద వంగి దీక్షగా దాన్ని చాల సేపు చూసింది. పేర్లు వ్రాయబడ్డ కాగితముమీది కది జేరుకుంటే దాన్ని అరచేతిలోకి తీసికొని జోంపా వీధిలోకి గిరవటేసింది.

"అబ్బ యెంత ఆశ్చర్యంగా ఉంది! చాల కొత్తగా ఉంది. ఇదొక కొత్త పురుగు—పొడుగ్గా నల్లగావుంది. దాని వీపు మీద క్రాస్ గుర్తు.

మిచీలీజోంపా గబుక్కున లేచి నుంచుని అరవడం.

"ఏమిటి? ఏమిటి దాని వీపుమీద నిజంగా క్రాసుగుర్తుందా? ఉన్నప్పటికి దాన్ని నీవు పారేశావా? అయ్యయ్యో! పోప్ గారి పురుగునే చేతులారా గిరాటేశావా!" 'సమాధానం' పురుగునేనా! నిన్ను దేశంనుంచి అవతలికి వెళ్లగొట్టెయ్యాలి. దుర్మార్గపు ముండా, నువ్వు ... ...

ఈ గొడవేమిటో మాకేమీ అర్థంకావడంలేదు. అందుచేత మిచీలీ మాకు తెలిసేట్లు చెప్ప నారంభించాడు.

"నిరుడు వర్షాకాలంలో నాకొక కలవచ్చింది. అక్బేపిరో మతగురువుకి ఆ కల చెప్పాను. ఆయన ఈ విషయము యెవళ్లతోటీ చెప్పవద్దని నన్నాజ్ఞాపించాడు. కాని స్వప్నము

అది ప్రత్యక్షమైంది. మేరియట్టా చెప్పిందే నిజమైతే అదే సాక్షాత్కరించింది గనుక దానిని మీకు చెప్పొచ్చు.

పీఠాధిపతికి, ప్రభుత్వానికి రాజీ జరిగాక అబ్బేపియో గురువు గారు క్రీస్తుదేవుడి సిలువ మెట్లమీదనుంచి మన దేశానికి చాలా మంచిరోజు లొస్తున్నాయని ప్రకటించారు. క్రీస్తు భగవానుడు పీఠాధిపతికి రైతులు ఏది కోరితే అది యిచ్చేం దుకు ఒక వరం యిచ్చాడు. ఏసుప్రభువుతో పీఠాధిపతి మాట్లాడుతోన్నప్పుడు నా కళ్ళారా నా కలలో చూశాను.

"సంధి బాగా కుదిరింది గనుక ఫ్యూసినో భూముల్ని వాటిని దున్నుకునే రైతులకి పంచిపెడితే బాగుంటుందని యేసుప్రభు వన్నాడు.

"ఓ ప్రభూ! టార్లోనియోరాజకుమారు డలా పంచిపెట్టేం దుకు ఒప్పుకోడు...... సెంటుపీటరు నిధికి ఆయన పుష్క లంగా చందాయిస్తున్నాడని మర్చిపోకండి" అని పీఠాధిపతి సమాధానమిచ్చాడు.

"సంధి కుదిరినందుకు సంతోషాన్ని వెల్లడిజేస్తూ రైతుల పాతబకాయిలన్నీ రద్దుచేసి యికముందు పన్ను లిచ్చుకో నక్ఖర్లేదని ప్రకటించమని" ఏసు ప్రభువు కోరాడు.

"ఓ ప్రభూ! యిల్లా చేసేందుకు ప్రభుత్వం ఒప్పుకోదు. రైతులు చెల్లించే పన్నుల్లోంచే ప్రభుత్వం మన సెంటుపీటర్సు నిధికి నలభై లక్షల రూపాయల్ని ఏకేటా యిస్తోంది" అని పీఠాధిపతి సమాధాన మిచ్చాడు.

"రాజీ కుదిరి శాంతియేర్పడినందుకు సంతోషాన్ని వెల్లడిస్తో పంటలు అమితంగా పండేటట్లు చేస్తే బాగుంటుంది. బీద రైతులు చాలా సుఖిస్తారు' అన్నారు ఏసు దేవుడు.

"ఓ ప్రభూ! పంటలు దిట్టంగా పండితే ధాన్యాల ధరలు పడిపోతాయి. మన మతగురువుల్నీ, మఠాధిపతుల్నీ, పెద్ద పెద్ద భూస్వాముల్నీ మరచిపోయి ఆ విధంగా "అనుగ్రహించకండి" అన్నాడు పీఠాధిపతి.

ఇతరులకి నష్టంరాకుండా రైతుకి ఉపకారం చేయలేని తన అసమర్థతకి ఏసుప్రభువు చాల చింతించాడు. అందుచేత బీదరైతుల్ని అమితంగా ప్రేమించే మన పీఠాధిపతి యీ విధంగా మనవి చేశాడు.

"ఓ ప్రభూ మనమే వెళ్ళి తణిఖీ చేసుకొద్దాం. బహుశా టార్జానియో రాజకుమారుడికీ, ప్రభుత్వానికీ, మత గురువులకీ నష్టంరాని పద్ధతిని రైతుకి యేమన్నా సహాయం చేయ గలమేమో చూచివద్దాం.

అందుచేత రాజీకుదిరిన నాటి సాయంకాలం ఏసుప్రభువు, పీఠాధిపతీ యెగిరొచ్చి ఫ్యూసికో జమీందారుని, మార్సికా జిల్లా గ్రామాలన్నిటిని స్వయంగా పరీక్షించారు, పెద్దమూట భుజంమీద వేసుకొని ఏసుప్రభువు ఆయన వెనకాల పీఠాధిపతి మోసుకొస్తూ వస్తున్నారు. రైతుల నుద్ధరించడానికని కావలసినవి మూటలోనుంచే తీసుకొమ్మని ప్రభువు సెలవు ఇచ్చాడు.

ప్రతిగ్రామంలోను ఆపూజ్యులు ఒకేవిశేషాన్ని చూస్తున్నారు.

రైతులు గోలుపెట్టుకుంటున్నారు, తిట్టుకుంటున్నారు, వృథాగా జీవితాల్ని వ్యర్థం చేసుకుంటున్నారు. ఆరోజు కారోజుకీ దరిద్రము హెచ్చిపోతుంది. అన్నంకోసం, బట్టకోసం ఎటు చూడాలో తెలియక తపించిపోతున్నారు. ఈ పరిస్థితుల్ని చూడగానే శిలాధిపతి గుండె నీరైపోయింది. ఆయనచేత ఆ మూటలోంచి ఒక నల్లటి పెద్ద పుస్తకం తీసి మాన్సికాజిల్లా మీద వదిలాడు.

"ప్రియమైన నా బిడ్డలారా! దీన్ని తీసికొని మీలో మీరు తగాదాలు పడుతూ ఉండండి. మీ తీరుబడిసమయాల్లో పాపపు అభిప్రాయాలనుంచి ఆ వివాదాలు మిమ్మల్ని రక్షిస్తాయి" అని ఆయన సెలవిచ్చారు.

ఇదీ మిచీలీ జోంపాకు వచ్చిన కల. ఎవరికి తోచినట్టు వాళ్ళు కలల్ని చెప్పుతుంటూ ఉంటారు. అనేకమంది వాటిని గురించి లెక్కచెయ్యరు; మరి కొందరు భావి లాభాలని చెప్తారు.

నా ఉద్దేశ్యములో జోకొట్టేందుకు పనికొస్తాయికాని. మతం పిచ్చి, మూఢనమ్మకాలు ఉన్న సోర్సనారా ఏడుస్తూ ఈ విధంగా అనడం ఆరంభించింది.

"అది నిజమే. అంతా నిజం. మన గురువుగారు లేకపోతే పాపములనుంచి ఎవళ్ళు రక్షిస్తారు మన్ని? నరకమునుంచి ఎవళ్ళు తప్పిస్తారు?"

ఈ కలకి గౌరవనీయుడైన పెలినో యింకొక అర్థం తీశాడు. "మీరంతా నన్ను వేళాకోళం చేస్తున్నారు" అని అరుస్తూ కమిచీని జోంపా, సోర్సనారాలవైపు ఝూషించాడు. మీరు

వేళాకోళాలు చేస్తున్నారు. అధికారులతోటి వేళాకోళాలు చేస్తారా? ప్రభుత్వాన్ని, మతాన్ని ధిక్కరిస్తారా?''

ఇదే ధోరణిలో సాగించాడు. అతను ఏం చెబుతున్నాడో అతని కెందుకు కోపము వచ్చిందో నాకేమీ అర్థమవ లేదు.

''మీ స్థానాల్లో మిమ్మల్ని ప్రభుత్వం ఉంచుతుంది లెండి' మరీ మ్రేలేగి పోతున్నారు. ప్రభుత్వం శిక్షిస్తుంది. అప్పుడే అయిపో లేదు. ముందుంది ముసళ్ళపండుగ.''

ఇల్లానే వాగివాగి అయాసమొచ్చి వాడే ఊరుకుంటాడు అని మే మనుకున్నాం. అదేరీతిగా ఏకరువు పెడుతున్నాడుగాని ఎక్కడా ఊరుకోటం లేదు.

''నాకు కోపంవస్తే మీరు మాడిపోతారు తెలుసునా? మీకు పదేళ్ళ జైలుశిక్ష వేయిస్తాను''. అంటూ మిచీలీవైపు తిరిగి గద్దించాడు. ''ఇంతకంటె తక్కువ రాజద్రోహమైన మాటలు మాట్లాడినందుకే అనేకమంది కఠిన నరకం అనుభవిస్తున్నారు. మీ రే ప్రపంచకంలో నివసిస్తున్నారయా? ఈ మధ్యని మూడు నాలుగేళ్లనుంచి ఏమి జరుగుతోందో మీకేమన్నా తెలుసునా తెలియదా? ఇప్పుడు యీ దేశానికి యజమాని ఎవరో ఎరుగుదురా? ఎవళ్ళ అధికారములో ఉన్నారో తెలుసునా?''

ఆయన్ని శాంతపర్చాలని ఓర్పుతో నెమ్మదిగా జోంపా సమాధానం చెప్పాడు.

''అయ్యా, ఇల్లాచూడండి. పట్టణాల్లో అనేకవిషయాలు జరుగుతూంటాయి. పట్టణాల్లో కనీసం రోజుకి ఒక వింతైనా

జరిగి తీరుతుంది. రోజుకి ఒక వార్తాపత్రికవచ్చి, కొత్త సంగతులిక్క తెలియపరుస్తుంది. ఏడాదికి కొన్ని వేల కొత్త సంగతులు తెలుస్తాయి. వేలూ, లక్షలుకూడా ఔతాయి. కస్తూరి పురుగుల్లాగు గనా పల్లెటూళ్ళకు అంటిపెట్టుకొని ఉండే మాబోటి బీదరైతులకి ఈ విషయాలు ఎలా తెలుస్తాయో చెప్పండి, బాబూ! ఏదోవిధంగా పనులు జరుగుతోంటాయి. వాటికి అధికార్లకి ఏమీ సంబంధం ఉండదు. అధికారంలో ఉండేవాళ్ళు, అప్పుడప్పుడు పేర్లు మార్చుకుంటారన్నమాటే కాని వాళ్ళెప్పుడు అధికార్లే.''

''ఆచార్యాధిపత్యం కూడా అంతేనా? మతగురువు పరిపాలనా అంతేనా?'' అంటూ పట్టణ వాస్తవ్యుడు ప్రశ్నించాడు. ఆచార్యాధిపత్యం అంటే ఏమిటోకూడా మాకు తెలియదు. ఆ పదాన్నే పదేపదే అంటున్నాడు. అనేక మాటల్లో మాకు అర్థం అయ్యేట్లా చెప్పేందుకు ప్రయత్నిస్తున్నాడు. చివరకి మిచేలీ సమాధానం యిచ్చాడు.

''అందరి నెత్తులమీద దేవుడున్నాడు. ఈ సృష్టికంతకీ అధిపతి''

''ఆయన తరువాత టార్లోనియా రాజకుమారుడు ఈ ప్రపంచానికి అధిపతి''

''ఆ తర్వాత టార్లోనియా రాజకుమార్ గారి సాయుధ సైనికులున్నారు.''

''వాళ్ల తర్వాత రాజకుమార్ గారి సాయుధసైనికుల కుక్కలున్నాయి.''

"వాటి తర్వాత యింకేమీ లేవు. అటు తర్వాతకూడా యేమీ లేవు. అన్నిటికంటె ఆఖర్ని రైతులున్నారు. అంతే, అంతటితో ఆఖరు."

"ఐతే అధికార్లో; వాళ్లెక్కడ ఉన్నారు?" అంటూ గోపంతో మండిపడ్డాడు ఆ పట్టణవాసి. ఆ కోపానికి పట్టపగ్గా ల్లేనంతగా ఉన్నాయి.

"అధికార్లు మూడు నాలుగు వర్గాల్లోకి చెందుతూఉంటారు. వాళ్లవాళ్ల జీతాల్నిబట్టి" అని పిలాటో విశదపరిచాడు. నాలుగవ వర్గం (కుక్కలది) చాలా పెద్దది.—గౌరవనీయుడైన పెలినో లేచి నిలబడ్డాడు. కోపంతో నిలువెల్లా కంపించి పోతోంది. "నా తడాఖా చూపిస్తాను. ఈ విషయం ఇంత తేలిగ్గా తేలిపోదులే. వాగ్దానం చేస్తున్నాను." అంటూ వెళ్ళిపోయాడు. "చూడండి మీ భరతం పట్టిస్తా."

## ౨

మరుచటి ఉదయం ఒక అసాధారణ విషయం జరిగి ఘాంట మారా అంతా గగ్గోలు పడింది.

ఘాంటమారాగ్రామం ప్రవేశించే చోట, ఒక రాతికొండ ఉంది. దానిమీద నుంచి ఒక సన్నని జలధార పరుతో వుంటుంది. జలపాతం పుట్టుక స్థలాన్నుంచి కొద్ది అడుగుల మారం తరువాత, యిసుక ప్రదేశములోదూరి మాయమై మళ్ళీ బోదకాలవకింద తేలి వడివడిగా కొండకిందికి ప్రవహిస్తోంది. ఆ చిన్న కాలవ అనేక మలుపులు తిరిగి చివరికి

ఫ్ర్యాసినో దిక్కుగా పారుతుంది. ఫాంటమారా గ్రామస్థులు లోయలో ఉన్నవాళ్ల కొద్ది పొలాల్ని తడుపుకునేందుకు కావలసిన నీటిని యీ కాలువనుంచే పెట్టుకుంటూ ఉంటారు. ఇంతకంటే వాళ్లకి వేరే జలాధారం లేదు. ప్రతి వేసంగిలోనూ నీటిని పంచుకునేందుకు తీవ్రమైన సంఘర్షణలు, బుర్రలు బ్రద్దలు కొట్టుకోవడంతో ముగిస్తాయి.

జూన్ రెండవ తారీఖున పనిచేసుకునేందుకు కొండదిగి వెళుతూన్న ఫాంటమారా రైతులు ఒక కొత్త విషయాన్ని చూశారు. గునపాలు, పారలూ, తట్టలూ తీసికొని చాలమంది రోడ్డు బాగుచేతకూలీలు ఆ కాలవ ప్రక్కకువచ్చారు. అంతవరకు ఆ కాలవ మా వూరు పొలాలకి, తోటలకి మధ్య నుంచీ ప్రవహిస్తోంది. ఇప్పుడు ప్రవాహ మార్గాన్ని మార్చి మా గ్రామానికి సంబంధించని కొన్ని ద్రాక్షపళ్ల తోటల్లోంచి తీసుకొని వెడతామని వాళ్లుచెప్పారు. ఈ ప్రపంచం సృష్ట్యా పుట్టినప్పటినుంచీకూడామా పొలాలమధ్యనుంచి పారుతోన్న ఏటిని పట్టణంలోఉన్న డాన్ కార్లో జమీందారుకి చెందిన భూముల్లోకి పెట్టుకుంటా ననడం ఘోరంకాదూ. మేము పట్టణం వెళ్ళి డాన్ కార్లో జమీందారు యింట్లో ఉన్నాడా? అని దాసీని అడిగితే "జమీందారుగారా? ఆ ఉన్నారు. ఫలహారం తీసుకుంటున్నారు. భోజనంచేస్తున్నారు అబ్బే ఆయన దర్శనం దొరకదు. అంతపని ఉంటే అమ్మగారు దర్శనం యిస్తారు." అని చెబుతోండేది.

ఒకటి రెండు నిమిషాలవగకూ రోడ్డు పనివాళ్ళు మాతో వేళాకోళం ఆడుతున్నారని అనుకున్నాం. పట్టణంవాళ్లకి మమ్మల్ని

వేళాకోళంచేసి ఏడిపించడం చాల సరదా. ఈ సుధ్యాని ఐదా రేళ్లలో వాళ్లు చేసిన తమాషాలు వర్ణించి చెప్పాలంటే ఒక రోజు పడుతుంది. మత ప్రచారకుడు, గాడిదల రిఫ చెబుసే వాళ్ళు యెలాంటి తమాషాలు చేసేవాళ్ళో తెలుస్తుంది

ఫాంటమారాలో ఎప్పుడూ పురోహితుడు లేడు. ఇచటి యేసు దేవాలయంమీద వచ్చే రాబడితో పురోహితుడి కుటుంబం గడవదు. అందుచేత ముఖ్యమైన పండగలనాడూ, పవిత్రమైన రోజుల్లోనూ డాన్ అబ్బేషియో ఫాంటమారా వచ్చి గ్రామస్థులందరిచేతా ప్రార్థన చేయించి బైబిలు బోధించే వాడు.

రెండేళ్ల క్రితం మాకొక పురోహితుణ్ణి పంపమని మత గురువుకో ప్రత్యేకంగా విన్నపం చేసుకున్నాము. కొద్ది రోజుల తర్వాత మా ప్రార్థన మన్నించబడిందని, మా కొత్తపురోహితుడుగారు వచ్చేరోజున పెద్ద ఉత్సవం చెయ్యవలసిఉంటుందని తెలిసింది. సహజంగా చాల సంతోషంతో ఆయనకి స్వాగతం యిచ్చేందుకు చాలా ప్రయత్నాలు చేశాం. చర్చిని శుభ్రముగా బాగుచేశాము. ఫాంటమారా రోడ్డును బాగు చేసి కొన్నిచోట్ల పెద్దదిగా చేశాం. ఫాంటమారా గ్రామం ముందు పెద్ద ఆర్చికట్టి తోరణాలతో అలంకరించాము. అందరి యిళ్లగుమ్మాలు ఆకుపచ్చటి కొమ్మలతో అలంకరింపబడ్డాయి. ఆయనరాబోయే పవిత్ర దినాన్ని ఊళ్లోఉన్న ఆబాల గోపాలము ఆయన కెదురు వెళ్ళింది. ఒక పావుగంటసేపు నడచి వెళుతున్నాం. ఆయన కనపడగానే స్వాగతం యిచ్చేందుకు రోడ్డుమీద నడచి వస్తోన్న ఒక పెద్ద సమూహం మా కళ్ళ

బడింది. మేము గొంతెత్తి భజనపాటలు పాడుతూ ఉత్సాహంగా గబగబా అడుగులువేశాం. మా గుంపుకి ముందు పెద్దలు నడుస్తున్నారు ముందు వరుసలోమధ్య బాల్డిసేరా సేనాని నడుస్తున్నాడు. పురోహితుడ గారికి స్వాగతంయిస్తో చిన్న ఉపన్యాసం అతను యివ్వాలని యేర్పాటుచేశాం. ప్రక్కల్ని స్త్రీలు బాలురు ఉన్నారు. పట్టణంనుంచి వస్తూన్న ఆ సమూహాన్ని సమీపించగానే మేము రెండుపక్షాలుగా చీలి రోడ్డుకు రెండుప్రకిలా నిలబడ్డాం బాల్డిస్సేరా ఒక్కడూ ముందుకు నడుస్తూ యీ విధంగా గట్టిగా అరిచాడు.

"ఏసు భగవాన్కి జేయ్! లోకమాత మరియమ్మకన్యకు జయ్! చర్చిమతానికి జయ్!"

పట్టణపు ప్రజలగుంపుకూడా రెండు పంక్తులుగా చీలిపోయారు. ఆ పక్షాలమధ్యనుంచి కొత్తపురోహితుడు గార్ధభ రూపంలో బయటపడ్డాడు. ఆ గాడిద వంటిమీద తెల్లటి బట్టలు కప్పారు. పవిత్రమైన నగలతో దాన్ని అలంకరించారు. దాన్ని బెడ్డలతో కొడుతూ ముందుకి నడిపించారు.

అస్తమానమూ కొత్తకొత్త తమాషాసృష్టిస్తోన్నా ఈ రకమైన హాస్యాల్ని త్వరలో మరచిపోలేము. అందుచేత యీ బోది కాలవని మార్చడంకూడా పట్టణం వాళ్ళు మమ్మల్ని యేడిపించేందుకు చేస్తోన్న హాస్యమేమోనని అనుకున్నాము. భగవంతుడు సృష్టించిన ఈ ప్రకృతి నడకల్ని యీ మనుష్యులు మార్చదలచుకుంటే ప్రళయమే వస్తుంది. సూర్యుణ్ణి తూర్పునుంచి ఉత్తరానికీ, వాయువుల గతుల్ని, యీ బోద ప్రవా

హాన్ని ఎవ్వరు మార్చగలరు? గాడిదలు మొరుగుతున్నాయి, టార్లోనియా రాజకుమార్ రాజకుమారుడు కాదు, రైతులు తిండి లేక మాడటం లేదు, అనటం ఎంత హాస్యాస్పదమో ఆబోటి ప్రవాహాన్ని వాళ్లలా మార్చేందుకు నచ్చారనటం కూడ అంత హాస్యాస్పదమైన విషయమే. ఇన్నినాట లెందుకు ఆ ప్రవాహం మారిందంటే సృష్టి తలక్రిందులైం దన్నమాటే!

కాని రోడ్డుకూలీలు కొత్తకాలవని తవ్వేందుకు గునపాలతో మట్టిని పెల్లగిస్తున్నారు. వాళ్లు చేసే పని తమాషాయో, నిజమో తెలియటం లేదు. ఒక రైతు గుండె బాదుకుంటూ ఫాంటమారా పరుగెత్తుకొచ్చాడు.

"పరుగెత్తండి, త్వరగా! పోలీసుల్ని పిలవండి! నీళ్ళకోసం మొరపెట్టండి" అని కనపడిన ప్రతివాళ్ళతోటి గగ్గోలుగా అరుస్తూ చెప్పాడు.

మనుష్యులు ఎక్కడికి వెళ్ళలేక పోతున్నారు. జూన్ నెలలో పొలాల్లో రైతుకి చాలా పను లుంటాయి. ఊపిరి విడిచేందుకు కూడ తీరుబడి ఉండదు. అందుచేత ఆడాళ్ళు వెళ్ళవలసి వచ్చింది. తరువాత ఏం జరిగిందో నా భార్య చెబుతుంది.

సరే, ఆడాళ్లు ఎల్లాంటివాళ్ళో నీకు బాగా తెలుసునుకదా నాయనా, ఒకళ్ళు తెమిలి బయటపడరు. మేం బయల్దేరే టప్పటికే బారెడు పొద్దెక్కింది.

ముందు ఎవళ్లమట్టుకు వాళ్ళే నాకోళ్లని చూసుకోవాలనీ, నా పందులికి మేతపెట్టుకోవాలనీ, సాకులు చెప్పారు. బట్ట

లుతుక్కోవాలని ఒకావిడ అంది. కొందరు మేకలికి గడ్డి కోయ్యాలని సంకల్పెట్టారు. మొట్టమొదట అందరూ అన్ని సంకేతాలూ చెప్పారు. ఒక్క సోర్సనారా మట్టుకు బయల్దేరేందుకు తయారైంది. 'అధికార్లతో ఎలా మాట్లాడాలో నాకు తెలుసును' అది పదిమందినీ పిలిచి చెప్పింది.

ఆమెతో మరొకావిడ బయల్దేరింది. ఆవిడ వేరెందుకులెండి చెప్పటం. ఆమె గర్భిణీకూడాను. ఆవిడ భర్త అమెరికాలో పదేళ్లబట్టి ఉంటున్నాడు.

“ఫాంటమారాలో ఉన్న ముసలాళ్లు దగ్గిర్నుంచి, చంటి బిడ్డలవరకు సంబంధించిన యీ వ్యాపారంలో ఉద్యోగస్థులకు చెప్పుకోనేందుకు యిద్దరి ఆడాళ్లని పంపించి మనం తెల్ల మొఖాలు వేసుకొని కూర్చుందామా?” అని నేను జోంపా పెళ్ళాంతోటి అన్నాను.

వాళ్ళిద్దర్నీ పంపించడం మాలో యెవళ్ళకీ యిష్టంలేదు. అందుచేత లిమోనా, గ్రేజియాల దగ్గిరకి వెళ్లి అనేక విధాల నచ్చజెప్పి మాతో వచ్చేందుకు ఒప్పించాం. గ్రేజియా, సియమ్మారుగానీ, అది, కన్నరోజా కూతుర్ని ఆ అమ్మాయి, ఫిలోమినానీ వెంటబెట్టుకు వచ్చారు.

మేమందరమూ బయల్దేరేందుకు సిద్ధంగా ఉన్నప్పుడు పిలాటో పెళ్లాం తన్ను పిలవకుండా మేము వెళుతున్నామని పానకంలో పుడకలాగు పెద్ద పేచీ పెట్టింది. “మాతో చెప్పకుండా మా చాటుని పనులన్నీ చేసుకోద్దామనుకున్నారా? ఎంత నంగనాచీలమ్మా మీరు! మీకొక్కళ్ళే వెళ్ళి గొప్ప

వెలగబెడదా మనుకున్నారా? ఐతే నా మొగుడి పొలానికి నీరు అక్కర్లేదూ? మీరూ, మీపొలాలే గట్టివా?''

ఆవిడ బయల్దేరేవరకు మేము ఆగవలసి వచ్చింది. బట్ట మార్చుకువచ్చే బదులు ఆవిడ వెళ్లి మరి నలుగుర్ని వెంటబెట్టి కొని వచ్చింది. ఆఖరికి పదిహేనుమందైనా వెళ్ళేందుకు తయారయ్యారు. సోర్సనారా బట్టలు వేసుకుంటూ చాలా ఆలస్యంచేసింది. మే మంతా బాల్డిస్సెరా సేనాని దుకాణం ముందు నిలబడ్డాం. ఆదివారమునాడు వేసుకునే బట్టల్లో మంచి గౌనువేసుకొని, కొత్తటోపీ పెట్టుకొని, పీరులు మెడలో తగిలించుకునే నగలు తగిలించుకొని వగలు కులు కుతో వచ్చింది.

అందమైన నున్నటి కొత్త పొట్టమీద కొత్తగౌను అంటూ బాల్డిస్సెరా గొణిగాడు. మామూలుగా చత్వారం. దూరపు వస్తువులు కనపడవంటాడు కాని, అవసర సమయాల్లో అన్నీ స్పష్టంగా చూడగలుగుతాడు. మేరియట్టాకూడా యేదో గొణిగింది.

మేము బయల్దేరే టప్పుడికి సూర్యుడు నడినెత్తిమీదఉన్నాడు. వేడి చిటపటలాడిస్తోంది.

రోడ్డుపనివాళ్లు మమ్మల్ని చూడగానే పాడలెత్తి ద్రాక్షపం దిళ్ళవైపు పరుగెత్తారు. తక్షణమే యింటిముఖము పెడదా మంది. కాని కొత్తగౌను వేసుకొన్న సోర్సనారామాత్రం అందుకు ఒప్పుకోలేదు. ''ఆ కూలీలు స్వతంత్రించి ఆపని చెయ్యడంలేదు. యజమాన్లు ఏమిచెయ్యమంటే ఆ పని

చేస్తారు. కూలిడబ్బులను చేతిలో పడేయించుకుని, అందుచేత వెళ్ళి పై అధికార్లతో చెప్పడం మంచిది.' అని వాదించింది. ముందుకు వెళ్ళడమా? వెనక్కి తిరగడమా? అనే ప్రశ్న మీద వాదోపవాదాలు చెలరేగాయి. విసుగొచ్చి మేరి యట్టా కుండ బద్దలుకొట్టినట్లు చెప్పింది.

"మన పూరంతకీసంబంధించిన విషయాన్ని వీళ్ళిద్దరిచేత చెప్ప నిస్తామట్రా? ఎంత అగౌరవంచేటూ? వీళ్ళిద్దరు మానాభి మానాలు లేని తొత్తులు. వీళ్ళా మనకు ప్రతినిధులు. వస్తే రండి, పోతేపొండి! నేను మాత్రం వెడుతున్నాను."

పట్టణాన్ని జేరుకునే టప్పటికి మిట్టమధ్యాహ్నం అయింది. పురమందిరం దగ్గిరకి మేమందరము వెళ్లగానే పెద్దసంక్షోభం పుట్టింది. మేం వస్తోంటే దారిలోఉండే దుకాణదారులు కర్రల తలుపులు వేసి, గబగబా ఇంచతిలికి పరుగెత్తుకొచ్చారు. పుర మందిరపు ఆవరణలోఉన్న పళ్ల కావిళ్లవాళ్ళు పక్కకి పరు గెత్తారు. పట్టణ ప్రజలు కిటికీల దగ్గరికొచ్చి, డాబాలెక్కి విరగబడి చూస్తున్నారు. పురపాలక కార్యాలయంలోని కొందరు గుమాస్తాలు హడలిపోయి గుమ్మందగ్గిరకొచ్చి విస్తు పోయి చూశారు. పురమందిరాన్ని తుపానులా ముట్టడిస్తా మని అందరూ అనుకుంటున్నారు. ఏం జరిగినా సరే అనుకొని మేము గంభీరంగా ముందుకి సాగిపోతున్నాం.

ఇంతలోనే ఒక పోలీసు కిటికీలోంచి చూస్తో "వాళ్ళని లోప లికి రానియ్యకండి! ఈ ప్రదేశాన్నంతనీ పురుగుల్తో నింపే స్తారు." అని అరిచాడు. గుంపులోని ప్రజలు పకాలున నవ్వారు.

ఒక్క క్షణం క్రితం భయపడి చెల్లాచెదరైనవాళ్లూ, తెల్ల మొఖాలు వేసుకొని చూస్తున్నవాళ్ళూ నవ్వనారంభించారు. మేమందరము దగ్గరికిచేరి పురమందిరపు ద్వారాన్ని సమీపిస్తున్నాం. ఆ పోలీసు అందరినీ నవ్వించగలిగాననే విజయ గర్వంతో మమ్మల్నిగూర్చి మా పురుగులనుగూర్చి అభూత కల్పనలతో, చేతులు తిప్పుతూ కథ చెబుతున్నాడు. ఆ చుట్టూరా ఉన్న మనుష్యులు కడుపుబ్బేట్లా నవ్వుతున్నారు. పురమందిరానికి యెదురుగానున్న మేడమీదనుంచి ఒకావిడ విరగబడి నవ్వి రెండు చేతుల్తో పక్కలు పట్టుకుని ఆయాసపడింది. గడియారాల్ని బాగుచేసే ఒకడు నవ్వినవ్వి చివరికి ఏడ్చాడు. షాపుచేసేవాళ్లు, గుమాస్తాలు ద్వారందగ్గిర పోగు పడుతున్నారు. పెద్ద గొడవచేస్తో ఒకాఒకా వికావికా వాళ్లందరు నవ్వుతున్నారు.

తరువాత ఏం చెయ్యాలో మాకు పాలుపోలేదు. మేము వచ్చేదారిలో ఆ విషయాలన్ని తనకి వదలివెయ్యమని పోర్సనారా చెప్పింది. కాని నవ్వుతోన్న ఆ ప్రజాసమూహాన్ని చూడగానే దానికి కూడా బుర్రపోయింది. ఆ పోలీసు ఒక్కడే అయితే సమాధానంచెప్పడం సులాకనే. వాడి చిన్నతనంలో వాడుకూడా పల్లెటూళ్లలో పురుగులమధ్య దొర్లినవాడే! కాని యింకా అనేకమంది వాడి చుట్టూ ఉండిపోయారు.

"ఎవరి దర్శనం చేసుకుందామని వచ్చారు మీరు? మీకేం కావాలి?" అని ఒక గుమాస్తా అడిగాడు.

"మేము శ్రీమేయరుగారిని దర్శనంచేసుకుందామని వచ్చాం" అని అంది గుమాస్తాతోటి మేరియట్టా.

గుమ్మందగ్గరఉన్న గుమాస్తాలు ఒకళ్ళముఖం కేసి ఒకళ్ళు ఆశ్చర్యంతో చూసుకున్నారు. కొందరు మళ్ళీ అదే ప్రశ్నను వేశారు.

" ఎవళ్ళు కావాలి?"

" మేయరుగారితో మాట్లాడాలి" అంటూ ఒకేసారి మాలో నలుగురైదుగురు సమాధానం చెప్పారు.

పిచ్చివాళ్ళలాగ విరగబడి నవ్వ నారంభించారు. " మేయరు గారితో మాట్లాడాలీ!" అని గొంతుక చించుకొని గట్టిగా అరిచి పకాలున నవ్వారు. ఆవరణలోఉన్న వాళ్లందరు నవ్వారు. కిటికీల దగ్గరఉన్నవాళ్ళూ, అరుగులమీద ఉన్న వాళ్ళూ, భోజనశాలల్లో ఉన్న వాళ్లూ అందరు పకపక నవ్వారు. అది భోజనాల సమయంకూడాను.

పన్నెండుగంటలు దాటిపోయింది. గుమాస్తాలందరూ బయటికి వచ్చేశారు. నౌకరు తలుపులు వేస్తున్నాడు.

"మీరు నిజంగా మేయరుగారితో మాట్లాడదా మనకుంటు న్నారా? ఇక్కడే ఉండండి. ఇంకా కొంచంసేపు ఆయన కోసం తాళి ఉండాలి" అంటూ తాళంవేసి నౌఖరు వెళ్ళి పోయాడు.

అతని ఉద్దేశ్యం ఏమిటో చాలాసేపు తరువాతగాని మాకు బోధపడలేదు. ఈలోపుగా ఆవరణలోఉన్న మంచినీటి పళ్ళాయి మాదృష్టిని ఆకర్షించింది. మే మందరము దాని వైపు పరుగుపెట్టాం. పిల్లి, ఎలుకల పోరాటం ప్రారంభ

మైంది. మా కందరికి దాహం వేస్తోంది కాని అందరు ఒకే సారి తాగలేం. మేరియుస్ట్రా కష్టపడింది కనుక ఆవిడ ముందు తాగాలి అని ఒకరంటే, తక్కిన వాళ్ళు అందుకు ఒప్పుకోలేదు. ఒకళ్ళనొకళ్ళు తోసుకొన్నాం కొంతసేపు. ఆ తర్వాత మాలో మేము రాజీచేసుకొని ఒక క్రమపద్ధతిని ఏర్పాటు చేసుకొన్నాం. అందరికంటె ముందు జియుడిట్టా స్కార్పోనె తాగింది. పెదవులన్నీ ఒరిసిపోయిన ఒక పిల్ల తరువాత తాగింది. ఆ అమ్మాయి ఆఖర్న తాగాలని నిర్ణయించాం కాని ఆ కుళాయిని పట్టుకొని వదలక పెనుగులాడి తాగింది. ఆ తరువాత మేరియుస్ట్రా వంతు వచ్చేటప్పటికి కుళాయిలోంచి నీరు రాలేదు.

ఒక నిమిషం వరకు మాత్రమే నీరు రావడం ఆగిందనుకున్నాం. కాని నీరు రాలేదు. ఆ కుళాయి వదిలింది మేము వెళ్లిపోగానే సమయానికి నీరు వచ్చింది. మేము వెనక్కి తిరిగాం. మళ్లీ చిన్న దెబ్బలాట, పెద్ద గొడవ, ఇద్దరు పిల్లలు ఒకళ్ల జుట్టు మరొకరు పీక్కున్నారు.

మేము మళ్ళీ వంతులు వేసుకొనే టప్పటికి మళ్ళీ నీళ్లు ఆగిపోయాయి. కొంచంసేపు ఆగి చూశాం. కాని నీళ్ళు రాలేదు.

ఆ నీళ్లు రావడం మానడం మాకేమీ అర్థంకాలేదు. మా ఫాంటమారా జలధార ఎప్పుడూ వస్తూనే ఉండేది. కాని ఇల్లాంటి విడ్డూరాన్ని మే మెప్పుడూ చూడలేదు. గడియారాలని బాగుచేసేవాడు, పోలీసు అతవల ప్రక్కనుంచి మమ్మల్ని చూసి నవ్వుతున్నారు.

ఇల్లాంటి అసందర్భపు విషయాలు చెప్పి కాలం వృథా చెయ్యడం మంచిదికాదు నాయనా. ఇంతకంటె మరీ అధ్వాన్నపు పనులు జరిగాయి తరువాత. కాని మా దాహం తీరకుండానే మాయమైన ఆ నీటి విషయాన్ని మరుద్దామన్నా మరుపురాదు. నీళ్లు రావడంలేదుకదా అని మేము వెళ్లిపోతోంటే వచ్చేవి. వచ్చాయికదా అని వెనక్కి వస్తే మాయమయ్యేవి. మా గొంతుకలు యెండిపోయాయి. ఏతేనేం ఒక్క నీటిబొట్టుకూడా పెదవులు తడిపేందుకు దొరకలేదు.

ఈ విధంగా నీళ్లు నాలుగవసారికూడా మాయమయ్యే టప్పటికి తుపాకుల జోల్జర్లు ఆరుగురు మమ్మల్ని చుట్టుముట్టి, ఏం కావాలని అడిగారు?

"మేము మేయరుగారితో మాట్లాడదామని వచ్చాము" అని సమాధానం చెప్పాము.

"ఏమిటీ? మేయరా! మేయర్? ఇంక మేయర్లు లేరని మీకు తెలియదా? మేయర్లని ఇప్పుడు పొడెస్టాలని పిలుస్తున్నారని తెలియదా? ఇంకా ఎప్పుడు ఈ విషయం బుర్రకెక్కుతుంది?" అని విసురుగా జోల్జరు చెప్పాడు.

అయన్ని ఏమని పిల్చినా మాకొక్కటే. ఈ చదువుకున్న వాళ్ళకి అది పరమముఖ్యమైన విషయమై ఉండవచ్చు. అందుకనే కాబోలు మేము పొడెస్టా అనకుండా మేయరు అన్న మూలాన్ని గుమాస్తాలు విరగబడి నవ్వారు. ఆ నాటంటు కూడా మేము మేయరు అంటోన్నందుకే ఆంత కోప్పడ

తున్నాను. అయితేం, చదువుకున్నవాళ్ళు చిన్నచిన్న విషయాలకి కస్సుబుస్సుమని గోలచేస్తారు.

ఆ సార్జంటు పోడెస్టా దగ్గిరకి తీసికోని వెళ్ళమని మాతోకూడ నలుగురు పోలీసుల్ని పంపాడు. ఇద్దరు ముందు. తక్కిన యిద్దరు ప్రక్కల్ని నడుస్తున్నారు. వారివెంబడి పోతోన్న వాళ్లు మమ్మల్ని చూసి నవ్వుతో చప్పట్లు చరచారు. పట్టణాల్లోఉండే ప్రజలు అందులోనూ ముఖ్యంగా ఫ్యాక్టరీల్లో పనిచేసే కూలీలకి మా పల్లెటూరివాళ్ళని చూసి గోల చెయ్యడం సరదా.

ఆ పోలీసులు అనేక వీధులలోంచి, చిన్న సందుల్లోంచి మమ్మల్ని నడిపించి తీసికెళ్ళారు. డాన్ సర్కోస్టాంజా యింటినికూడా దాటిపోయాముకాని, ఈ పోలీసులు మమ్మల్ని అక్కడ ఆపలేదు. డాన్ సర్కోస్టాంజా యిప్పుడు మేయరుగా లేడని మాకు తెలిసి చాల ఆశ్చర్యపడ్డాం. పోనీ డాన్ కార్లో గారు మేయరేమో అనుకున్నాం. ఆయన యింటిదగ్గరకూడా పోలీసులు ఆగలేదు. మమ్మల్ని పట్టణం బయటికి తీసుకెళ్లారు. మళ్లీ పొలాల్లోకి వెళ్లాం.

“ఈ పోలీసులు మన్ని తమాషా చేస్తున్నారు. డాన్ సర్కోస్టాంజాయే మేయరు అయ్యుంటాడు. యుద్ధానికి పూర్వమూ యుద్ధము జరిగేటప్పుడూ, యుద్ధం తర్వాతకూడా ఆయనే మేయరు. ఆయన మేయరుగా లేని కాలంలో డాన్ కార్లో ఉండేవాడు. ఈ పోలీసులు వాళ్ళిద్దరి యిళ్లదగ్గరకూడా ఆగలేదు. ఏదో తమాషా చెయ్యాలని వీళ్ళు ఎత్తువేశారు! అని మాలో మేము అనుకుంటున్నాము.

విత్తనాలు, టొమాటోలుకూడ కొని వ్యాపారం సాగించాడు. సంచుల్ని, అటుపైని గుర్రాల్ని మేపుతుండేవాడు. వాడు కొన్న వస్తువుల నన్నిటిని రోము నగరానికి పంపేవాడు. ఆఖరికి ప్రతి పైసాలోను చూసుకుంటే అతని వేలుండేది. తేనె, తోళ్ళు, భూమి, ఇటికలు, ఓడకలప, అది ఇదీ యేమిటి ప్రతి వ్యాపారంలోను దూరాడు. రోడ్డు కంట్రాక్టుకూడా వాడిదే. ఈ జిల్లాలో ప్రతి సంతలోనూ, ప్రతి తీర్థంలోనూ, ప్రతి బజారులోనూ, వీడి దర్శనమే. మొట్టమొదటి రోజుల్లో పెద్ద భూస్వాములు, చిన్న జమీందార్లు యితణ్ణి చులకనగా చూసేవారు. కాని ఒక్కొక్కళ్ళనే ఒంచుకొచ్చాడు. ఇంతవరకు ప్రతి విషయంలోనూ వాళ్ళని కాదనిపించి నెగ్గుకొచ్చాడు. చివరికి యితనంటే అందరికీ సందేహం కలిగి ఫోర్జరీదారు అని అనుమానపడటం మొదలెట్టారు. అప్పుడు పెద్ద విచారణలు జరిగాయి. అందులో యితనికి నోట్లు అచ్చుగుద్దే యంత్రం ఉందని బయటపడింది. ఐతే ఆ యంత్రం ఒక బ్యాంకుది. అందుచేత ఏమి చెయ్యలేకపోయారు.

ఈ అపూర్వ విషయాన్ని గూర్చి ఫాంటమారాలో అందరూ వింతగా చెప్పుకున్నారు. కొంద రిది నిజమన్నారు. కొంద రబద్ధం అని వాదించారు. మాకు తెలిసినంతవరకూ డబ్బు దాచుకోనేందుకు, ఇటలీనుంచి, అమెరికాకు డబ్బు పంపేటప్పుడు ఒక దేశపు నాణ్యాల్ని మరొక దేశపు నాణ్యాల్లోకి మార్చుకునేందుకు మాత్రమే బ్యాంకులు ఉపయోగపడుతాయి. కాని బాంకుకి, వ్యాపారానికి సంబంధం ఏమిటో బుర్రలు బద్దలు కొట్టుకొన్నా బోధపడలేదు. బ్యాంకుకీ,

దారి సరిగ్గా తెలియకపోవడంతో మూలాన్ని అనేకసార్లు తప్పు దోవల్లో వెళ్ళి యెల్లాగయితేనేం ఫ్యాక్టరీల దగ్గర కెళ్ళాం. ఇరవై మందిదాకా కూలీలు పనిచేస్తున్నారు. బళ్ళల్లో ఇటి కలు వేసుకుంటున్నారు బండిమనుష్యులు. కాని కంట్రాక్టరు మాత్రం అక్కడ లేడు. రంపపు మిల్లుదగ్గరికి వెళ్ళిఉంటాడు. ఈపాటికి అక్కణ్ణించికూడా వెళ్ళిపోయిఉంటాడు. తోళ్ళ దుకాణందగ్గర తప్పకుండా ఉంటాడు. కాని తోళ్ళ దుకాణం చాలాదూరం ఉంది.

ఆ దుమ్ము రోడ్డు మధ్యని ఏంచేసేందుకు తోచక నిలబడ్డాం. ఊపిరి తిరగనంత వేడి. కళ్ళనిండా దుమ్ము పడింది. జుట్టునిండా కళ్ళనిండా, నోటినిండా, బట్టనిండా దుమ్ము కొట్టుకొనిపోయి పోల్చుకునేందుకకూడా వీలులేకుండా ఉన్నాం. నెత్తి కాలు తోంది. కడుపు మాడుతోంది. ఓపికలేక కాళ్ళు తేలిపో తున్నాయి.

"ఇదంతా నువ్వు తెచ్చిపెట్టిన కష్టమేనే! విధవముండా!" అని అంటూ లిజబెట్టా లిమోనా సోర్ సినారామీద మండిపడింది.

ఈ కేకల్తో ఒక పెద్ద దెబ్బలాట ఆరంభమైంది. పిలాటో భార్య నన్ను తిట్టింది. "నువ్వేనే, నన్నిక్కడికి లాక్కొ చ్చింది. నేను రావాలని అనుకోలేదు. ఇంట్లో బోలెడంత పనుంది. ఇంట్లో కూర్చున్నదానిని రచ్చకీడ్చి, సందుల్లోను, గొందుల్లోను, రాచబాటల్లోను తిప్పుతున్నావు."

స్కార్పోను, కన్నరోజో కూతురు, ఒకళ్ళజుట్టు ఒకళ్ళు పట్టు కుని రోడ్డుమీద పడ్డారు. మేరీ కన్నరోజో కూతురికి సాయ

పడదామని ఒక పరుగు పెట్టింది. కిష్టా, సింహంలాగు ఆమె మీదకి దూకింది. వాళ్ళిద్దరు పేడకుప్పల్లాగు కింద కూలారు. ఆ నలుగురూ రోడ్డుదుమ్ములో పొర్లాడుతున్నారు.

అదృష్టవశాత్తూ వాళ్ళు వేసుకునే కేకలు కొట్టుకొన్న దెబ్బల కంటె పెద్దవిగా ఉన్నాయి. లిమోనా, జోఫా పెళ్ళాల మధ్య చిక్కిన సోర్సినారా తన పీక పిసికేస్తున్నట్టు అరిచింది. కాని కొంచం జుట్టుమాత్రం వాళ్ళు పీకారు. ఆవిడ కొత్తగౌను ముక్కలు ముక్కలై పోయింది. ఇటికెల పనివాళ్ళు వచ్చి మమ్మల్ని ఆ యుద్ధంలోంచి విడదీశారు.

అంతా శాంతించాక సోర్సినారావైపు చూపిస్తో లిజబెట్ట "ఆ శూర్పణఖ వెనకాల రావడం మాదిచాలా పొరబాటై పోయింది. అయినా యీ కంట్రాక్టరుకీ, కొత్తకాలవ త్రవ్వించడానికి సంబంధం ఉండదనుకున్నాము. ఎందుకోసం యిక్కడికి వచ్చారు చెప్పండి" అని అన్నది.

"మనం వెళ్ళి డాన్ కార్లో గారిని చూసొద్దాం. ఆ కాలవ ఆయన భూములవైపే తిప్పుతున్నారు. ఇదంతా వట్టిగమ్మత్తు అయిఉంటుంది ఏమో, ఏం చెప్పగలం? అల్లాచేసేందుకు వీలుంటుందో వుండదో అని ప్రయత్నిస్తున్నాడేమో" అంటూ జోంపాభార్య చెప్పింది.

మేమంతా రెండుమూడు గుంపులకింద విడిపోయి పట్నం వైపు వెడుతున్నాం. డాన్ కార్లో భవనందగ్గిర ఆగి అక్కడి నౌకరుతో "డాన్ కార్లోగారి దర్శనం చేసుకోవాలి. వెళ్ళి చెప్పరా" అని అడిగాం.

"డాన్ కార్లోగారా? ఆయన ఫలహారం చేస్తున్నారు. అమ్మ గార్ని చూస్తారా?" అని మామూలు సమాధానం యిచ్చాడు.

అమ్మగారు మమ్మల్ని బాగా యెరుగును. సరిగా యీ సమయానికే బయటికి వచ్చింది. మాకోసమే యెదురుచూస్తున్నట్లు యెంతో ఆప్యాయంగా లోపలికి పిలిచింది. వాళ్ళ భోజనశాలకి వెళ్ళాం. కోడిగ్రుడ్లు, మాంసంకూర, పంది కొవ్వు పెద్ద పళ్ళాల్లో ఉన్నాయి. ఏపిలు పళ్లగుత్తులు, ఉల్లి పాయలు వేళ్లాడు తున్నాయి. జిజ్జోలా అమ్మగారి బట్టలు పూర్వపు పంపిణీవి. ఒక నల్లటోపీ పెట్టుకొని, నేలకి తగిలే టంత పొడుగాటి నల్లగౌను తొడుక్కుంది. ఆవిడ మాట్లాడితే మేకుస్తోన్నట్లుంటుంది. మా చిన్న జమీందార్ల పెళ్ళాలకి మొగుళ్ళ కున్నంత వ్యాపారజ్ఞానం ఉంది. వాళ్ల ఆస్తుల విషయాల్లో వాళ్ళ మొగుళ్లుకూడా వీళ్లు 'కా' అంటే 'కా', 'కీ' అంటే 'కీ', కుటుంబఆస్తుల్ని చూస్తోండడం, నౌకర్లకి పనులు పురమాయించడం, కూలీలకి కూలి యివ్వడం మొదలైన యావత్తు పనులు వీళ్ళే చూస్తుంటారు. ఆ భూస్వాముల భార్యలు వివాహ సమయాల్లో తెచ్చుకునే భూములని అతి జాగ్రత్తగా అజమాయిషీ చేసుకోవడం మూలాన్ని వాళ్ల భర్తలు చేసే దూబరాఖర్చుల్లోనూ, జూదపు ఆటల్లోనూ ఆస్తులు తెగలబడి పోకుండా, కొంత భాగమైనా మిగులుతుంది.

జూదరి, తాగుబోతు, విషయలంపటుడు అయిన డాన్ కార్లో అతని భార్య ఆటంకపరచకపోతే యీ పాటికి ఆ స్తినంతనీ

కున్నారు వాళ్లు. ఐతే ఏమి? వాళ్లంతకు వచ్చే రోగాలు. వీళ్ళ పొడెస్టా అయి, యిరవై నాల్గు గంటలు కూడా అవకుండానే పురమందిరంలోంచి టైపు యంత్రాలు మాయమయ్యాయి. ఒక నెలరోజుల్లోపుగా, తలుపులు, ద్వారబంధాలు, కిటికీలు అంతర్ధానమౌతాయి. వీధులు ఊడ్చేవాళ్లకి కమ్యూన్ డబ్బిస్తున్నాడు. కాని రేపట్నుంచి వాళ్లచేత ఫ్యాక్టరీలో పని చేయించుకుంటాడు. నా భర్తదగ్గర్నుంచి దొంగిలించిన భూముల్లోంచి కాలువ తవ్వేందుకు, రోడ్డుపనివాళ్ళను పెట్టి ఒక్క పైసాకూడా వాడివ్వకుండా భూములు బాగుచేయించుకుంటాడు. ఇన్నోసెంజో లెగ్గే అనే ఒక ఆఫీసు నౌకరు, కంట్రాక్టరు భార్య దగ్గర పనిచేస్తున్నాడు. వీధిలో ఆవిడ వెనకాల పెద్ద కూరగాయల బుట్ట నెత్తిమీద పెట్టుకొని కుక్కలాగ తలవంచుకుని పోతోంటే యీ ఉదయం నేను కళ్ళారా చూశాను. ఇదంతా యింకా మొదలే. కొద్దిరోజుల్లో మనందర్ని మింగేస్తాడు.”

ఉద్వేగంతో ఆమె చెబుతోంటే యీ మాటలన్నింటినుంచి మేము, పెద్ద భూస్వాములకి, జమీందార్లకీకూడా రోజులు దగ్గరపడ్డాయని గ్రహించాం. మనం విత్తనాలు ఒకటి జల్లుకుంటే పంట మరొకటి పండుతుందా?

అందుచేత మరొకసారి పొడెస్టాయింటికి బయల్దేరాం. ఈ నడకమూలాన్ని నా కాళ్లు పీకుతున్నాయి. కాళ్లకి చెప్పులు కూడా లేవు.

ఫాంటమారా గొఱ్ఱెలకాపరి యాంటోనియో కంట్రాక్టరుతో పని ఉండి వచ్చి దారిలో మమ్మల్ని కలుసుకొన్నాడు

మామూలుగానే బీడులో తనముందని మేపు పెడుతుంటే "ఆ బీడు కంట్రాక్టరుగారిది, అవతలికి పొమ్మని" పోలీసులు అవతలికి గెంటేస్తే కంట్రాక్టరుని అడుగుదామని వచ్చాడు.

"ఈ గ్రామకంతమే ఆయనదైతే మనం పీల్చే గాలికూడా ఆయనదేనన్నమాట" అని గొర్రెలకాపరి అన్నాడు.

ఆంటోనియో పెద్ద తెలివైన ఘటంకాదు. కాని యీ విషయంలో మాత్రం వాడు చెప్పినది పూర్తిగా నిజం ఆ పోలీసులు మేత కాసించి, వాణ్ణి బెదిరించి ఉండవచ్చును. గ్రామకంఠాలు, బీళ్ళూ అందరి సొమ్మూను. మే నెలలో మా పర్వతాలమీదకి అయిదు లక్షల పశువులు, గొర్రెలు, మేకలు వచ్చి అక్టోబరు నెల వరకూ అక్కడే ఉండిపోతాయి. ఏసు ప్రభువు పుట్టుకకి పూర్వంనుంచీకూడా, యీ విధంగానే జరుగుతోందిట. ఇంతవరకూ యెన్ని యుద్ధాలు, యెన్ని దండయాత్రలు జరిగాయో, యెందరు రాజులు, పీఠాధిపతులు మారారో లెక్కలేదు కాని యీ పశువుల బీళ్ళుమాత్రం ప్రజాసొత్తు క్రిందే ఉన్నాయి.

"కంట్రాక్టరుకి పిచ్చియెత్తింది కాబోలు. లేకపోతే పచ్చ గడ్డిని ముట్టుకుంటాడా? బహుశా పోలీసులు నాలు డబ్బులు వడుక్కునేందుకు చేసే ప్రయత్నమే అయ్యుంటుంది." అని మే మన్నాం.

పొడెస్టా యింటిదగ్గర, గుమ్మంలో దాసీది నిరాశతో నిలబడి వుంది.

"పాపెప్పాగా రింకా యింటికి రాలేదు. విందుకి పెద్దలందరూ వచ్చి ఒక అరగంటనుండి ఆయనకోసం చూస్తున్నారు. పెళ్ళికి అందరూ వచ్చారు కాని పెళ్లికొడుకు రాలేదు" అంది. మేమున్న చోటికి భోజనశాలనుంచి వంటకాల వాసన గుప్పు మని వస్తోంది. ఆ విందునుగూర్చి దానీది చమత్కారంగా వర్ణించి చెబుతోంది, డాన్ సర్కోస్టాంజా చక్కటి ఉప న్యాసం యిచ్చాడు. మాంసపు కూరలు, ఉల్లిపాయలు, కోడిగ్రుడ్లు, సారాయిలు వీటన్నిటినిగూర్చి నోరూరేట్లా వర్ణిం చింది.

ఆ విందు బహుశా ముగింపుకు వచ్చిఉండాలి. రకరకాలైన సారాయిల వాసన ఘాటుగ కొడుతోంది. డాన్ సర్కోస్టాంజా కంచుకంఠం ఖంగునమోగుతో వినబడుతోంది. తలుపులు తెరచివున్న కిటికీలలోంచి కొన్ని కొన్ని మాటలు వినబడు తున్నాయి.

తీవ్రంగా పెద్ద చర్చ వినపడింది. దేవుణ్ణిగూర్చిన చర్చ. డాన్ అబ్బేషియో వైజ్ఞానికుడు ఈశ్వరుడు లేడంటున్నాడు. ఇంతట్లో కేడాణా అబ్బేషియో త్రాగుబోతు కంఠం విన బడింది.

"రొట్టె, మాంసంకూర, మంచిసారాయీలకు జెయ్! తథాస్తు" అన్నాడు.

పెద్ద నవ్వు, యీ హాస్యానికి స్వాగతం యిచ్చింది.

ఒక్కక్షణంఅందరూ నిశ్శబ్దంగా వూరుకున్నారు. మళ్ళీ డాణా అబ్బేషియో అందరూ భోజనాలనుంచి లేవచ్చునని చెప్పాడు.

అతిథులందరూ, ఒక్కొక్కరే మూత్రవిసర్జనానికి, బయటికి చెట్లదగ్గరికి వచ్చారు.

అందరికంటె ముందు డాన్ అబ్బేషియో వచ్చాడు. లావుగా వుంటాడు. కంఠంమీద నరాలు ఉబ్బిఉన్నాయి. కందగడ్డ లాగు ఎర్రగావుంది ముఖం. కళ్ళు సగంమూతపడి ఆనంద పారవశ్యంతో, తన్మయావస్థలో ఉన్నట్లు కనపడుతున్నాడు. తిన్నగా నిలబడ లేనంత తప్పతాగాడు. ఒళ్ళు తెలియకుండా లేడు. ఒక చెట్టు కెదురుగా నిలబడి, మూత్రవిసర్జనం చేస్తూ, తూలి పోతున్నాడు. పడిపోకుండా చెట్టుకి తలచాన్చి నిలబడ్డాడు.

ఆ తరువాత డాన్ పాంపోనియో లాయరు పోలీసుని పట్టుకుని బయటికివచ్చి, ఇంటిచాటుకి వెళ్ళాడు.

తరువాత వైజ్ఞానికుడు, ఆయన వెనుక పన్నుల కలెక్టరు, పోస్టుమాస్టరువచ్చి ఇటుకల గుట్టలవెనుక మూత్ర విసర్జనం చేశారు.

ఒక లాయరు, ఒక యువకుడి చెయ్యి పట్టుకొని బయటికి వచ్చాడు. ఆ వెనుక, ఒక ముసలి టవున్ హాలు గుమాస్తా వచ్చాడు. ఆయన్ని అందరూ 'విద్యార్థి' అని వేళాకోళం చేస్తారు. ఇరవైయేళ్ళ వయస్సులో కాలేజిలో ప్రవేశించి, అరవైయేళ్లు వచ్చేవరకు పరీక్షలకి చదువుతూనే వున్నాడు. ఆయనకూడా యింటివెనక్కి వెళ్లాడు.

ఆయన వెనుక, టా రెంటెల్లా ప్లీడరుగారు వచ్చారు. ఆయన్ని 'బట్టతల' అంటారు. ఆయన నెత్తిమీద జుట్టు ఊడిపోయింది.

కనుబొమలమీద, కనురెప్పలమీద వెంట్రుకలు లేవు. మీసం, గడ్డంరాలేదు. ఆయన వెనక ఆ 'ఆలోచనాపరుడు' వచ్చాడు. ఆయన తల ఎప్పుడూ తిరుగుతూ ఉంటుంది. ఆయనేమాలోచిస్తున్నాడో పరమాత్మునికే తెలవాలి. కాని ఆ తోటలో యీ తలతిరుగుడు తాత తిరుగుతున్నాడు.

ఇంతట్లోనే కంట్రాక్టరు కూలీలతో మాట్లాడుతో వచ్చాడు. సాదాబట్టలు తొడుక్కున్నాడు. స్పిరిట్ లెవెల్ ఒకచేత్తో పట్టుకున్నాడు. గజంబద్ద యింకొక చేతిలో ఉంది. బూట్లని సున్నం తినేసింది. లాగునిండా, చొక్కానిండా సున్నం అయింది. ఆయన్ని యెరగనివారు యీ పట్టణంలోకల్లా ఆయనే చాలా భాగ్యవంతుడంటే నమ్మరు. మమ్మల్ని చూచినా కూలీలని కేకవేస్తూ సంభాషణ సాగించాడు.

" బండివాడు అజాగ్రతగా బంగాళా పెంకుల్ని పడేసి, విర గ్గొడితే నష్టాన్ని చెవులు నులిమి పుచ్చుకుంటాను. ఏమిటి? వాడికి క్రితం నెలజీతం కావాలా? వాడి తెగులు చూడండి! ఏం నేను పారిపోతా ననుకుంటున్నాడా, వాడు? ఈ కరువు రోజుల్లో పనియిచ్చినందుకు కృతజ్ఞుడై వుండవలసిందిపోయి... ఏమిటి? సిమెంటు పనివాళ్ళు రోజుకు పది గంటలు పని చెయ్యరూ? నిజమేనా? నేను రోజుకు పన్నెండు గంటలు పనిచేస్తున్నాను. నేను షాహుకారుని అయినా పన్నెండు గంటలు పని చేస్తున్నాను.

" రోజలియూ " అంటూ భవనంవైపు తిరిగి కేకలువేశాడు. అతని భార్య తక్షణమే వరండామీదకు వచ్చి నిలబడింది.

"ఆ శిల్పకారుడు ప్లానులు తీసుకు వచ్చాడా? ఏమిటి? బొజ్జనిండా మెక్కి నిమురుకుంటూ కూర్చునేందుకు వాడికి ఇచ్చేస్తున్నా ననుకున్నాడా? ప్లేటను మాష్టరు బిల్లు తీసుకొచ్చాడా? ఏమిటీ? ఇంతవరకూ తీసుకు రాలేదూ? వాణ్ణి బదిలీ చేయించెయ్యాలి. పోలీసు నాయకుడు వచ్చాడా? ఏమిటీ? వాణ్ణి నువ్వు పంపించేశావా? ఎందుకు పంపించేశావ్?...... విందా? ఏం విందు? ...... ఓహో నేను పాడెప్టా అయినందుకు నువ్వు యేర్పాటు చేసిన విందా?... అయ్యయ్యో మరచిపోయాను. అయినా, నాకు తీరుబడి లేదు. పోలీసు సర్కిల్‌తో మాట్లాడవలసిన అర్జంటుపనిఉంది. ...ఏమిటీ? ఆ వచ్చిన అతిథులు ఏమన్నా అనుకుంటారా? అబ్బే, యేమీఅనుకోరు లే. వాళ్ళకి పుష్కలంగా సారాయిలు యియ్యి, ఇంకో విధంగా అనుకోరు లే. అదంతా నీ భ్రమ. పరవాలేదు లే."

ఆయింటి గుమ్మాన్ని దాటి వెళ్ళిపోతూ మా కేసి చూడనైనా చూడకుండా, కూలీలతో మాట్లాడుతున్నాడు. నిజంగా ఆయన వ్యవహరించే విధంచూస్తే, చాలా భయం వేసింది. "నిజంగా యీ దొంగ యిక్కడే మరో రెండేళ్లుంటే సర్వ నాశనం అయిపోతుంది" అని నాలో నే ననుకున్నాను.

"మీ రిక్కడే వుండండర్రా" అంటూ ఆంటోనియో ఆయన వెనక పరుగెత్తాడు.

ఈ లోపుగ తప్పతాగిన అతిథులంతా వరండామీద చేరారు.

పాడెస్టా కొత్తగా కడుతోన్న యింటివెనక్కి వెళ్ళి మాయ మయ్యాడు.

చేట చెవులు, బ్రారముక్కు డాన్‌సర్కోస్టాంజా లాయరు తక్కిన లాయర్లమధ్య నిలబడ్డాడు. ఆయన కడుపు మూడవ దశలోవుంది. మా ప్రాంతంలో లాయర్లు విందులకి వెళ్ళి నప్పుడు ఒక ప్రత్యేక రకపు లాగులు తొడుక్కుంటారు. ఆ లాగులకి ఒక వరస బొత్తాముల బదులు మూడు వరసలుం టాయి. పొట్ట స్థితినిబట్టి, ఆ లాగుల్ని వదులు చేసుకో వచ్చును, బిగించుకోవచ్చును. ముందు భోజనానికి కూర్చో గానే ఒక వరుసబొత్తాముల్ని, మాంసపుకూర, ఖోట్లు అయ్యే టప్పుడు రెండవ వరసనీ, సారాయిల్ని కడుపులో కెక్కించే టప్పుడు మూడవ వరసనీ విప్పుతారు.

ఆరోజు వాళ్ళందరి లాగూలు మూడవదశలో వున్నాయి. డాన్‌సర్కోస్టాంజా మమ్మల్ని చూసిన తక్షణమే గొడవ చేస్తో మాకు స్వాగతం యిచ్చాడు.

"మా ఫాంటమారా ప్రజలు చిరాయువు లవ్వాలి"అంటూ బిగ్గరగా దీవించాడు.

మా ఫాంటమారా వాళ్ళంటే డాన్‌సర్కోస్టాంజాకి మొట్ట మొదటినుంచి చాల అభిమానం ఉంది. వాళ్ళ దావాలన్నీ యీయన చేతులమీదుగానే జరుగుతూండేవి. ఈ కారణం చేత ఫాంటమారాలోని కోడిగ్రుడ్లు; కోళ్ళు ఆయన యింటికి చేరేవి. ఒకానొకప్పుడు రాయడమూ, చదవనూ తెలిసున్న వాళ్ళకే ఓటుచేసే హక్కుండే రోజుల్లో ఒక మాష్టరు మా

పూరువచ్చి మా అందరికీ, డాన్ సర్కోస్టాంజా పేరు, యింటి పేరు వ్రాయడం నేర్పాడు. అందుచేత ఫాంటమారా వాళ్లం దరూ నికరంగా ఆయనకే వేశారు. ఇంకొకళ్లకి వెయ్యా లన్నప్పటికీ, యీయన పేరు తప్పితే వ్రాయడం చేతగాదు. ఆ తరువాత యెన్నిక పద్ధతి రద్దుచెయ్యబడింది. మాకు అవ్వి లేవని విచారంలేదు.

కాని యీనాటివరకూ డాన్ సర్కోస్టాంజాగారికి ప్రజామిత్రు డనే బిరుదుంది.

"ఈ ఫాంటమారా నారీరత్నాలరాక మనం ప్రభుత్వానికి ఆలిగ్రాము యిద్దామని చేసుకున్న నిర్ణయానికి చాలా లాభకారిగావుంది" అని తనతోవున్న పెద్దమనుష్యులతో అన్నాడు.

జేబులోంచి ఒక కాగితాన్ని పెన్సలును తీసి బరబరా బరికి పైకి గట్టిగా చదివి వినిపించాడు.

"ఉద్యోగస్థులు, ప్రజలు యేకమై కొత్త పొడెస్టాగారిని నియ మించినందుకు ప్రభుత్వం వారిని పొగడుచున్నారు."

కంట్రాక్టరు యెంతసేపటికీ తిరిగి రాకపోవడమూ, అతిథు లందరూ ఆయన భార్య దగ్గర శెలవుతీసికొని వెళ్ళిపోతూ మాకేసి చూడకపోవడమూ చూసేటప్పటికి మాఓర్పు తగ్గి పోయింది. ఒకళ్లనికూడా బయటికి పోనివ్వకూడదని, ఆ కాల వని కంట్రాక్టరు పొలంలోంచి తవ్వించమని వాగ్దానం యిచ్చే వరకూ గుమ్మందగ్గర నిలబడాలని నిశ్చయించుకుని పెద్ద గొడవ చెయ్యడం మొదలు పెట్టాం.

"బీదవాళ్ళని యిలా బాధలుపెడుతూ యేడిపించడం మీకేం న్యాయం! దొంగలు! దోపిడీగాళ్లు! పొద్దుణ్ణుంచీ యీ యెండలో నిలబడి ఉన్నాం మాకేమీ చేసిన పాపాన్ని పోలేదు! దేవుడు యింతకీ పదిరెట్లు బాధలు పెడతాడు! మీ పాపం మిమ్మల్ని కట్టికుడపకపోదు."

'మాలో యిద్దరు రెండుమూడు యిటికల్ని కిటికీలమీదకి విసిరారు. కిటికీ అద్దాలు ఘలుఘల్లుమని ముక్కలయ్యాయి. అద్దం బద్దలౌతోన్న చప్పుడు వినపడగానే, మేమందరమూ, యిటికల గుట్టల దగ్గరకి పరుగెత్తాం. ఆ తాగుబోతులంతా యింట్లోకి పరుగెత్తారు. దాసీది కిటికీల కర్రతలుపుల్ని వేసేసింది.

హాటాత్తుగా మా వెనకనుంచి కంట్రాక్టరు కంఠధ్వని వినపడింది. వాడి గొంతుక తొణుకు బెణుకు లేకుండా గంభీరంగా ఉంది.

"నా యిటికలతో యేం చేస్తున్నారు? ఆ యిటికలు నావి. వాటితో నన్ను కొట్టేందుకూ, వాటిని ముట్టుకొనేందుకు మీ కధికారం లేదు. అంతేకాకుండా నన్ను కొట్టవలసిన అవసరంకూడా లేదు. మీకు సమాధానాలు చెప్పేందుకు సిద్ధంగా ఉన్నాను."

ఇటికలు గుట్టలమీద పెట్టి ఆయింటి తోటలో ప్రవేశించాం. మేమొక వైపునా, కంట్రాక్టరు, అతిథులు మరొక వైపున నిలబడి ఉన్నాము.

సోర్సనారా, కొద్దిగా ముందు నడిచి ఒక చేతిని హృదయం దగ్గర, మెడలువున్న చోట పెట్టి, కాలవని మార్చాలని ప్రయత్నిస్తోన్న ఆ కూలీల దుర్మార్గాన్ని గూర్చి జాగ్రత్తగా చెప్పింది.

“ వాళ్ల దౌర్జన్యాన్నుంచి మమ్మల్ని యేలినవారు తప్ప కుండా రక్షిస్తారని యెంచుతున్నాము” అంటూ సోర్సనారా ముగించింది.

“ అది నిజంగా దౌర్జన్యమే అయితే నేను తప్పకుండా అణచేందుకు ప్రయత్నిస్తాను. నేను సంఘానికి అధికారిగా ఉన్నంత కాలం, బీదకూలీలకూ, ఫాంటమారా రైతులవంటి రైతులకు యేవిధమైన అపకారము జరగనివ్వను. ఆ విషయాన్ని మీరు సంపూర్ణంగా నమ్మవచ్చును. కాని, యీవిషయంలో మీకేమీ అపకారం జరగలేదు. కాబట్టి, యీ సంగతి వాళ్లకి పూర్తిగా తెలియచెప్పు. అని కంట్రాక్టరు సమాధానం చెప్పాడు.

అతిథులగుంపులోంచి పోలీసు కాప్టెన్ యివతలికి వచ్చాడు.

“ ఈ విషయంలో యేమీ అన్యాయం జరగలేదు. క్రొత్త ప్రభుత్వంలో, అపకారం జరగడం అసంభవం. ఆ జరిగిన పని న్యాయసమ్మతమైనది. ఫాంటమారా ప్రజలకి ప్రభుత్వాధికారులు చేసిన మహోపకారం. ”

జేబులోంచి, ఒక కాగితాలకట్టను బయటికి తీసి మళ్లీ సాగించాడు.

"ఇదిగో, ఫాంటమారా ప్రజలందరూ సంతకాలు పెట్టి పంపించిన మహజరు. మీ గ్రామంలో ప్రతివ్యక్తికూడా యీ మహజరు మీద సంతకం చేశాడు. ఫాంటమారా రైతులు యీ జలాధార నీటిని ఉపయోగించి సాగుచేసే భూముల్లో సరిగ్గా పంటలను పండించలేకపోతున్నారనీ, అందుచేత యెక్కువ పెట్టుబడి పెట్టి అధికంగా పంటల్ని పండించి ఉత్పత్తిశక్తిని అధికం చేయగలిగిన పెట్టుబడిదారుకే యివ్వమని గ్రామస్థులందరూ ప్రభుత్వానికి మహజరు పెట్టుకున్నారు."

ఆ పోలీసు కాప్టెన్ యింకా యేమిటో మాట్లాడబోయాడు, కాని మేము మాట్లాడనివ్వలేదు. అంత క్రితం రాత్రి గౌరవనీయుడైన పెలినో అనే ఆయన ఫాంటమారావచ్చి అందరి సంతకాలు తెల్లకాగితాల మీద చేయించుకొని వెళ్ళిన విషయం మా అందరికీ తెలుసును.

"దొంగలు! ఫోర్జరీదార్లు! మోసగాళ్ళు!" అంటూ తిట్టటం మొదలెట్టాం. "బీదవాళ్ళ కొంపలు తీసేందుకు మీరందరూ లాలు, గీలు, చదువుతారు. మీ 'దొంగ' మహజర్లూ, మీరూ నాశనమై పోనూ!"

కంట్రాక్టరు యేదో మాట్లాడేందుకు ప్రయత్నించాడు. కాని మేము మాత్రం అవకాశం యివ్వలేదు.

"మేమేమీ వినదలచుకోలేదు. నీ మాటలన్నీ బోనులాంటివి. ఇంక యేమీ చెప్పనక్కర్లేదు. ఆ నీరు మాదే! దేవుడు

దిగివచ్చినా సరే, మాకిందే వుండాలి! ఈ యింటికి నిప్పెడతాం! ఇంకా చూస్తారేమర్రా! తగులబెట్టండి!"

డాన్ సర్కో-స్ట్రాంజా కంట్రాక్టరుకి అడ్డుపడ్డాడు.

"ఈ స్త్రీలు చెప్పినదంతా వాస్తవం." అంటూ బిగ్గరగా గొంతుక చించుకుంటూ అరవడం మొదలెట్టాడు. "వంద సార్లు, వెయ్యిసార్లు వాళ్ళు చెప్పిందే నిజం. నేనట్లా ఘంటా పదంగా చెబుతాను......"

తక్షణం మే మూరుకున్నాం ఆయన మా తరఫున వాదించడం మొదలెట్టాడు. ఆయన గొప్ప లాయరని మా అందరికీ తెలుసు.

"ఈ స్త్రీలు యదార్థాన్ని చెబుతున్నారు. పదివేల సార్లు వాళ్ళు చెప్పిందే నిజం. వాళ్ళ తరఫున నేను ఎప్పుడూ వాదిస్తాను. ఇక ముందుకూడా వాదిస్తూంటాను! వాళ్ళుముఖ్యంగా కోరేదేమిటి? గౌరవాన్ని కోరుతున్నారు.... ముమ్మాటికీ గౌరవాన్ని కోరుతున్నారు."

"ఆయన చెప్పింది వినండి! వినండి!" అన్నారు మాలో చాలామంది.

వారు గౌరవాన్ని కోరుచున్నారు. వారిని గౌరవించవలసిన బాధ్యత నీ మీద వుంది. వారు గౌరవం పొందదగినవారు. ఈ స్త్రీలకి దురాశ లేదు. న్యాయచట్టాలు, న్యాయశాస్త్రం వాళ్ళకి వ్యతిరేకంగా వుందని వాళ్లకి తెలుసు, న్యాయశాస్త్రానికి వ్యతిరేకంగా వెళ్ళాలని వాళ్ళు ప్రయత్నించడం లేదు.

హోడెష్టాగారితో గౌరవకరమైన పద్ధతిని యీ విషయాన్ని పరిష్కరించుకోవాలని వాళ్ళు కోరుతున్నారు. వారు మంచి తనానికీ, సుహృదయతకీ మనవి చేసుకుంటున్నారు: వాళ్ళు యీ పురపాలక సంఘాధ్యక్షునితో కాదు మొర పెట్టుకున్నది, తన దేశానికి సర్వస్వం అర్పించి దేశంనుంచి యేమీ ప్రతి ఫలం ఆశించని నిష్కళంక ప్రజాసేవకునితో, త్యాగశీలునితో. ధర్మజూరునితో హృదయం కరిగేట్లా మనవి చేసు కుంటున్నారు. ఈ విధంగా పరిష్కారం ఔతుందా? అపరిష్కారం అవడం సాధ్యమే.

డాన్ సరోక్రస్టాంజా ఉపన్యాసం ముగించగానే అనేక పరిష్కార మార్గాలు సూచించబడ్డాయి. డాన్ అబ్బేషియో ఒక మార్గం, పన్నుల కలెక్టరు మరొక పద్ధతీ చెప్పారు. వాళ్ళు చెప్పే వాటిల్లో భూమి సాగుకెంత నీరు కావాలో, యెవ్వళ్ళూ చెప్ప లేదు. అందుచేత ఆ పరిష్కారమార్గం ఒక్కటీ కుదరలేదు. కంట్రాక్టరు పెదవులు కదపలేదు. ఇతరుల్ని మాట్లాడ నిచ్చాను. డాన్ సరోక్రస్టాంజాకి నిజమైన పరిష్కారమార్గం దొరికింది.

"ఈ స్త్రీలు, ఆబోదెలో సగం నీరు సరిపోదని చెబుతున్నారు. వారి కోరిక నేను సరిగా మీకు తెలియ జెప్పాలంటే వాళ్ళకి సగభాగంకంటె నీరు యెక్కువ కావాలి అని మనవి చెయ్యవలసి వస్తుంది. వారి కోరిక నిస్సందేహంగా సబబైనదే. అందుకని ఒకే ఒక మార్గం ఉంది. హోడేష్టాగారికి బోదెలో మూడువంతుల నీళ్ళు, ఫాంటమూరా ప్రజలకి మిగిలిన మూడువంతుల నీళ్ళూ, అప్పుడే ఉభయులకీ ప్రచారోక

మూడువరతులు వస్తుంది. ఒక్కొక్కరికి సగంకంటె కొంచెం అధికంగా వస్తుంది. ఈ తగవు పరిష్కారానికి అదొక్కటే మార్గం. నేను చెప్పిన యీ పద్ధతి, పొడెష్టాగారికి యెంతో నష్టం కలిగిస్తుందనే విషయం నాకు తెలుసును. కాని మానవ శ్రేయోభిలాషి, ఉదారుడూ గాన ఇతరుల కెప్పుడూ దానమే చేస్తూ, యెప్పుడూ ప్రత్యుపకారానికి ఆశించరు గనుక ...''

డాన్ సిక్కోన్, డాన్ టారెంటెల్లా, డాన్, డాన్ పాంపోనియో, కాప్టెన్లు భయ విముక్తులై, కంట్రాక్టర్ని చుట్టివేసి, మాకొరకు ఆ త్యాగం చెయ్యవలసిందని ప్రార్థించసాగారు.

చాలాసేపు బతిమాలిన తర్వాత వాళ్ల ప్రార్థనల్ని నిరాకరించలేక కంట్రాక్టరు మన్నించాడు.

ఒకరు ఒక కాగితం తీసికొచ్చారు.

దస్తావేజుల్ని వ్రాసే ఆయన రాజీషరతుల్ని వ్రాసి కంట్రాక్టరు చేత సంతకం పెట్టించాడు. పోలీసు కాప్టెన్ సంతకం చేశాడు. మా ఫాంటమారా గ్రామస్థుల ప్రతినిధిగ్రింద సర్కోస్టాంజా సంతకం చేశాడు.

ఈ పని పూర్తై పోయాక మేమంతా యింటికి వెళ్ళిపోయాం. తరువాత జరిగిన విషయాలు ఆయన చెబుతాడు.

3

ఆ కాలవ త్రవ్వకం పూర్తి అయ్యేవరకు, రెండు లారీల రిజర్వు పోలీసులు, కూలీలకి రక్షణగా కాపున్నారు. కంట్రాక్టరు

భూములగుండా ఆ క్రొత్త కాలువ వెడుతోంది. ఎంత భాగం నీరు దాంట్లోంచి ప్రవహిస్తోందో మాత్రం మాకు స్పష్టంగా తెలియడం లేదు.

మూడేసి వంతుల చొప్పున, రెండు సమభాగాలు ఔతాయో అవవో తెలిసికోగలిగినంత మేము చదువుకోలేదు, నీరు పంపకాల దగ్గిర, యెవరెవరికి యెంతవస్తుందో మా ఆడ వాళ్లూ వచ్చి చెప్పలేకపోయారు. ఆ ఒడంబడిక షరతుల్లో యేముందో కూడా పూర్తిగా వాళ్లకి అర్థమైనట్లు కనబడదు. ఇద్దరికీ సమానంగా వస్తుందని కొందరు చెప్పారు. ఫాంట మారా వాళ్ళకి సగంకంటె పైన, అంటే మూడువంతులు వస్తుందని కొందరు వాదించారు. బాల్డిస్సేరా అగ్రిమెంటులో ఉన్న మూడు భాగాలు చంద్రమానానికి చెందుతాయి అనీ, మొదటి మూడు దశల్లోనూ కంట్రాక్టరు, తరువాత మూడు దశల్లోనూ ఫాంటమారా రైతులూ నీళ్లు పెట్టుకునేందుకు నిర్ణయం జరిగిందని వ్యాఖ్యానం చేశారు.

మాలో ప్రతివాడికీ, కంట్రాక్టరుతో తగాదా పెట్టుకొని యే లాభం లేదనీ, వట్టి గొంతుకలు చించుకొని ఫలితం లేదనీ మాత్రం పూర్తిగా తెలిసింది. ప్రక్కవాడికి నీరున్నా, లేక పోయినా సరే, తానుమాత్రం నీరు పెట్టుకోవాలనీ ప్రతి వాడూ పన్నాగాలు పన్నుతున్నాడు. దుక్కులకాలం, ఇంకా కొన్ని వారాలున్నా దెబ్బలాటలు, తిట్టుకోవడాలు అప్పుడే తీవ్రంగా సాగుతున్నాయి.

మా గ్రామంలో చాలామంది, ఆ రోజుల్లో ఫ్యూసినోలో

పనిచేస్తోండే వాళ్లం. తెల్లవారుఝామున మూడుగంటలకి లేచి పట్టణంపోయి, మార్కెట్టులో పడగాపులు పడి కూర్చొని, యెవరైనా పనికి పిలిస్తే వెళ్ళేవాళ్ళం. ఇదివరకు రోజుల్లో బాగా బీదవాళ్ళే యిలా చెయ్యవలసి వచ్చేదికాని, యీ కష్టపురోజుల్లో మా అందరి పనీకూడా చితికిపోయి, మేము కూడా యిల్లానే కడుపు చేత్తోపట్టుకొని బయలుదేరవలసి వచ్చింది. మాలో అందరికి కొద్దికొద్దిగా భూములున్నాయి. కాని చాలవరకు తాకట్టులో ఉన్నాయి. వాటిలో పండిన పంట వడ్డీకి సరిపోదు. మేము విరగబడి పెద్దపెద్ద తండాలుగా బజారులో కూర్చోవడం మూలాన్ని భూస్వాములు మాకూలి బాగా విరగ్గొయ్యడం మొదలెట్టారు. అయినా సరే కడుపు కాలుతోండే కూలీలు ఆ చావు జీతాలకే పని ఒప్పుకొని రెక్కలు ముక్కలు చేసుకుంటున్నారు. పని దొరుకుతుందో దొరకదో అనే భయంచేత చాల మంది ముందు కూలి మాట్లాడుకోకుండానే పనుల్లోకి వెళ్ళిపోతున్నారు.

బజారుకీ, ఫ్యాసినోలో మేము పని చెయ్యవలసినచోట్లకీ ఐదు మొదలుకొని పదిమైళ్లవరకు దూరంవుండేది. అంటే ఫాంటమారా నుంచి బజారుకుండే మూడుమైళ్ల దూరం కాకుండా నన్నమాట. సాయంకాలం మళ్ళీ యింతదూరం నడిచి యిళ్లకు వెళ్లవలసిందే. ప్రతిరోజూ, పనికివెళ్ళేటప్పుడూ, పనినుంచి తిరిగివచ్చేటప్పుడూ నీటి వంతులకోసం దెబ్బలాట చాల తీవ్రం అయిపోతోంది.

ఒకరోజున ఘర్షణ పెరిగిపోయి దెబ్బలు కొట్టుకోవడం లోకి దిగింది. లోసర్డో దుష్టకర్రతో మిచీలీ జోంపాతుంటిమీద

కొట్టాడు. చాలా మోపైన దెబ్బ తగిలింది. సియరప్పా బుర్ర పుచ్చకాయలా పగిలింది. అంట్లోసియో చేత్తిసి వాడి బావే విరగగొట్టాడు. పిలాటోకి, నాకూ వైరం పెరిగిపో తోంది. ఇద్దరమూ కొడుకుల్ని వెంటబెట్టుకొని కర్రలూ, కత్తుల్లూ పట్టుకుని పనులకి వెడుతున్నాం, ఒక్క నీటి బొట్టైనా వదిలి పెట్టాలని లేదు. ఒకళ్ళ నొకళ్లు పలకరించుకోడం కూడా మానివేశాము. కారాలు, మిరియాలు నూరుతూ; కోరచూపులు చూసుకుంటూ వుంటే మాలో నెవరికో ఒక రికి రోజులు మూడాయని అనిపిస్తోంది.

ఒకరోజున నా కొడుకుతో నేను ఫ్యూసికో వెడుతున్నాను. సియరప్పా దారిలో రోడ్డుపనివాళ్ళతో మాట్లాడుతున్నాడు. "ఏమ్ యిల్లా చూడండి. నా చిక్కుడుపాదులకు మాత్రం నీరు కావాలి. నీరు తక్కువైందా, బుర్ర లెగిరిపోతాయి. అంతే" అని చెబుతున్నాడు.

"నీ బుర్రే పగుల్తుంది" అంటూ వాడి మీదికి పరుగెత్తాను. రెండుచేతుల్లోనూ రెండు కర్రలున్నాయి.

బెర్గాడో వయోలా, మరి యిద్దరు పోలీసులు ఆ రోజున కాపలా కాస్తున్నారు. అందుచేత, ఆ రోజున యెవళ్ళ బుర్రలు పగలేదు.

కొన్ని రోజులు పరకు, రోజూ, బెర్గాడో నాకూడా వచ్చేవాడు, నేను, పిలాటో కలియబడకుండా చూస్తేందుకు. ఈ నీటి వర్తకుల విషయంలో, వాడికేమీ భూమిలేదు గనుక, మా ఇద్దరి మధ్య తీర్పరికించ వుండేవాడు.

వాడికి తండ్రి యిచ్చిపోయిన కొద్దిభూమికూడ అమెరికా వెళదామనే ఉద్దేశ్యముతో అమ్మిపారేశాడు. కాని వలసపో యేందుకు అనుజ్ఞమాత్రం వాడికి దొరకలేదు.

గొలుసు తెంపుకు పారిపోయిన పెంపుడుకుక్క పూర్తిగా యిల్లు వదల్లేక, ప్రతిపూటా వేళతప్పకుండా దొరికే అన్నాన్ని జ్ఞాపకం చేసుకొని యింటిచుట్టూ తచ్చాడేట్లా, అటు అమె రికా వెళ్లలేక, యిటువున్న భూమికాస్తా పోగొట్టుకొని, ఫాంటమారాలోనే దేవుళ్లాడుతున్నాడు. కాని స్వతహాగా, వాడి స్వభావం చాలా దురుసు. శాంతం అనేది కంచు కాగడా వేసి చూసినా వాడిలో కన్పించదు.

మా మా ప్రాంతాల్లో పేరుపడ్డ బందిపోటు గాడైన వదోలా మనుమడు. దొంగవదోలా 1867 వ సంవత్సరములో పైడ మాంటీస్ ప్రభుత్వం చేతిలో దొరికిపోయాడు. వాడి పేరు చెబితే మా ప్రాంతం అంతా గడగడలాడి పోయేది. ఈ బెరార్డో వదోలా, తాత దేహాన్ని, దురుసు స్వభావాన్ని పుణికి పుచ్చుకొన్నాడు. పెద్దరాక్షస శరీరం, ఓకుచెట్టు మొదలుకుమల్లే చేవదేరిన దేహం రాచ్చిప్పలాగు చదరపు తల, దయ్యం పట్టుకున్న వాళ్ళకి మల్లే బాగా విప్పారిన పెద్ద కళ్లు చాలా ధైర్యవంతుడు. ముందూ వెనకా చూడని తెగువ. ఏదితోస్తే అది చేసేందుకు సిద్ధం అవుతాడు. దెబ్బ లాటకు సిద్ధం. దేవుడన్నా భయంలేదు. మనిషంటే, అసలు లెఖ్ఖేలేదు. సారాయిలంటే చాలా యిష్టం. దూబరాఖర్చు మనిషి. స్నేహితుల్ని బాగా ఆదరిస్తాడు. రణపెంకి. ఫాంట మారా కుర్రాళ్ళు కొందరు యీతని శక్తుల్ని దేహాన్ని

చూచి అతనికి శిష్యులయ్యారు. ఇతనికున్న యీ పలుకు బడి మూలాన్ని యేమీ మంచి జరక్క పోవడమే కాకుండా దెబ్బలాటలకి, నాశనానికి కారణం అవుతూండేది.

అమెరికాకు వలసపోయేందుకు వీల్లేదని స్పష్టంగా తెలిశాక, ఒకరోజు తెల్లవారేటప్పుడికి డాన్ కార్లో ద్రాక్షతోటలో ఒక్కకాయ లేదు. పట్నం వాళ్లు చేసిన పురోహితుడూ గాడిదా తమాషాకి సమాధానంగా పట్నానికి వెళ్ళే నీటి పంపులు అనేకచోట్ల విరక్కొట్టబడ్డాయి. మరొకసారి, యేని మీది మైళ్ళ యీ చుట్టు ప్రక్కల మైలురాళ్లన్నీ ముక్క లయ్యాయి.

ఫాంటమారాలో యెలక్ట్రిక్ దీపాలు ఆరిపోయిన మొదటి రోజుని నోరు మెదపలేదు. కాని గెంగవరాత్రి నాటికి పట్ట ణానికి చుట్టుప్రక్కల వూళ్లకి మధ్యనున్న ఎలక్ట్రిక్ స్తంభా లన్నీ పెరికివేయబడ్డాయి.

"అబ్బే! పట్టణం వాళ్లతోటి మంచిగా మాట్లాడితే లాభం యేముంది?" యిదీ బెరార్డో సిద్ధాంతం.

దానికి యీ విధంగా అర్థంచెబుతుంటాడు. "న్యాయ శాస్త్రం పట్నం వాళ్లచే చెయ్యబడింది. జడ్జీలు వాటిని అమలు పరుస్తారు. వాళ్ళూ పట్టణంవాళ్ళే. న్యాయశాస్త్రం మీద వాదోపవాదాలు చేస్తారు లాయర్లు. వాళ్లూ పట్నం వాళ్ళే. అలాంటప్పుడు రైతు కెక్కడ న్యాయం దొరుకు తుంది?"

జీతాలు తెగ్గోస్తే మనం అడక్కపోతే యెల్లాగయ్యా అంటే తక్షణం యిలాగ సమాధానం యిస్తాడు.

"నట్టి కాలయాపన. దానివల్ల యేమీ లాభం లేదు. ఏరోజు కారోజు పనికి తడుముకొనే వ్యవసాయ కూలీరైతులకోటి వాదించడం అంత వ్యర్థమైన పని యింకేమీ లేదు. రైతు తన లాభం చూసుకుంటాడు. అస్తమానమూ కూలి తెగ్గోస్తూంటే అప్పుడప్పుడు తనకే నష్టమౌతూంటుంది. అది తెలియక యెప్పుడూ విరగ్గోస్తూంటాడు. అల్లా విరగ్గోస్తే వాళ్ళకొచ్చే నష్టమేమంటారా, ధాన్యంమళ్ళలో ఆకుతీత తీసే కుర్రాళ్ళకి తక్కువకూలి యిస్తాడు. కాని ఆ కుర్రాళ్ళంతా నామాట వింటారు. చాక, అల్లి, బొడ్డూ, తుంగ, తీసేసే బదులు వాళ్ళు మన్నెట్టి కప్పేస్తారు. వర్షాకాలం అయిపోయాక వరిచేలో ఈ తుంగ అవీ దట్టంగా ఉండడం రైతుల కంటబడుతుంది. మనకూలీల కూలి విరగ్గోసి వాళ్ళు మిగుల్చుకున్నామని చంక యెగరవేసే రెండువారాల్లోనే వాళ్ళకి దానికి పదిరెట్ల నష్టం కనిపిస్తుంది. ఒకవేళ కోతల్లో తగ్గిస్తారా అప్పుడు మన మేమీ వాదాలు పెంచుకోకూడదు. ఒక టేమిటి, బోలెడన్ని రకాల కోతలున్నాయి. ఒక్కొక్కరికం కూలికి ఒక్కొకరకంకోతచొప్పున పదిరకాల కోతలున్నాయి. కూలి గిట్టుబాటైతే రైతుకి మా పని గిట్టుబాటౌతుంది."

మన కాలవని పట్టపగలు కంట్రాక్టరు దోపిడీచేస్తూవుంటే, యేం చెయ్యాలని మే మడిగితే యీ విధంగా సమాధానం చెప్పాడు.

"వాడి తోళ్ళషాపుకి నిప్పంటించండి. మీరు మాట్లాడకుండా మీ నీటిని మీ కిచ్చేస్తాడు. అప్పటికీకూడా అర్థం కాకపోతే వాడి కర్రలడుకాణానికి నిప్పంటించండి. ఆ మోతాదుకూడా సరిపోకపోతే వాడి బంగాళా పెంకుల అమని పడగొట్టండి. ఆఖర్ని వాడి బంగాళా తగులబెట్టండి. కాలవని తెప్పించుకోవాలంటే అదే మార్గం. లేకపోతే, మీ కూతుళ్ళనికూడా బజారులో పెట్టి వాడు అమ్మేరోజులు వస్తాయి. అప్పుడు వాణ్ణి అనుకునికూడా ఫలితం ఉండదు. అయినా, మీ కూతుళ్ళ లెఖ్ఖ వాడికేం వుంది?"

బెరార్డో వయోలా సిద్ధాంతం యిది. జానెడు బెత్తెడు నేల కూడా లేక పోవడం మూలాన్నీ, లేదని కడుపులో కుళ్ళ ఉంది. కనుకా వాడల్లా వాదిస్తున్నాడు. పోగొట్టుకునేందుకు గోచీగుడ్డకూడా లేనివాడికి మల్లే వాదిస్తున్నాడు. తక్కిన రైతుల పరిస్థితులు వేరు.

అమెరికా వెళ్ళాలని ప్రయత్నించడం తరువాత ఒకరోజున పొలం పనికి, మరొక రోజన కట్టెలు కొట్టేందుకు, గోడలు పెట్టేందుకు, కాలవ తవ్వేందుకు, రోజుకోపని మార్చెయ్యాడం చూస్తే అతని స్థితి అతనికే సంతృప్తి కరంగా లేనట్లు తోస్తోంది. పొలం లేనివాడు గనుక అతనికీ, తక్కినవాంకూ మాలో దాలో తేడావుంది. అంచేత అతని సలహాని మేమెవళ్ళం పాటించం. మా చర్చలో యెప్పుడు జోక్యం కలిగించుకొన్నా సరే, ఆ చర్చ మరి తేలడం ఉండేదికాదు. మరీ ఖంగాళుగా వుండేది. బాల్డిస్సెరా సేనానికీ, వాడికీ ఎప్పుడూ ఎదురూ

బదురే. చెప్పులు కుట్టుకునేవాడు కనుక అతని కీవృథా వాగ్వాదమంటే యిష్టమే.

కాని ఊళ్ళోవున్న కుర్రాళ్ళందరి మనస్సుల్నీ, దృక్పథాన్నీ మాత్రం బెరార్డో అద్భుతంగా మార్చేశాడు.

ఇప్పుడున్నంతి మంది యువకులు, ఫాంటమారాలో యింత క్రితం ఎన్నడూ లేరు. ఇంతకుపూర్వం, పదహారు యేళ్ళు వచ్చిన కుర్రాళ్ళంతా ఇళ్లని వదలిపెట్టి, పనులకోసం దేశాంతర వాసు లయేవాళ్ళు. కొందరు రోమను కాంపేనాకీ, కొందరు అపూలియాకీ, తక్కినవాళ్లు అమెరికాకూ వెళ్ళేవారు. వారిలో చాలమంది, వారు ప్రేమించిన పిల్లలని సాధారణంగా, నాలుగు, ఆరు, కొన్ని కొన్ని సమయాల్లో పది యేళ్లకూడా వదలి ఉండి, మళ్లీ ఫాంటమారాకు తిరిగివచ్చి పెళ్ళిళ్ళు చేసుకునేవారు. కొందరు పర దేశాలకి పనులకోసం వెళ్ళే ముందురోజున వివాహంచేసుకొని కూడా పరాయి దేశాల్లో వుంటూండేవారు. స్వగృహాలకి తిరిగివచ్చేటప్పడికి యెదిగిన కొడుకులూ, కూతుళ్ళూ వారిని ఆహ్వానించేవారు.

కాని వలసని నిషేధించడం మూలాన్ని యువకులంతా గ్రామాలు, వదలి పర దేశాలకి వెళ్ళే అవకాశం లేక, యింటి పట్టునే వుండవలసివచ్చింది. ఫాంటమారాలోఅందరికీ పనులు దొరకడం లేదు. కూలి నిమిత్తమై యితర దేశాలకి వలస పోవడం అసాధ్యం అయిందంటే తండ్రి తాతలు చేసిన అప్పుల్ని తీర్చుకోవడం, తణఖాల్లోవున్న పిత్రార్జితాల్ని

వదలించుకోవడం, పెట్టుబడికి యితరుల్ని అర్థించకుండా
వ్యవసాయాన్ని చేయించడం, పురాతన పద్ధతులమీద
కాకుండా, ఆధునిక వ్యవసాయ యంత్రసామగ్రుల్ని కొని వ్యవసా
యాన్ని చేయించడం, ముసలిగాడిద, చచ్చిన గుర్రాలస్థానే,
క్రొత్త గాడిద, గుర్రాలను కొనుక్కోవడం, పెళ్ళిఖర్చులు
నిలవేసుకోవడం, మంచాలూ, పరుపులూ కొనుక్కోవడాలు
కూడా అసాధ్యం అయిపోయూ యున్న మాటే! కాని కుర్రాళ్లు
కనుక అస్తమానమూ గొణుగుతోనూ, ముక్కుతూ మూల్గు
తుండేవాళ్లు కాదు. తీరుబడిగావుండే రోజుల్లో అందరూ
గుమికూడటం, వాళ్ళల్లోకల్లా వయస్సులో పెద్దవాడు, తెలివి
తేటల్లో చిన్నవాడు అయిన యెవడో ఒకడు చెప్పినట్లు అర్థం
గిర్థం లేని అల్లరి, చిల్లరి పనులు పొలోపొలోమంటూ చేస్తోం
డటం వాళ్ళకి అలవాటైంది.

శీతాకాలంలో, యువకులంతా యాంటోనియో జప్పా పశు
వులశాలలో అవకాశం చిక్కినన్ని సార్లు కలుసుకుంటూ
వుండేవారు. ఆ శాలలోని గాలి మేకలు విడిచే వాయువుతో
కొద్దిగా వేడెక్కివుండేది. ఊళ్ళో కుర్రాంళ్ళంతా యిక్కడ
సమావేశము అయ్యేవారు. ఏదైనా దౌర్జన్యపు ప్రయ
త్నాలు జరిగేటప్పుడల్లా బెరార్డో వయోలావస్తుండేవాడు.

ఈ సంఘాలు యితరుల నెవ్వరిని లోపలికి రానిచ్చేవారు
కాదు. ఫాంటమారాలోవుండే ఆడపిల్లలు యీ సంఘాన్ని
"దుష్ట సమాజం" అని పిలిచేవారు. మొదటి రోజుల్లో యీ
పేరు పెట్టి పిలవడం అన్యాయమేమో అనుకొనేవాళ్ళం కాని
తరువాత తరువాత, వాళ్లుచేసిన పనుల్ని బట్టి ఆపేరు తగి

వుందని అనుకోవలసివచ్చింది. నిజానికి, యీ యువకులంతా చేరి ఆడ మేకలని చెరుపుతున్నట్లు, ఒకరోజున బయటపడింది. ఆ మేకల్లో సియరప్పా మేక గులాబీవర్ణంగా ఉంటుంది. చాలా అందంగా ఉంటుంది. అంతే కాకుండా ఆ ఆడమేక అతి చనువుగాను, ఆనందంతోటీ, తృప్తితోటీ యీ యువకుల దగ్గిరకి చేరుతో వుంటుందనికూడ తెలిసింది. ఈ మేక కోసమని, చాలా దెబ్బలాటలు, సంఘర్షణలు తరుచుగా జరుగుతుండేవి. సర్వ సామాన్యంగా యిల్లాంటి విషయాలు జరుగుతోండేట్లానే, ఆ మేక స్వంతదారైన సియరప్పాకి ఈ యువకుల దుష్ప్రవర్తన గురించి అందరికంటే ఆఖరికి తెలిసింది. ఈ నీచ ప్రవర్తన అందరికీ తెలియడంతోటే రైతులు వారి మేకల్ని యాంటోనియో జప్పాకి మేపుకు వచ్చేందుకు అప్పగించడం మానేశారు. అందువలన "దుష్టసమాజం" కూడా రద్దుచెయ్యబడింది.

ఆరోగ్యవంతుడూ, చురుకైనవాడూ అయిన జెరార్డోలాంటి యువకుడు ముప్ఫైయేళ్లు వచ్చినప్పటికి వివాహం చేసుకోకుండా, పెళ్ళిమాట తలపెట్టకుండా వుండటం అత్యాశ్చర్యకరమైన విషయం. ఇదివరలో ఒకప్పుడు ఎల్వీరాని వివాహం చేసుకోవాలని ప్రయత్నించాడు. ఆ యిద్దరికీ మనస్సులు కలిశాయి. ఆమె అన్ని విధాల అతనికి తగివుంది. కాని, ఆ పాలం కాస్తా పోగానే హటాత్తుగా ఆ పిల్లతోటి మాట్లాడటం మానేశాడు. పెళ్లివిషయం తలపెట్టేవాడుకాదు. ఎవరైనా ఎల్వీరా సంగతి యెత్తితే మండిపడతాడు. శీతాకాలపు సంధ్యా సమయాల్లో, వృద్ధులు చుట్టలూ, సారాయి తాగు

తూనూ, యువకులు ప్రేమవ్యవహారాల్లో మునిగి తేలుతుం టేనూ, బెరార్డో అర్థరాత్రి మీారేవరకూ బాల్డిస్సేరా సేనానితో, పట్టణవాస్తవ్యులకీ, పల్లెటూరి రైతులకీ గల తేడాలను గూర్చీ, మతాధిపతుల, ధనాఢ్యుల సాంప్రదా యాలను గూర్చి వాదిస్తోండేవాడు. చర్చలలో వుద్రేక పూరితంగా, సోర్సనారా యింటిగుమ్మాలు అదిరిపోయేట్లాగు, కాళ్ళతో నేలను తన్నుతూండేవాడు. అయితేం బాల్డిస్సేరా సేనాని చలించేవాడు కాడు. ఈ ప్రస్తుత సమాజం శాశ్వ తంగా యీా విధంగానే చలనం లేకుండా వుండిపోతుందని వాదిస్తో తీవ్రంగా చర్చ సాగిస్తోండేవాడు.

బెరార్డో ఎల్వీరాని ప్రేమించడం మానుకుని, ఆమెమాటే తలపెట్టడం మానేశాడనీ మీారు అనుకోవచ్చును. కాని ఒకరోజున తనని వివాహం చేసుకోమని ఎల్వీరాని ఫిలిప్పో కోరాడనే వార్త ఊళ్లో వ్యాపించింది. ఈ విషయం చెవిని పడగానే పిచ్చియెత్తిన ఆంబోతులాగు బెరార్డో రంకెలు వేస్తూ ఫిలిప్పోయింటికి పరుగెత్తాడు. ఇంటివద్ద లేడని తెలియ గానే రాళ్లగని దగ్గరకి పరుగెత్తి పనిచేస్తోన్న ఫిలిప్పోని అతి తేలిగ్గా పైకియెత్తి రాళ్ళగుట్టమీాద పదిసార్లు కుదేశాడు. ఎల్వీరాని ప్రేమించాడా లేదా? ఆ కథ నిజమేనా అని అడ గనైనా అడగలేదు. ఈలోపుగ, యితర కూలీలు వచ్చి బెరార్డోని ఆపారు. ఆనాటినుంచి మరెవ్వరూ ఎల్వీరావద్దకు వెళ్ళలేదు. బెరార్డోకూడా ఆ యింటివైపు వెళ్ళడం మాను కున్నాడు.

పనినుంచి యింటికి వెళ్ళేటప్పుడు ఒక సాయంకాలం, యీా

విషయాన్ని గూర్చి ఆతనితో కదుపుదామని ప్రయత్నించాను.

"ఎల్వీరాకి యిరవై అయిదేళ్లుకూడా దాటిపోయి వుంటాయి. మన ప్రాంతాల్లో యువకులందరూ కూడ యిరవై రెండేళ్లు వచ్చేటప్పటికికే పెళ్లిళ్లు చేసుకుంటారు. కేవలం వివాహ విషయమే కాకుండా యింట్లో గడిచేందుకు ఎల్వీరాకి కొంత తోడుకూడా కావాలి" అన్నాను నేను.

బెరార్డో సమాధానం యివ్వలేదు.

"ఆమెని వివాహం చేసుకోవాలని నీమనస్సుని స్థిరపరచుకో లేకపోతే, ఇంకొకర్ని పెళ్లి చేసుకునేందుకు ఆమెకు హక్కు వుంది."

"ఇంతతో కట్టిపెట్టు" అంటూ బెరార్డో మండిపడ్డాడు. అంతటితో ఆ సంభాషణ ముగిసింది.

మరుచటి ఉదయం ఫ్యూసినో పొలాలకి వెళ్లేముందు బెరార్డో వస్తాడేమోనని యెదురు చూశాను. ఎంతసేపటికీ రాకపోతే వాళ్ల యింటికి వెళ్లాను. అతని అమ్మమ్మ యేడుస్తూ యిలా చెప్పింది.

"బెరార్డోకి పిచ్చి యెత్తుతోంది నాయనా, వాళ్ల తాతకంటె దారుణంగా వీడు పాడైపోతాడు. రాత్రిఅంతా ఒక్క-క్షణంకూడా కన్ను మూయ్య లేదు. రెండుగంటలవేళ లేచాడు. "ఫ్యూసినో వెళ్ళేందుకు యింకా చాలా ప్రొద్దు వుంది" అన్నాను. "నేను ఫ్యూసినోకి వెళ్ళడం లేదు" అని జవాబిచ్చాడు. "ఐతే యెక్కడికి" అని అడిగాను. "కమ్మరీస్ కి"

అన్నాడు. ఫ్యూసినోలో పనివుంది కదా అక్కడి కెందుకు'' అని అన్నాను. ''కమ్మరీస్ పనుల్లో యెక్కువ డబ్బుదొరుకుతుంది'' అన్నాడు. ''డబ్బుఅంటె ఆశ యెంతకాలంనుంచిరా నాయనా? అయ్యో ఆ లెఖ్ఖ వుంటేనా?'' అన్నాను నేను. మారుమాటాడకుండా వెళ్ళిపోయాడు.

బెరార్డో గ్రామాంతరం వెళ్ళాడనేవార్త వూళ్లో అతి వేగంగా వ్యాపించింది. రైతులందరూ ఆశ్చర్యపడ్డారు. ఐనా, వ్యవసాయ కూలీకి యెక్కడ యెక్కువకూలి దొరుకుతోంటే అక్కడికే పోతాడు. తన చుట్టుప్రక్కల పనివున్నా, తక్కువ కూలి అయితే, యింకొకచోటికి వెళ్ళడంలో అబ్బురపాటు యేముంది? ఈ సంగతి మొత్తంమీద గ్రామస్థులకి చాలా వింతగావుంది. ఆ సాయంకాలమే బెరార్డో వూరికి తిరిగిరావడంతో మా ఆశ్చర్యానికి అంతమే లేదు.

మేరియట్టా, బాల్డిస్సేరాసేనాని, మరి కొందరు మొత్తం నలుగురైదుగురిదాకా, వీధిలో నిలబడి, బెరార్డో హటాత్తుగా వూరి విడచి వెళ్ళిపోవడాన్నిగూర్చి మాట్లాడుకుతున్నాము. అకస్మాత్తుగా మెల్లిమెల్లిగా వస్తోన్న బెరార్డో మా కంట బడ్డాడు. బెరార్డో యింకొకచోటికి వెళ్ళాడన్న వార్తే కల్పితమేమో అని అనుకున్నాం. కాని బెరార్డో వున్నవాట్లో మంచి చొక్కా, టోపీ ధరించాడు. చంకలో మూటకూడా వుంది. అయితే యెందుకు తిరిగి వచ్చేస్తున్నాడు. బెరార్డో యేదో అసందర్భపు కథను చెప్పాడు.

''నేను స్టేషనుకి వెళ్లాను. టిక్కెట్టు కొన్నాను. ఇంతట్లోనే పోలీసువటాలం వచ్చి ఆ స్టేషనులోవున్న ప్రయాణీకు లందరి

సామాన్లు వెతికి యెక్కడికి వెడుతున్నారో కనుక్కోడం మొదలెట్టారు. నేను యెందుకు వెడుతున్నదీ స్పష్టంగా దాపరికం లేకుండా చెప్పాను. "నీ కాగితాలు యెక్కడఉన్నాయి" అని అడిగారు. "ఏ కాగితాలు? అన్నాను నేను. కాగితాలు లేకుండా నువ్వు పనిచెయ్యకూడదు' అన్నారు వాళ్ళు. కాని యే కాగితాలు అవ్వి? కాగితాలు యేమిటో, నాకు బోధపడలేదు. టిక్కెట్టు మార్పించి, నా డబ్బు నాకిచ్చి వెనక్కి వెళ్ళిపొమ్మన్నారు. అందుచేత తరవాత స్టేషనువరకు నడిచి వెళ్ళి అక్కడ టిక్కెట్టుకొనుక్కుని రైలు యెక్కుదామనుకున్నాను. ఆ స్టేషనులో నేను టిక్కెట్టు కొనుక్కోగానే, యిద్దరు పోలీసులువచ్చి 'ఎక్కడికి వెడుతున్నావు? ఎందుకు వెడుతున్నావ్'? అని అడిగారు. 'కమ్మరీస్ కి పనిపాటలు చేసుకునేందుకు వెడుతున్నాను' అని సమాధానం చెప్పాను. 'నీ కాగితా లెవ్వి? చూపించు' అని అడిగారు. 'ఏ కాగితాలు? కాగితాలకీ, నా పనిపాటలకీ సంబంధం యేమిటి?' అని అడిగాను. 'కాగితాలు లేకుండా నువ్వొంకోకచోట పనిచెయ్యకూడదు. ఇప్పుడు, కొత్తగా గ్రామాంతరం పోయే కూలీల మీద కొత్త శాసనం వచ్చింది' అని చెప్పారు. కమ్మరీసుకి నేను వెళ్లడం, కేవలం పనిపాటలకొరకే గాని, దేశంలో ఒక చోటనుంచి, యింకొక చోటికి వలసపోవడం కాదు. అని వాళ్లకి నచ్చచెప్పేందుకు అనేకవిధాల ప్రయత్నించాను. ఐతేం, వట్టి కంఠశోషే కాని, దానివల్ల యేమీ ప్రయోజనం కలగలేదు. 'మా ఆజ్ఞలవ్వి. వాటిని మేము అతిక్రమించలేం. కాగితాలు లేకుండా, యే కూలీని ఒకచోటనుంచి, మరో

చోటికి పనికివెళ్లేందుకు రైలు యెక్కనియ్యం'అన్నారువాళ్లు. ఆ రెండవ స్టేషన్లోకూడా, నా టిక్కెట్టు మార్పించి, డబ్బు యిచ్చి స్టేషనుసించి బయటికి కొట్టేశారు. ఆ కాగితాల కథ యేమిటో, నాకు బోధపడలేదు. ఒక కాఫీహోటలుకు వెళ్లి, అక్కడ వున్నవాళ్ళతో కొందరితో బాతాఖానీ వేశాను. 'ఏమిటీ? కాగితాలా? వాట్లనిగూర్చే నువ్వు వినలేదా, యింతివరకూ? యుద్ధసమయంలో, మేము అస్తమానమూ యీ విషయాన్నిగూర్చే మాట్లాడుకునేవాళ్ళం' అన్నాడు ఒక జట్కాబండివాడు. ఒకరోజు రోజంతా యీ విధంగా తిరిగి తిరిగి మళ్లీ యిక్కడికి చేరుకున్నాను.'' అని బెరార్డో ఆరోజు కథని పూర్తిచేశాడు.

బెరార్డో కథ మా అందరికంటె బాల్డిస్సేరాసేనానిని యెక్కువగా ఆకర్షించింది. చొక్కా జేబులోంచి, ఆ రోజునే టపాలో వచ్చిన ఒక అచ్చు ప్రకటనకాగితాన్ని పైకితీసి ''ఇందులోకూడా కాగితాలని గూర్చేరాశారు!''అన్నాడు.

ఆ కాగితాల విషయం వట్టి కల్లబొల్లికబురుకాదు. రాష్ట్రకార్మిక సంఘశాఖ అయిన తోళ్ళపనివారలసంఘం, బాల్డిస్సేరాని తోళ్ళపనివారల కాగితాన్ని తక్షణం పుచ్చుకోవల్సిందని కోరింది.

'' ఎల్వీరాకికూడా యిల్లాంటి ప్రకటన కాగితమే వచ్చింది. ఖంగారుపడుతో ఆ ప్రకటనలో యేముందో చెప్పమంటో నా దగ్గిరకి వచ్చింది, అదేమిటో తలాతోకకూడా నా కర్థమవలేదు. కూలివాళ్ళు స్వేచ్ఛగా పనిచేసుకునే స్వాతం

త్ర్యాన్ని మాత్రం వాళ్ళు అరికట్టేశారని నాకు పూర్తిగా బోధపడింది. ఎల్వీరా తండ్రితాతలు నేత బట్టలు అద్దకాల మీద బ్రతికేవారు. కాని, యిప్పుడు ఎల్వీరా యేడాదికి కొంత పన్నుకట్టి ఆ కాగితం తెచ్చుకోకపోతే పనిచేసుకునేందుకు వీలు లేదుట!"

బెరార్డోకథ, యీ ప్రకటనలు రెండూ ఒకేసారి జరగడం మూలాన్ని మళ్లీ పట్టణంవాళ్ళు కొందరు కలిసి యీతమాషా చేశారేమో ననే అనుమానం నాకు కలిగింది.

"మన బట్టలనేతకీ రంగుల అద్దకానికీ, గవర్నమెంటుకీ సంబంధం యేమిటి? పని పాటలు చేసుకునేందుకు రైతులూ, బీదవాళ్లూ ఒకప్రాంతంనుంచి మరొకప్రాంతానికి పోతోంటే, గవర్నమెంటు యెందుకు జోక్యం కలుగజేసుకోవాలి? గవర్నమెంటు పరిష్కరించవలసిన సమస్యలింకా లక్షవున్నాయి. ఈవిషయాలన్నీ పూర్తిగా వ్యక్తులకు సంబంధించినవి. ఒక్క యుద్ధసమయాల్లోతప్ప గవర్నమెంట్లు యీ విధంగా వ్యక్తుల స్వాతంత్ర్యాన్ని అరికట్టరు" అని నా యభిప్రాయాన్ని నేను పైకి చెప్పాను.

"ఐనా, ఆ విషయాలన్నీ నీకేం తెలుసును?" అంటూ బాల్డిస్సేరా అడ్డువచ్చాడు. "మనదేశం యుద్ధంలో చిక్కుకుందో, శాంతిసమయంలోవుందో మహా నీకు తెలిసివున్నట్లే మాట్లాడుతున్నావు."

ఈ ప్రశ్న నిజమే అని మా అందరికి తోచింది.

"గవర్నమెంటు మన అందరి దగ్గర కాగితాలు వుండాలని

యీ రోజున ఆజ్ఞాపించిందంటే, మన దేశం యుద్ధంలో చిక్కుకుందన్నమాటే'' అంటూ గద్గదిక స్వరంతో అన్నాడు.

“ ఎవరితోటీ యుద్ధం? మన యెవ్వరికీ తెలియకుండానే, మనం యెవ్వరితో యుద్ధం చేస్తున్నాం?'' అని బెరార్డో సాగదీసి అడిగాడు.

“ ఆ విషయాన్ని గురించి నీకేం తెలుసును? పొట్టకోసి కంచు కాగడా పెట్టి వెతికినా అక్షరం ముక్క కనబడని, నీ బోటి నిరక్షర కుక్షికి ప్రభుత్వ విషయాలు తెలుస్తాయి కాబోలు. ఒక సెంటు భూమికూడా లేదు. ఎప్పుడూ యుద్ధాలు ప్రకటించడం పట్టణంవాళ్ళ వంతు, యుద్ధం చెయ్యడం పల్లెటూరివాళ్ళ వంతు. వెనకటి యుద్ధం ఆరంభమైనప్పుడు ఫాంటమారాలోని ఒక పిట్టకైనా తెలియదు. కొందరు మెనెలిక్‌తో దెబ్బలాడుతున్నారు అన్నారు. పిలాటో తుర్కీ దేశస్థులతో మనవాళ్ళు పోరాడుతున్నారు అన్నాడు. కొన్ని యేళ్ళుపోయిన తర్వాతగాని, ఆ యుద్ధం ట్రెస్టి, ట్రెంటినోలకి వ్యతిరేకంగా జరిగిందని తెలిసిందికాదు. చరిత్రలో జరిగే అనేక యుద్ధాలు యెవరికి వ్యతిరేకంగా జరుగుతున్నాయో, అనేకమందికి తెలియదు. ఒక యుద్ధాన్ని అర్థంచేసుకోవడం అంటే మాటలా? అందులో అనేక చిక్కు సమస్యలు యిమిడి వుంటాయి. ఈ పల్లెటూరి రైతులు, గబ్బిలాయి రైతులు వాళ్ళ జీవితంలో యెన్నడూకూడా అర్థంచేసుకోలేరు. రైతుకి మహాయుద్ధంలో ఒక చిన్నభాగం మాత్రమే కనపడుతుంది. అదే యెంతో బ్రహ్మాండమైన ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. పట్టణంవాళ్ళకి యుద్ధంలో చాలా భాగం తెలుస్తుంది. కోట

గోడలు, తుపాకీ మందు ఫ్యాక్టరీలు, బాంబుల ఫేక్టరీలు, ఒక శ్మశానంవాటికా, అన్నీ కనబడతాయి. రాజుగారు దేశాన్ని అంతా చూస్తారు. ఒక్క భగవంతుడే, సర్వవ్యాపి కాబట్టి సర్వమూ చూడగలుగుతాడు."

"సరే, బాగుంది. ఐతే నువ్వు ఆ కాగితాలు తెప్పించుకుంటావా? లేదా?" అని బాల్డిస్సేరాని, నేను అడిగాను.

"ఓ, తప్పకుండా తెప్పించుకు తీరాలి. కాని డబ్బుమాత్రం చెల్లించని పద్ధతి చూడాలి" అన్నాడు.

మే మందరమూ కాగితాల విషయంలో ఒక నిర్ణయానికి వచ్చాం. కాగితాలు యిస్తే కావాలి. డబ్బుమాత్రం చెల్లించడం.

ఆ రాత్రి యుద్ధాన్నిగూర్చి బ్రహ్మాండమైన చర్చ జరిగింది. ఆ విషయాలు చర్చించబడని యిల్లు ఒకటికూడా వుండదు. ప్రతివాడు యింకొకణ్ణి యీ ప్రశ్నే అడుగుతున్నాడు. "ఎవరితోటి యుద్ధం?" కాని సమాధానం ఒక్కడూ యివ్వగలిగినవాడు కనిపించలేదు. బాల్డిస్సేరా సేనాని మాత్రం, పోర్సనారా యింటిముందు వాకిట్లో కూర్చుని అడిగిన ప్రతి వారికీ అతి ఓపిగ్గా సమాధానం చెబుతున్నాడు.

"యుద్ధం మెవరితోటి చేస్తున్నామో? ఆ విషయం నాకేమీ తెలియదు, నాకు వచ్చిన ప్రకటనలో ఆ విషయమే లేదు. మనం అందరమూ డబ్బు చెల్లించి కాగితాలు పుచ్చుకోవాలని మాత్రమే దాంట్లో వుంది."

రైతుల్లో యెక్కువమంది "పన్ను చెల్లించు: పన్ను చెల్లించు: పన్ను చెల్లించు : అస్తమానమూ పన్ను, పన్ను, చెల్లించు, చెల్లించు అన్నమాటే! అని అన్నారు.

ఊళ్ళోవున్న' యీ గందరగోళాన్ని ఇనోష్సెంజా రాక మరికాస్త యెక్కువచేసింది.

ఫాంటమారాకి యెంతో ముఖ్యమైన పనివుంటేనే కాని ఇనోష్సెంజా వచ్చివుండడు. దేహశుద్ధి ఔతుంది అనే భయం మూలాన్నే యీ మధ్యకాలంలో అతను మా వూళ్లో సాహసించి పాదం పెట్టలేదు. ఇప్పుడైనా స్వయంగా వచ్చివుండడు. సోర్సనారా యింటిముందు ఇనోష్సెంజా కనపడగానే, ఒక్కక్షణంలో రైతులందరూ చుట్టుముట్టివేశారు. తెల్లపోయిన అతనిముఖం అతడెంత భయపడ్డాడో తెలుపుతోంది. భయంతో నిశ్చేతను డయ్యేముందే, సోర్సనారా వచ్చి ఒక ముక్కాలిపీటవేసి కూర్చోమంది.

"క్షమించండి, క్షమించండి" అంటూ పీలగొంతుకతో తొట్రుపాటు పడుతో ఆరంభించాడు. "అబ్బే, యేమీ భయపడకండి. ఎందుకూ భయపడటం, కారణం యేమీ లేదు. నన్ను చూస్తే, మీకు భయమా? ఎందుకు?"

"చెప్పవయ్యా, చెప్పు. యెందుకు వచ్చావ్?" అంటూ బెరార్డొ అడిగాడు.

"సరే అసలు విషయంలోకి వెంటనే వచ్చేద్దాం. నేను వచ్చిన పనికీ, పన్నులకీ యేమీ సంబంధంలేదు. భగవంతుడిమీద ప్రమాణంచేసి చెబుతున్నాను. నేను పన్నుల నిమిత్తం

రాలేదు. పన్నులకీ, నేను వచ్చిన పనికీ యేమీ సంబంధం లేదు. పన్నులకోసం వచ్చివుంటే భగవత్సాక్షిగా నా కళ్ళు పోతాయి!''

కొన్ని క్షణాలు ఆగాడు. ఇన్నాళ్ళైనా కళ్ళు పోలేదు.

"చెప్పవయ్యా, అసలు కథేమిటో, చెప్పు" అని బెరార్డో అడిగాడు.

"సరే, ఒకరాత్రి ఒక సైన్యాధికారి యిక్కడికి వచ్చినసంగతి మీకు జ్ఞాపకంవుందా? ఆయనపేరు గౌరవనీయులైన పెలినో. ఔనుకదూ? జ్ఞాపకంవుందా, మీకు? సరే బాగుంది, సంతోషం. సరే, గౌరవనీయులైన పెలినోగారు, ప్రభుత్వంతో యీ ఫాంటమారా గ్రామం ప్రస్తుత ప్రభుత్వానికి, ప్రబల విరోధులకి నివాసమైన అగ్నిగుండం అని ఒక నివేదిక పంపించారు... అబ్బే, భయపడకండి. అందువల్ల యేమీ అపాయం కలగదు. భయపడవలసిన అవసరం యేమీ లేదు లెండి. ప్రస్తుత ప్రభుత్వానికీ, మతాధిపత్యానికీ విరుద్ధంగా కొందరు యీ గ్రామంలో మాట్లాడిన విషయాలని, తూచ తప్పకుండా గౌరవనీయులైన పెలినోగారు ప్రభుత్వానికి విన్నవించారు. మీరేమి చెప్పారో ఆయన అర్థం చేసుకోలేదన్న మాటలో యేమీ సందేహం లేదు. అధికారులు యీ సందర్భంలో యిక్కడ కొంత కట్టుదిట్టం చెయ్యాలని అనుకున్నారు. పెద్ద కష్టమైన దేమీకాదు. నా మాట నమ్మండి. మీరు ఒక్క పైసాకూడ ఖర్చు లేదు. అబ్బే, అవన్నీ అర్థంలేని పిచ్చిపనులు. పట్టణాల్లో అల్లాంటి

పనులకి యెంతో విలువయిస్తారు. కాని, మీ బోటి తెలిసైన రైతులు వాటిని లెఖ్ఖచెయ్యరు......

అధికార్లు ఫాంటమారా గ్రామస్థులమీద యేమి చర్యతీసు కుంటారో, ఇనోస్సెంజాకి పూర్తిగా తెలియదు. ప్రాంతీయ సంఘం యేమిచేయ నిర్ణయించిందో మాత్రమే తెలుసును.

అతనికి అంతకంటె అధికంగా తెలియదు. తెలుసుకోవాలని కూడ అతెడు కోరడంలేదు. చీకటిపడిన తరవాత ఫాంట మారా గ్రామస్థులు ఇళ్ళువదలి యువతలికి ఉదయంవరకూ రాకూడదు. ఆ గ్రామంలో కర్ఫ్యూఆజ్ఞ ప్రవేశపెట్టబడింది.

"ఐతే మాకు యిదివరకునుంచీ యిచ్చేకూలి యిస్తారా?" అని బెరార్డొ అడిగాడు.

"నీ కూలికి, దీనికీ యేం సంబంధంవుంది? అని ఇనోస్సెంజా అన్నాడు.

"నా కూలికి, దీనికి యేం సంబంధం ఉందా? తెల్లవారే వరకూ ఇల్లు వదిలిపెట్టి వెళ్ళకుండావుంటే ఫ్యూసినోకి ఉదయం పదిగంటలు దాటితేగాని, చేరుకోలేము. ఒక్క రెండుగంటలు పనిచేస్తేనే, మాకిదివరకు వచ్చే కూలివస్తే, కర్ఫ్యూ పది కాలాల పాటు ఉండాలని కోరుకుంటాము" అని బెరార్డొ తెలియబరిచాడు.

"మా వ్యవసాయం మాట ఏమిటి? రాత్రిళ్ళు ఇళ్ళు కదిలేం దుకు వీలులేకపోతే, మా పొలాలు ఎల్లా దున్నుకోవడం?

మేము పొలాలు బీడుపెట్టుకొని, కడుపుల్లో కాళ్ళు పెట్టుకుని పడుకోవాలా ?''

ఇనోస్కి సెంజాకి దిక్కూ తెన్నూ తోచలేదు.

''అబ్బే ! మీరు సరిగ్గా అర్థంచేసుకోలేదు. లేకపోతే, నేను ఇల్లా అన్నానని మీరు యింకోవిధంగా భావించలేకపోతే, మీకు అర్థం అవనట్టు నటిస్తో నన్ను తిప్పలు పెట్టాలని చూస్తోన్నట్టుగా నేను యెంచవలసి వస్తోంది. మీ మామూలు జీవితపద్ధతినే మార్చుకొమ్మని యెవ్వరు చెప్పారు? కంట్రాక్టరుగారు యిప్పుడు పొడెస్టా. ఆయన ఆజ్ఞలను నెరవేర్చాలి. ఆయన పనిని ఆయన చెయ్యకుండా చెయ్యలేంకదా. నే నీ జిల్లా తపాలామనిషిని, నా పనిని నేను నిర్వర్తించకతప్పదు. పై అధికారు లండరూ చేసే పితూరీల మూలాన్ని పొడెస్టాగారు యీ పని చెయ్యకతప్పలేదు. మీరు రాత్రిళ్ళు మీ గృహాలని వదలిపెట్టకూడదన్న ఆయన ఆజ్ఞలని మీకు తెలియపర్చడమే నా ధర్మం. మీకు యేది మంచిదని తోస్తుందో ఆ విధంగానే చెయ్యండి,'' అన్నాడు ఇనోస్కి సెంజా.

''ఐతే చట్టం విషయం యేమిటి? ఎవ్వరి కేదితోస్తే వాళ్లా విధంగా చెయ్యడం ఆరంభిస్తే శాంతి, భద్రతల విషయం యేమాతుంది? శాసనం, శాసనం ఔనాకాదా? ముందు ఆ విషయం చెప్పండి''అంటూ బాల్డిస్సేరా సేనాని ఉద్వేగంతో అన్నాడు.

''క్షమించండి. మీ రెన్ని గంటలకి లేస్తారు?''అని ఇనోస్కి సెంజా అడిగాడు.

"పదిగంటలవేళకి లేస్తానండి. ఈ రోజుల్లో పనులెక్కడ యేడి శాయి" అంటూ రేచీకటి చెప్పుల పనివాడు సమాధానం ఇచ్చాడు.

"చాలా బాగుంది. ఈ శాసనం అమలు జరుగుతోందో లేదో చూసేందుకు మిమ్మల్ని నేను నియమిస్తున్నాను." అన్నాడు ఇనోన్సెంజా.

మే మందరమూ కడుపు ఉబ్బేట్లా నవ్వుతున్నాం. బాల్డిస్సేరా సేనానికి మాత్రం .. లా కోపం వచ్చింది. అప్పుడే బాగా చీకటి పడిందిగనుక, బాల్డిస్సేరా పడుకుంటానని వెళ్లి పోయాడు. తలవని తలంపుగా అందరినీ నవ్వించ గలిగాను కదా అనే సంతోషం గలిగి, ఇనోన్సెంజా మనస్సు కుదుట బరుచుకొని, సిగరెట్టు వెలిగించి, దర్జాగా పొగ విడవటం ఆరంభించాడు. మే మెప్పుడూ అల్లా విడనము. మాలో కలిగిన ఆశ్చర్యసంభ్రమాలని పురస్కరించుకొని పొడెస్టాగారి రెండవ నిర్ణయాన్ని తెలియబరచ నారంభించాడు. ప్రజలు గుమిగూడే బహిరంగ స్థలాలలో, అందరికీ కనబడే ప్రదేశాల్లో,

ఇచ్చట రాజకీయ చర్చలు

నిషేధింపబడ్డాయి.

అనే ప్రకటన పత్రాన్ని అంటించాలి.

ఫాంటమారాలో మేరియట్లా యింటివద్దనే అందరూ తీరు బాటు సమయాల్లో చేరుతూవుంటారు. అందుచేత పొడెస్టా

గారి ఆజ్ఞాపత్రాన్ని ఆమె చేతికిచ్చాడు. ఆ ప్రదేశంలో, ఇకముందు రాజకీయవిషయాలమీద చర్చలు జరిగేట్లయితే ఆమెనే బాధ్యస్థురాలుగా యెంచి, తగుచర్య తీసుకుంటా మంటూ పొడెస్టాగారు వ్రాసిన పత్రాన్నికూడా సోర్సనా రాకి యిచ్చాడు.

"కాని యీ ఊళ్ళో యెవ్వరికీ రాజకీయ విషయాలంటే ఏమిటో తెలియదే? మా సావిడిలో ఎవ్వరూ రాజకీయాలని గూర్చి మాట్లాడరే!"అంటూ సోర్సనారా విడ్డూరపడింది.

"ఐతే, గౌరవనీయులైన పెలినోగారు యీ గ్రామంనుంచి త్రాచుపాములాగు బుసలుకొడుతూ పోచ్చారు ఎందుకు? మీరు యే విషయాన్నిగూర్చి మాట్లాడారు?"

"ఓ, అన్నివిషయాలనిగూర్చి మాట్లాడాము. ధరలనిగూర్చి, కూలి, పన్నులు, చట్టాలనిగూర్చి మాట్లాడుకున్నాము. ఈ రోజున కాగితాలు, యుద్ధం, వలసపోవడాలనుగూర్చి చాలా సేపు మాట్లాడుకున్నాం... ..."

"ఇకముందు యెప్పుడూ, యీ విషయాలని గురించి, పొడెస్టా గారి ఆజ్ఞప్రకారం చర్చించకూడదు. ఈ ఆజ్ఞలు మీ ఒక్క ఫొంటమారాకే కాకుండా ఇటలీకి అంతకీ వర్తిస్తాయి. బహిరంగ ప్రదేశాల్లో ధరలు, వేతనాలు, పన్నులు, చట్టాలను గూర్చిన చర్చలు నిషేధింపబడ్డాయి."

"ఐతే, మేము యేమీ మాట్లాడుకో కూడదనేకదూ మీ ఉద్దేశ్యం?"అని బెరార్డో అడిగాడు.

"ఔను, బెరార్డో! ఈ విషయం నీకు సరిగ్గా అర్థం ఐంది. ఏ విషయాల్నీ చర్చించకూడదనే నిషేధం వచ్చింది. పొడెస్టా గారి నిర్ణయంలో ముఖ్యోద్దేశం అంతే. ఏ రకమైన చర్చలూ యికముందు జరుగకూడదు."

బెరార్డో తనలో యేకీభవించినందుకు ఇనోస్సెంజాకు గలిగిన ఆనందానికి పరిమితి లేకుండా వుంది. ఆ ప్రకటనను యింకా స్పష్టంగా చెయ్యాలని బెరార్డో సూచించిన వెంటనే అతడు అంగీకరించాడు. ఒక పెద్ద అట్టమీద అతడే ఆ ప్రకటనని వ్రాశాడు.

చర్చలన్నీ పూర్తిగా

నిషేధింపబడ్డాయి

—పొడెస్టాగారి ఆజ్ఞ

సోర్సనారా సావిడిగోడమీద ఎత్తుగా ఆ ప్రకటనని బెరార్డో స్వయంగా అంటించాడు. అతడే యీ పనులన్నీ చెయ్యడం మాకు ఆశ్చర్యాన్ని కలిగించింది. అతని అభిప్రాయం మాకు యింతకుముందే బోధపడనట్టు, "ఆ ప్రకటనని యెవ్వరైనా ముట్టుకుంటేనా?" అంటూ గట్టిగా అన్నాడు.

ఇనోస్సెంజా చేతులు ముందుకు జాచి, బెరార్డోని ముద్దు పెట్టుకుందామని యత్నించాడు. కాని బెరార్డో నివారిస్తో, తన అభిప్రాయాలని వెల్లడించ ప్రారంభించగానే, అతని ఉత్సాహంమీద చన్నీళ్లు జల్లిన ట్టయింది.

"మీతోటి నేను యెప్పుడూ ఇల్లాగే చెప్పడంలేదూ?

పొడెస్టా దీనిని శాసనంగా చేసేవరకూ వేచివుంటారు. ఈ ఉన్నవాళ్ళతో ఎప్పుడూ తర్కించకూడదని నా ప్రధాన సూత్రం. తర్కించడం, చర్చించడం, రైతుల దురదృష్టానికి మూలకారణాలు. గాడిదకంటెకూడా మన జీవితాలు అధమంగావున్నాయి. చూడండి, ఏభయ్యో, వందో పౌనుల బరువుకంటె, అధికంగా గాడిదలు మొయ్యవు. కాని అవెప్పుడూ శుష్కవాదన చెయ్యవు. ఏదో తోచినంత వేగంగానే నడుస్తాయి. అంతేగాని తర్కిస్తూ పరిగెత్తవు. మేయడంలో ఒక్క పరకకూడా లోటురానియ్యవు. ఏ తర్కమూ వానిని ఒప్పించలేదు. ఏ ఉపన్యాసమూ వానిని కదిలించదు. వాటికి అర్థం అవకనైనా పోవాలి, లేకపోతే అర్థం అవనట్టు నటించనైనా నటిస్తాయి. కాని, రైతుసంగతి చూడండి. రైతు తర్కిస్తాడు. ఆతనిని ప్రోత్సహించి, అతని బలానికి మించిన పనికూడా అతనిచేత చేయించవచ్చును. కడుపులో తేళ్ళూ, జెర్రెలూ పాకుతోన్నా, యితరుల ప్రోత్సాహం మీద రైతు పని చేస్తోనే వుంటాడు. ఆ రైతుని ప్రోత్సహించి యుద్ధానికి పంపించగలుగుతావు. నరకం లాంటి స్థలంకూడా ఉందని ఆతణ్ణి నమ్మించ గలుగుతావు. కళ్లువిప్పి మీ చుట్టుప్రక్కల చూడండి. దాని ఫలితాలు కనపడతాయి.''

బెరార్డో చెప్పే మాటలన్నీ, అతడు అస్తమానమూ పాడుతోన్నపాటే. కాని ఆ మాటలు ఇన్నోసెంజాకి భయం గలిగించాయి.

బెరార్డో మళ్ళీ సాగించాడు.

"మా గాడిద ఆహారం దొరక్కపోతే ఒక క్షణం ఊరుకోదు. నాకు ఆహారం దొరికిందా, నేను పనిచేస్తాను. దొరకదూ, నేను పనిచెయ్యను, అని అది అంటుంది. అది తర్కించదు కనుక, అల్లా పైకి చెప్పదనుకోండి, ఆ విధంగా మాకు కళ్ళకు కట్టినట్లు కనపడేట్లా ప్రవర్తిస్తుంది. ఒక్క క్షణం వూహించండి, ఈ ఫ్యూసినో భూముల్ని దున్నే యీ ఆరువేలమంది రైతులూ, తర్కించే గాడిదలు కాకుండా, తీయని కబుర్లు చెప్పి యెవ్వరైనా నీతులు చెబితే తర్కిస్తూ లోబడే గాడిదలు కాకుండా, పోలీసులు బెదిరిస్తే తర్కిస్తో డొక్కాడక పోయినా, కాళ్ళూచేతులూ విరగ్గొట్టుకునే తర్కించే గాడిదలు కాకుండా, తర్కించకుండా వుండే నిజమైన గాడిదలే అయితే, యేం జరుగుతుంతో తెలుసునా? టార్లోనియా రాజకుమారుడు అఘ్కుతింటో వుండవలసి వచ్చును. వీళ్ళే నిజమైన గాడిదలై తేనా, ఇన్నోసెంజా ను వ్వీపాటికి తోక ఝూడించి వచ్చిన దారినే వెనక్కి వెళ్ళి వుందువు. నిన్ను చంపకుండా మమ్మల్ని యేది అడ్డుతోంది? సమాధానం చెప్పు."

ఇన్నోసెంజా యేదో సమాధానం చెప్పబోయాడు కాని, నోటినుండి మాట వూడిపడలేదు. ముఖంలో కళాకాంతులు లేవు. వెలవెల పోయాడు.

"నిజమైన గాడిదల్లాగు కాకుండా తర్కించే యీశక్తి, కూలీ చేసిన తరువాత వచ్చే ఆపదని తెలుపుతోంది. అజ్ఞానమే మమ్మల్ని యీపని చెయ్యకుండా ఆపుతోంది. కాని, ఇన్నోసెంజా నీ చేతుల్తో స్వయంగా ఆ ప్రకటన మీద యీ

రోజునుంచి చర్చలన్నీ నిషేధించబడ్డాయని రాశావు. మీ పీకలు మీరే కత్తిరించుకున్నారు...''

"ఇదుగో, యిల్లా చూడు" అంటూ, ఇన్నో సెంజా తెగించి సమాధానం చెప్పాడు. "తర్కించకూడదని చెబుతూనే, అందరికంటె నువ్వే అధికంగా తర్కిస్తున్నావు. నేను యిల్లా అన్నందుకు కోపం వుంచుకోకు. కాని నీ వుపన్యాసం అంతా తర్కమే. నే నింతవరకు యే రకమైన గాడిద యీ విధంగా తర్కించడం వినలేదు."

"అన్ని రకాలైన తర్కాలూ అధికారులకీ, పెట్టుబడిదార్లకీ అనుకూలంగానే వుండేటట్లయితే, వాళ్లు అన్ని చర్చలనీ యెందుకు నిషేధించాలి?''అని బెరార్డోని అడిగాను.

ఒక క్షణం బెరార్డో నిశ్శబ్దంగా వూరుకుని యీ విధంగా అన్నాడు.

"ఓ, చాలా ప్రొద్దుపోయింది. ఫ్యూసినోకి వెళ్ళేందుకు తెల్లవారు ఝామున మూడు గంటలకి వెళ్ళాలి. శెలవు''అంటూ వెళ్ళిపోయాడు.

బెరార్డో వాదాలన్నీ యీ విధంగానే అకస్మాత్తుగా ముగుస్తూ వుంటాయి. గంటల తరబడి మాట్లాడుతూనే వుంటాడు. చాలా దార్ఢ్యయుతమైన మాటలు, అర్థంలేని మాటలు యెంతోసేపు వేదాంతిలాగు చెబుతాడు. అతడు మాట్లాడే టప్పుడు, యితరులు అడ్డువచ్చేందుకు వీలులేదు. అతడు పూర్తిచేశాక, యెవరైనా యేదైనా ప్రశ్నవేస్తే, సమాధానం తోచక హఠాత్తుగా వెళ్ళిపోతాడు.

ఆ రాత్రి ఇన్నోసెంజా పట్టణానికి వెళ్ళలేదు. బెరార్డో మాటలికి భయపడేనా వుండాలి, లేకపోతే వంట్లో బాగా లేకనా వుండకపోవాలి. ఏ కారణమువల్లనైతేనేమి ఆ రాత్రి పోర్సనార్హా యింట్లో గడిపాడు.

౪

జూన్ నెల సగం గడిచిపోయాక ఫ్యూసినో విషయాన్ని గూర్చి రోమ్ నగరంలో వున్న క్రొత్త ప్రభుత్వం చేసిన నిర్ణయాన్ని తెలియపరిచేందుకు మార్సికా రైతుల ప్రతినిధులని అవెజ్జానో పట్టణానికి హాజరవమంటారనే పుకారు పుట్టింది. ఈ వార్త ప్రజలలో చాలా కలవరాన్ని పుట్టించింది. ఇంతవరకూ వెనుకటి ప్రభుత్వాలేవీ, ఫ్యూసినో ప్రశ్న ఒకటి వుంది, అనే విషయాన్ని గుర్తించినట్లు కనపడదు. ఎన్నికల విధానం తీసివేయబడ్డాక, చివరిలో ఫ్యూసినోనిగూర్చి అత్యధికంగా మాట్లాడుతూవుండే న్యాయవాదులుకూడా ఆ విషయాన్నిగూర్చి మరచిపోయారు.

రోమ్‌లో క్రొత్త ప్రభుత్వం వచ్చిందనే మాటలో సందేహం యేమీ లేదు. అప్పుడప్పుడు ఆ ప్రభుత్వాన్నిగూర్చి ప్రజలు కూడా చెప్పుకుంటున్నారు. ఒక యుద్ధం జరిగిందన్నమాట కూడా ధృవపడింది యుద్ధం జరగకుండా పాతప్రభుత్వం పోయి, క్రొత్తప్రభుత్వం యెలా వస్తుంది? బూర్బాన్ ప్రభువులు స్పెయిన్ దేశీయులని, బూర్బానులను పైడమాంటీస్ ప్రభువులు యుద్ధంచేసే తరిమేశారు. కాని, యీ క్రొత్త ప్రభువులు యెక్కడనుంచివచ్చారో, యేజాతికి చెందినవాళ్ళో

మాత్రం యింతవరకూ ఫాంటసూరాలోనివా ళ్లెవరికీ తెలి యదు. ప్రభుత్వాలు పట్టణాల్లోనే తటస్థించే విషయాలు.

ప్రభుత్వంలో మార్పు వచ్చినప్పుడల్లా, బీదరైతు చెప్పగలి గిందల్లా "భగవంతుడు కటాక్షించి మా కొక మంచి ప్రభు వుని ప్రసాదించుగాక" అని. వేసవికాలంలో ఆకాశంమీద కనపడే మబ్బులు, నిజంగా వర్షించేవో వర్షంరాకడను సూచించేవో బీదరైతుమీద యెల్లా ఆధారపడి వుంటవో, అల్లానే ప్రభుత్వం మార్పుల్లోకూడా ఆతని యిష్టానిష్టాల లెఖ్ఖ వుండదు.

ప్రభుత్వ ప్రతినిధి ఒకడువచ్చి బీదరైతులతో వారి కష్ట నిష్టు రాలనుగూర్చి మాట్లాడతాడనే విషయం నిజంగా చాలా ఆశ్చర్యకరమైనదే.

"మళ్ళీ పూర్వపురోజులు వచ్చేస్తున్నాయి. ధర్మరాజ్యాన్ని మళ్ళీ మనం చూస్తాం. మహారాజు రాజభవనానికి, బీద వాడి పూరిగుడిసెకి మధ్యనున్న దుర్భేద్యమైన కోటగోడలు, కందకాలు, ముళ్ళకంచెలు అన్నీ పటాపంచలయ్యాయి. ప్రభువు మారువేషం వేసుకొని, రాత్రిళ్ళు గ్రామాలు తిరిగి పాలితుల కష్టసుఖాలు కనుక్కుంటూ వుంటాడు. ఈ మధ్య నంటే యెన్నికలువచ్చి, పాలకులకు, పాలితులకి మధ్యని ఈ అగాధాన్ని యేర్పరిచాయి. ఈ పుకార్లూ, యీ వార్తలే నిజమైతే మళ్ళీ మనకి బంగారుకాలం వచ్చేసింది అన్న మాటే!... ..."

అంటూ బాల్డిస్సేరా సేనాని అందరితోను విసుగూ, విరామం లేకుండా చెబుతున్నాడు.

మిచీలీజోంపాకికూడా యిట్టి ఆశే కలిగింది.

"ఎన్నికలమీద, ప్రతినిధులతోనూ, ప్రభుత్వాన్ని నడిపించడం అంటే బీద ప్రజల్ని భాగ్యవంతులచేతుల్లో వుంచడం అన్నమాట. ధనాఢ్యులు వాళ్ళ చిత్తం వచ్చిన రీతిని యెన్నికలని నడుపుతారు. ఒక్కళ్ళే ప్రభుత్వాని కంతకీ సర్వాధికారిగా వుంటే భాగ్యవంతులని భయపెట్టవచ్చును. రాజుకీ రైతుకీ మధ్య యేం వైరం వుంటుంది? ఏమి వైషమ్య ముంటుంది? అట్టి ఆలాంటి ఆలోచన పుట్టడమే అసమంజసంగావుంటుంది. కాని టార్లోనియో రాజకుమారుడికి, రాజుకి మధ్య చాలా సులభంగా వైషమ్యం ఉండేందుకు వీలుంది." అని అతని అభిప్రాయాన్ని వెల్లడిచేశాడు.

ప్యూసినో భూముల్ని మళ్ళీ పంచి పెట్టేటప్పుడు తనకికూడా ఒక భాగం దొరుకుతుందనే ఆశతో తక్కిన అందరి అభిప్రాయాల్నీ తన మామూలు దురల్వాటు ప్రకారం ఖండించలేదు.

"ప్రభుత్వాలన్నీ దొంగలతో కూడుకొని వుంటాయి. అయిదు వందలమంది కంటె ఒక్క దొంగే వుండేటట్లయితే రైతులకి మంచిది. ఎంత ఆకలిగొన్న దొంగయినా, అయిదువందల మంది చిన్న దొంగలు, ఆకలి తీరని దొంగలతో సమానంగా దిగమింగ లేదు. ఆ ఫ్యూసినో జమీని వాళ్లు మళ్లీ పంచే

టట్లయితే ఫాంటమారా, తన హక్కుల్ని పూర్తిగా వినియోగించాలి." అంటూండేవాడు బెరార్డో.

ఒక ఆదివారం వుదయాన్ని, ఫాంటమారాకి ఒక మోటారు లారీ వచ్చింది. అవెజ్జానో వచ్చేరైతులందర్నీ లారీయెక్కమని లారీ డ్రైవరు ఆహ్వానించాడు. లారీకి డబ్బులేమీ యివ్వనవసరములేదు. ఆ లారీ పూర్తిగా త్రివర్ణ పతాకాలతో అలంకరింపబడి వుంది. ఆ లారీని అధికార్లు పంపించడం, మేమేమీ డబ్బు చెల్లించనక్కర్లేకపోవడం, మాకు ఆశ్చర్యాన్ని కలిగించాయి.

ఫాంటమారాలో, అదృష్టవశాత్తూ పది పన్నెండుమంది దిగబడి వున్నాము. తక్కినవాళ్ళంతా పనులకి వెళ్ళారు. పొలం పను లధికంగా వుండే వేసవి కాలంలో ఆదివారం నాడు కూడా మమ్మల్ని పని చెయ్యనిచ్చేవారు, చర్చి మతాధికారులు. జూన్ నెలాఖరులోగా కోతలు ప్రారంభమౌతాయన్న విషయం అధికారులకి తెలియనందుకు మేమెవళ్ళమూ ప్రభుత్వాన్ని నిందించలేదు. ఫ్యూసినో తగాదా పరిష్కరింపబడబోయే రోజున జరుపబడే సభకు హాజరయ్యేందుకు, ఒక రోజు పని పోగొట్టుకునేందుకు కూడా మేము సిద్ధంగా వున్నాము.

ఫాంటమారా రైతులందరమూ, ఫ్యూసినో భూముల్ని సాగుతాలకిచ్చుకునేందుకు మేమెంతో కాలంగా ఆశిస్తుండే వాళ్లం. కాని టర్లోనియో ప్రభుత్వం ఆ భూమిని, లాయర్లకీ, డాక్టర్లకీ, ప్రొఫెసర్లకీ, పెద్ద భూస్వాములకీ పెద్ద పెద్ద

భూప్రతుల్ని మగతాకి యిచ్చేవారు. వాళ్ళు మా బీదరైతుల్ని, మా కూలీలని దోచుకునేవారు. ఫ్యూసినో భూముల్ని మేము మగతాకి తీసుకోవాలని మేము ఎప్పుడూ ఆశిస్తూవుండే వాళ్లం. ఎన్నికలరోజుల్లో డాన్ సర్కో స్ట్రాంజా ఉపన్యాసంలో చెప్పిన "భూములన్నీ, దున్నుకునే రైతులపరం అయ్యే రోజులు వస్తాయి" అన్న, ఆ రాబోయే రోజుల కోసం యెదురు చూశేవాళ్లం.

ఫ్యూసినో భూముల్ని టార్లోనియో రాజకుమారుడి చేతినుండి ఊడలాక్కుని, లాయర్లు, డాక్టర్ల చేతిలో పడకుండా స్వంతంగా సేద్యం చేసుకొని కష్టించే రైతుకి యివ్వాలి అని సర్కో స్ట్రాంజా ఉపన్యసించాడు. అంటే మా రైతులందరికీ దాని మీాద హక్కుంది అన్నమాటే! ఫ్యూసినో భూములు రైతులకి పంచిపెడతారనీ, అందుకోసం అధికార్లు మోటారు లారీని పంపించారనీ, అనడంతోటే మాకు అమితమైన ఉద్వేగం కలిగి, బెరార్డో, అంటోనియో, సియరప్పా, లోసర్డో, యాంబ్రడియో, రాఫేల్, పిలాటో, అతని కొడుకు, నేను, నోరు మెదపకుండా లారీ యెక్కాము.

మా లారీ బయల్దేరేముందు "మీా ధ్వజం యేదీ?" అని డ్రైవరు అడిగాడు.

"ఏం ధ్వజం"

"ప్రతీ రైతుసమూహమూ ఒక్కొక్క ధ్వజం తెచ్చుకు తీరాలని, నాకు వచ్చిన ఆజ్ఞలు" అని చెప్పాడు డ్రైవరు.

"ధ్వజం అంటే యేమిటి?" అని మేము అడిగాము.

"ధ్వజంఅంటే పతాకం అంటే జండాలంటారు తెలియదూ?"

ముఖ్యంగా ఫ్యూసినో జమీని పంచిపెట్టబోయే రోజున నూత్న ప్రభుత్వానికి మా మీద యేమీ దురభిప్రాయం కలిగించుకో కూడదని మాకు చాలా ఆతురతగావుంది. క్రీస్తు దేవాలయం మీదవున్న శాన్ రాకోధ్వజాన్ని మాతో తీసుకొని వెడదామని నిశ్చయించుకున్నాం. రాఫేలు, ఆంటోని యోలు వెళ్ళి పది పేను గజాలపొడుగు కర్రకి తగిలించివున్న పెద్ద నీలము తెలుపు వర్ణాలపతాకం మీద, శాన్ రాకో భక్తుడు కూర్చొని వుండగా, కాలుమీద వున్న ఒక పెద్ద గాయాన్ని, ఒక కుక్క నాకుతూ వున్నట్టు చిత్రింపబడివున్న పెద్ద ధ్వజాన్ని మోసుకొని వచ్చారు. డ్రైవరు దానిని చూచి, తన లారీమీద తీసికొని వెళ్ళేందుకు నిరాకరించాడు. మా ఫాంటమారాలోవున్న జండా అదొక్కటే, దానిని తీసికొని రాకపోతే మేమూ రామంటూ బెరార్డో క్రిందికిదిగాడు. అందుతో డ్రైవరు లోబడక తప్పిందికాదు.

ఆ ధ్వజాన్ని లారీ పరుగెత్తుతో నన్నవ్వాడు పట్టుకోని నిలిపి వుంచడం చాలాకష్టంగావుంది. పెద్దగాలి వస్తోంటే ముందుకీ వెనక్కీ వూగే తెరచాప కొయ్యలాగుంది మా జండా. చాలా దూరంవరకూ కనబడుతూ వుండేవుండాలి. పొలాలలో పనిచేసుకునే రైతులు అనేకమంది మా జండావైపు ఆశ్చర్యపడుతూ విరగబడి చూడటం చూశాం. మోకరిల్లి స్త్రీలు నమస్కరిస్తున్నారు. మా గ్రామం వదిలిపెట్టిన తరువాత మా లారీ ఒక గ్రామాన్ని సమీపిస్తూండగా

"కీర్తన పాడండి!" అన్నాడు డ్రైవరు.

"ఏం కీర్తన" అని మే మడిగాం.

"మనం గడిచే ప్రతి గ్రామం దగ్గిరా, పాటలు పాడుతో, మనం చాలా ఉత్సాహకరంగా వున్నట్లు యితరులకి తోచేట్లు చెయ్యాలి: అని నాకు అధికారులు ఆజ్ఞలు పంపించారు."

మా కేమీ పాటలు రావు. అంతేకాకుండా, ఆ జండాని, నిలిపి వుంచడానికే మేము చాలా కష్టపడవలసి వస్తోంది.

అవెజ్జానాకి వచ్చే లారీలు, మోటార్లు, మోటారు సైకిళ్ళు, సైకిళ్ళు రోడ్డుమీద అసంఖ్యాకంగా వున్నాయి.

బ్రహ్మాండమైన నీలం, తెలుపురంగు జండా ఆ లారీలలో వున్న వారికి ముందు, ఆశ్చర్యాన్ని, తరువాత నవ్వుని పుట్టించాయి. జేబురుమాళ్ళంత నల్లజండాలను వాళ్ళు తీసికొని వస్తున్నారు. ఆ జండాలమీద పుర్రె, యెముకల చిహ్నాలు వున్నాయి.

అవెజ్జానా పట్టణం ప్రవేశించే ముందు ఆ జండాకోసం చిన్న సంఘర్షణ జరిగింది. నల్ల యూనిఫారం దుస్తులు తొడుక్కున్న యువకులు రోడ్డుమీద నిలబడి, ఆ ధ్వజాన్ని వారికి వప్పగించమన్నారు. అదొక్కటే మా దగ్గిరవుంది గనుక, దానిని యివ్వమని తిరస్కరించి చెప్పాం. ఆ యువకులు, లారీని ఆపించి బలవంతంగా లాక్కుందామని ప్రయత్నించారు. దారి పొడుగునా అందరూ మమ్మల్ని చూచి నవ్వినందుకే మాకు చాల చిన్నతనంగావుంది. ఈ అవమానానికి మాకు

చాల కోపంవచ్చి, వాటితో కలబడి చాలమంది నల్లదుస్తుల యువకుల్ని రోడ్డుమీద దొర్లించాం.

ఆ లారీచుట్టు, పెద్ద పెద్ద కేకలువేస్తో, అరుస్తూన్న పెద్దగుంపు పోగుబడింది. అందులో చాలామంది, నల్లదుస్తుల యువకులు మిగతా ఫాంటమారా చుట్టుపక్కలవున్న గ్రామాలరైతులు. వాళ్ళు మమ్మల్ని గుర్తించి యేదో గొంతుక చించుకుంటూ అరుస్తున్నారు. మేము మాట్లాడకుండా మాధ్వజంచుట్టూ నిలబడి, అవమానానికి ప్రతీకారం చేసేందుకు సిద్ధంగా వున్నారు. హటాత్తుగా, ఆకాశంమీందనుంచి వూడిపడునట్టు వగరుస్తూ కొందరు పోలీసుల్ని వెనుక పెట్టుకొని మాముందు డాన్ అబ్బేషియో నిలబడ్డాడు. మతాచార్యుడు కదా ఆ జండాని కాపాడటంలో మాకు సహాయం చేస్తాడని ఆశ పడ్డాం.

"తీర్థానికి వస్తున్నారనుకున్నా రా? మతాధిపత్యానికీ, ప్రభుత్వానికీ మధ్య స్నేహాభావం యీ విధంగానా మీరు వృద్ధి చెయ్యడం? మీ ఫాంటమారా వాళ్లందరూ యెంత కాలం నుంచి యిల్లా తిరుగుబాటు పనులుచేస్తున్నారు? అబ్బెబ్బే ! వట్టి తిరుగుబాటు !" అని గట్టిగా అరిచాడు.

మారుమాట పలకకుండా ఆ యువకులకి ధ్వజాన్ని వదిలి వేశాం. ఒక పురోహితుడే, శాన్‌రాకో జండాని వదులు కున్నప్పుడు మేము దాని కొరకు అనవసరంగా యెందుకు దెబ్బలాడాలి? ఫ్యూసినో భూముల్లో మాహక్కుల విష యంలో కూడా నష్టం కలిగించుకోవడం యెందుకు?

అవెజ్ఞానా బజారు ప్రదేశం వద్దకు మమ్మల్నందరినీ తీసుకొని వెళ్ళారు. మంచి స్థలం చూపించి అక్కడ మమ్మల్ని నుంఛోమన్నారు. తక్కిన రైతులందరూ చుట్టూరావున్న యింట్ల అరుగులమీద నుంచున్నారు. ఈ రైతు సమూహాలకు మధ్య తుపాకులను ధరించిన పోలీసులు, నిలబడ్డారు. సైకిళ్లమీద పోలీసులు ఆ బజారు స్థలంలో అన్ని దిక్కులకీ హడావుడిగా వెడుతున్నారు. క్రొత్తలారీలురాగానే, రైతుల్ని కిందికి దింపి, మిగతా రైతులకు కొంతదూరంలో నిలబెడుతున్నారు.

ఒక పోలీసు అధికారి అందమైన నల్లగుర్రంమీద, ఆ స్థలంలో తిరుగుతూ అధికారాన్ని చలాయిస్తున్నాడు.

ఇంతలోనే ఒక పోలీసు సైకిలుమీద వచ్చి, ఒక ఆజ్ఞాపత్రాన్ని కాపలా కాస్తోన్న పోలీసులకి చూపిస్తున్నాడు. ఆ పోలీసులు, రైతులకి ఆ ఆజ్ఞాపత్రం చూపిస్తున్నారు. "మీరు కూర్చోవచ్చును." అని ఆ ఆజ్ఞ.

నేలమీద మేమందరమూ కూర్చున్నాము. ఆ నేలమీద ఒక గంటసేపు కూర్చున్నాము. ఒక గంట తరువాత గొప్ప ఉద్యోగస్థులు కొందరు దూరంలో కనబడ్డారు. పోలీసులు "లేచి నిలబడండి, తక్షణం" అంటూ మమ్మల్ని లేవతీశారు. "లేవండి! లేవండి! నూతన ప్రభుత్వానికి జయ్! పాడెష్టాకి జయ్! బీదల్ని దోచుకోని న్యాయప్రభుత్వానికి జయ్! అని కేకలు వెయ్యండి!" అంటూ పోలీసులు ఖంగారుగా అరుస్తున్నారు.

మే మందరమూ లేచి నిలబడి జయ్‌జయ్‌లు జోరుగా కొట్టాము.

ప్రభుత్వ సభ్యులలో బీదవారిని దోచుకొని ఒకే సభ్యుడు పొడెస్టా అని మేము గుర్తించాం. బీద ప్రజలను—దోచుకొని—ప్రభుత్వ సభ్యులు మమ్మల్ని గడిచిపోగానే పోలీసుల్ల అనుజ్ఞ తీసుకొని మేమందరమూ కూర్చున్నాం.

మేము కూర్చున్న మరుక్షణాన్నే మళ్లీ పోలీసులు నిలబడి మన్నారు.

"ఇంకా గట్టిగా అనండి! జోరుగా అనాలి! మంత్రిగారికీ జయ్! అనండి."

ఒక పెద్ద మోటారుకారు. దానివెనకనే నాలుగు మోటారు సైకిళ్ళు మెరుపులా మెరిశాయి.

"మంత్రిగారికీ జయ్! జయ్!

పోలీసుల అనుజ్ఞతీసికొని, మళ్లీ మేము కూర్చున్నాము.

కాపలా కాస్తున్న పోలీసులు మధ్యాహ్న భోజనాలకు వెళ్లారు. మా మూటలు విప్పుకుని మేము తెచ్చుకున్న రొట్టెలను తిన్నాం.

రెండు గంటలవేళ మళ్లీ ముందు మంత్రిగారు, వెనక పొడెస్టా తక్కిన అధికారుల కారులు వెళ్ళాయి. బీదల నెప్పుడూ దోచుకొని ఆ ప్రభుత్వాధికారులు ఒక్కొక్కరే మోటారుల్ల మీద వెళ్ళేటప్పుడల్లా లేచి నిలబడి జయజయధ్వానాలు చేస్తూ మా ఉత్సాహాన్ని వెల్లడించాము.

చిట్టచివరికి "మీరు యిక వెళ్ళవచ్చును." అని పోలీసులు అన్నారు. మళ్లీ విపులంగా చెప్పారు.

"అదంతా అయిపోయింది. మీ యిళ్లకు వెళ్ళినా వెళ్ల వచ్చును. లేక పోతే, నాలుగు మూలలు తిరిగి పట్టణం చూడండి. కాని ఒకటి మాత్రం జ్ఞాపకం వుంచుకోండి. ఒక్కగంట కంటె అధికంగా మీరు యీ పట్టణంలో వుండ కూడదు."

"మా ఫ్యూసినో భూముల విషయం యేమిటి? మంత్రిగారు యెప్పుడు విచారిస్తారు?" అని మేము అడిగాము. కాని యెవ్వరూ మాకు సమాధానం చెప్ప లేదు.

ఆ విషయం యేమిటో తేల్చుకోందే మేము యింటికి వెళ్ళ దలుచుకో లేదు.

"నాతో రండి మీరు" అంటూ పట్టణం అంతా బాగా యెరిగిన బెరార్డో అన్నాడు.

పతాకాలతో అలంకరించివున్న ఒక పెద్ద భవనం దగ్గిరకి మమ్మల్ని తీసికొని వెళ్లాడు.

గుమ్మం దగ్గిరవున్న పహరా జవాన్లతో "మంత్రిగారి దర్శనంకోసం వచ్చాం! మమ్మల్ని లోపలికి వెళ్ళనియ్యండి" అన్నాడు.

ఆ పోలీసులు, అతడు పెద్ద మహాపరాధం చేసినట్టు, అతని మీద పడి లోపలికి యీడ్చుకొని పోయారు. కాని మే మందరమూ అతనిని పట్టుకున్నాం. మాకూ పోలీసులకూ

కొద్దిగా సంఘర్షణ జరిగింది. ఆ భవనంలోనుంచి అనేకమంది పరుగెత్తుకుని వచ్చారు. అందులో డాన్ సర్కో స్టాంజాకూడా వున్నాడు. కడుపు చెక్కలయ్యేట్లా తాగివున్నాడు.

"మా ఫాంటమారా గ్రామస్థుల్ని యెవ్వరూ అవమానపరచకండి. వారిని గౌరవించండి! అంటూ గట్టిగా అరిచాడు. వెంటనే పోలీసులు మమ్మల్ని వదిలేశారు. సర్కోస్టాంజా మా మధ్యకు వచ్చి, మమ్మల్ని కౌగలించుకొని ముద్దు పెట్టుకోబోతున్నాడు.

"మంత్రిగారి దర్శనం చేసుకొని. మొర పెట్టుకో బోతున్నాము" అని ఆ ప్రజామిత్రునితో చెప్పాము.

"మంత్రిగారు వెళ్ళిపోయారు" అని చెప్పాడు.

"అయితే ఫ్యూసినో భూముల తగాదా యెట్లా పరిష్కరింపబడిందో మేము తెలుసుకోవాలని వచ్చాము" అన్నాడు బెరార్డో.

ఒక పోలీసును పిలిచి, టార్లోనియో రాజకుమారుడి కార్యాలయానికి తీసికొని వెళ్ళమని చెప్పాడు. ఆ తగాదా తీర్మానింపబడిన విధానాన్ని గూర్చి ఒక గుమాస్తా మాకు యీ విషయాలు చెప్పాడు.

"ఐతే ఫ్యూసినో తగాదాని క్రొత్త ప్రభుత్వం తీర్మానం చేసిందన్న మాటే!" అని ప్రశ్నించాడు, బెరార్డో.

"ఆ! అందరికీ సంతృప్తికరంగా వుండేట్లా, తీర్మానం చేశారు." అన్నాడు గుమాస్తా.

"ఆ తగాదా పరిష్కరించేటప్పుడు మా విషయం మొర పెట్టుకునేందుకు మమ్మల్నికూడా యెందుకు పిలిపించలేదు? మమ్మల్ని ఆ బజారులో యెందుకు వుంచేశారు?" అని పిలాటో అడిగాడు.

"మంత్రిగారు మీ పదివేలమంది రైతులతో మాట్లాడగలరా? అందుచేత మీ ప్రతినిధితో యీ విషయాన్ని గూర్చి సంప్రదించారు." అని ఆ ఉద్యోగస్థుడు సమాధానం యిచ్చాడు.

"మా ప్రతినిధి యెవరు?"

"గౌరవనీయుడైన పెలినోగారు. సేనానాయకుడు."

"భూమిని యెట్లా పంచారు? ఫాంటమారా రైతులకి యెంతభాగాన్ని యిచ్చారు. పంపకాలు యెప్పుడు జరుగుతాయి?" అని బెరార్డో అడిగాడు.

ఆ భూమిని పంచిపెట్టరు. రైతు ప్రతినిధులు, మంత్రిగారూ కలసి చిన్న రైతులను తొలగించివేసేందుకు నిర్ణయించారు. ఇంతక్రితం, ఆ రైతుల్లో చాలమంది సేనలలో పనిచేశేవారు గనుక వారికి చిన్న చిన్న ప్రతుల్ని, ప్రభుత్వం యిచ్చింది. కాని యుద్ధసేవకీ, ఆర్థిక ప్రయోజనాలకీ చాలా దూరం వుంది......"

"నిజం! నిజం! యుద్ధంలో పనిచేసినంత మాత్రాన్నే, భూమిని సేద్యం చెయ్యడంవచ్చునని మనం యెంచకూడదు. భూమిని యిచ్చేముందు ఆతడికి పొలాన్నిదున్ని, పైరులు పెంచడం వచ్చునా, రాదా, అని ఆలోచించడం చాలా

ముఖ్యం. ఫ్యూసినోని దున్నుకునే రైతుల కివ్వాలి. అదే సర్కోస్టాంజాగారి సూత్రం.'' అని బెరార్డో అన్నాడు.

'' ఆ సూత్రాన్ని మంత్రిగారు అంగీకరించారు. సేద్యంచేసే వారికే ఫ్యూసినోని యివ్వాలని నిర్ణయించారు. ఫ్యూసినోని యెవరు సేద్యం చేయగలరో, చేయించేందుకు యెవరి వద్ద డబ్బు, మొదలైన సాధన సంపత్తివున్నదో, వారికే యివ్వాలి. ఇంకా స్పష్టంగా విప్పి చెప్పాలంటే, పెట్టుబడి ధనం వున్నవారికే ఫ్యూసినోని యివ్వాలి. డబ్బుకి టికాణా లేక, పెట్టుబళ్లకి దేవురించే నిర్భాగ్య రైతులచేతుల్లోంచి ఫ్యూసినోని విడిపించి, భాగ్యవంతులైన పెద్ద రైతులచేతుల్లో వుంచడమే మంత్రిగారు ఆశయంగా యెంచుకున్నారు. మూల ధనంలేని వాళ్ళకి ఫ్యూసినో భూముల్ని యితరులకి మగతాకి యిచ్చుకునే హక్కు లేదు.''

''మా రైతుప్రతినిధి యేమన్నాడు?''

'' రైతులకి ప్రాతినిధ్యంవహించిన, గౌరవనీయులైన పెలినో గారు, జాతీయోత్పత్తిని అభివృద్ధి చేసేందుకుగాను, ఫ్యూసినోలో సేద్యం చేస్తూవున్న చిన్న రైతుల్ని భూముల్లోంచి తొలగించేందుకు ప్రయత్నాలు చేయాలని శెలవిచ్చారు. ఈ తీర్మానాన్ని ఆచరణలో వుంచేందుకుగాను. పెద్దరైతులమీద పన్నులభారం బాగా తగ్గించి, చిన్నరైతులమీద నూటికి యిరవైపాళ్లు చొప్పున పన్నులని పెంచాలని సూచించారు. భూమిలోపండిన పంటలలోనే, కొంత భాగాన్ని పన్నుక్రింద యివ్వాలి. అందులో ముఖ్యంగా బీటుదుంపల ధర టన్నో

నియా రాజకుమారుని ప్రభుత్వమే నిర్ణయిస్తుంది. చిన్న రైతులు బీటు పంచదారదుంప పంటను సాగుచేయుని సంవత్సరం యెకరం ఒకటింటికి రెండువందల రూపాయలు చెల్లించుకోవాలి. మీా ప్రతినిధిగారు కోరినకోరికలన్నీ ఆమోదింపబడ్డాయి. ఈ అవెజ్ఞానా పట్టణానికి, ఫ్యూసినో గ్రామాలన్నిటినుంచి రైతులువచ్చి, మంత్రిగారికి, తదితర ఉద్యోగస్థులకీ వారుచేసిన యీా నిర్ణయాలకి హార్షధ్వానాలను చేసి, వారు పొందిన సంతృప్తిని వెల్లడిపరిచారు.

"అన్ని విషయాలు పూర్తిగా అర్థమయ్యాయండి!"అన్నాం మేము. నిజంగా చాల స్పష్టంగా బోధపడ్డాయి.

వీధుల్లో అప్పుడే దీపాలు వెలుగుతున్నాయి. అప్పటికే చాలా ప్రొద్దు పోయింది. కాని ఆ దీపాలు రాత్రిని పట్టపగలు చేశాయి. (అన్నీ చాలా స్పష్టంగా కనపడుతూనే ఉన్నాయి.)

అప్పుడే పిచ్చి యెక్కబోతోన్న ప్రపంచంలాగు అవెజ్జానా దుస్సహమైన బాధను అనుభవిస్తోన్నట్లు వింత చూపులు చూస్తోంది. ఆ మహాపట్టణంలో ప్రజలలో అనేకులు, కాఫీ హోటళ్ళలోనూ, సినిమాల్లోనూ, నృత్యశాలల్లోనూ, నవ్వుతో కేరింతాలు కొడుతున్నారు. ఇదంతా చూస్తోంటే యింతవరకూ జరిగింది వాస్తవమే అని తోచింది. ఈ విషయం అంతా తమాషా? లేకపోతే యీా ప్రజ లందరికీ తమ చుట్టుప్రక్కల జరుగుతోన్న ఘోర అన్యాయాన్ని గుర్తించనంత వున్మాదం యెక్కిందా? అని నన్ను నేను ప్రశ్నించుకున్నాను.

"పట్టణవాస్తవ్యులు కులాసాగా కాలాన్ని గడుపుతున్నారు. వాళ్ళు సౌఖ్యాంగా వున్నారు. వాళ్లు తింటున్నారు, త్రాగుతున్నారు, కేళీవిలాసంతో కులుకుతున్నారు... ...పల్లెటూరి రైతుల్ని వెక్కిరిస్తున్నారు." అన్నాడు బెకార్డో.

సరదాగా పాడుతూ, పాటకుతగిన లయవేస్తూ కొందరు యువకులు మమ్మల్ని అతిక్రమించి ముందుకు సాగిపోతున్నారు.

'నీకూ నాకూ జోడు అయితే
మల్లెపూలా తెప్పగట్టి
తేలిపోదము గదరా!'

మా ధ్వజాన్ని లాక్కున్న నల్లదుస్తులగుంపు వచ్చింది. మమ్మల్ని వారు గుర్తించగానే "శాన్‌-రాకోకీ జయ్!" అని జయధ్వానంచేసి నోటికి వచ్చినన్ని దుర్భాషలాడారు. తరువాత మా చుట్టూజేరి, గంతులువేస్తో, వింతనాట్యం చేస్తో చుట్టూ తిరగ నారంభించారు. కొందరు మా మీద అభినయిస్తున్నారు. మాలో కొందరి బుగ్గల్ని పొడిచి ప్రేమను, సిగ్గును తెలియపరుస్తున్నారు.

'చల్ మోహనరంగా!
నీకు నాకూ జోడు ఐతే
మల్లెపూలా తెప్పగట్టి
తెప్పమీద తేలిపోదము కదరా!

పాటపాడుతో తాళం వేస్తున్నారు. మా మనస్సులు యేమీ బాగుండలేదు. అందుచేత వారి యిష్టమువచ్చినట్లు వారిని

చేయనిచ్చాము. బోధపరచుకునేందుకు ప్రయత్నించడం చాలసేపు క్రితమే మానుకున్నాం. మేము మరో ప్రపంచంలో వున్నాం. పట్టణవాస్తవ్యుల మధ్య వున్నాం.

ఆ యువకులు మమ్మల్ని వదలిన నవ్వుతో వెళ్లిపోయారు.

ఒక పెద్దమనిషి మా వద్దకు వచ్చాడు. కొంతసేపటినుంచి ఆయన మా వెనక వస్తూండటం మేం చూశాం. ఆయన మంచి దుస్తులు ధరించాడు. రాగివర్ణపు జుట్టు, ఆయనగడ్డం మీద ఒక గాయపు మచ్చ వుంది.

"మీరు ఫాంటమారానుంచి వచ్చారు కాదూ?" అని అడిగాడు.

మేము సమాధానం యివ్వలేదు.

"మిమ్మల్ని చూసి, ప్రభుత్వోద్యోగులు భయపడుతున్నారనే సంగతి తెలుసునా, మీకు? ఈ నూతన ప్రభుత్వానికి మీరు వ్యతిరేకులని అధికారులకి తెలుసును."

మారు చెప్పకుండా ఆయనే మాట్లాడనిచ్చాం.

"మీ వాదన చాలా న్యాయమైనది. మీరు ప్రభుత్వాన్ని వ్యతిరేకించడం చాలా సబబైన పని. ఈ విధంగా ప్రభుత్వ వ్యవహారాలని, నిరాటంకంగా సాగనియ్యకూడదు. రండి, అల్లా వెళ్ళి అన్నిసంగతులనీ విపులంగా మాట్లాడుకుందాం."
ఆ వ్యక్తి ప్రక్క సందులోకి తిరిగాడు. మేము ఆయన్ని అనుసరించాము. మా వెనుక ఒక యువకుడు వచ్చాడు. ఆ వాలకాన్నిబట్టి చూస్తే విద్యార్థో, ఫాక్టరీ పనివాడో అనుకో

వచ్చును. ఏదో మాతో చెప్పదలచుకున్నట్లు, మావంక చూసి, అనేకసార్లు నవ్వాడు. రాగి వర్ణపుజుట్టు మనిషి. ఆ సందు చివర ఉన్న ఒక ఒంటరి భోజనపుహోటలుకి దారి తీశాడు. మేము ఆయన వెనుక వెళ్ళాము. ఆ యువకుడు కూడా మా వెనుకవచ్చి, ద్వారందగ్గిర ఒక క్షణం తటపటా యించి, లోపలికి వచ్చి, మాకు దగ్గరలోనే వున్న బల్లమీద కూర్చున్నాడు.

"ఈ విధంగా ప్రభుత్వంవారిని వ్యవహరించ నివ్వకూడదు. రైతులలో చాలా అసంతృప్తి ప్రబలివుంది. బాగా చదువు కున్నవా ళ్ళెవరైనా మిమ్మల్ని నడిపించేందుకు వుండాలి. సరోస్ట్రాంజా మిమ్మల్ని గూర్చి నాతో యెంతో అభిమాన పూర్వకంగా చాలసేపు చెప్పాడు. మీకు మేలు చెయ్యాలనే ఆయన ఉద్దేశ్యం. ఈ విషయంలో ఆయన వెనుకంజ వేసే వాడుకాదు మీకు సేవచేసేందుకు నేను సిద్ధంగా వున్నాను. మీకు అన్నివిధాలా సహాయం చేస్తాడు. మీరు యేదైనా ప్లాను వేశారా, నా సలహాకూడా తీసుకోండి. వింటున్నారా?"

ఆ క్రొత్త వ్యక్తి మాట్లాడేతీరూ, ఆయన ధోరణీచూస్తే మనస్సులు పాడైపోయివున్న మాబోటి వారికి తప్పితే మరెవ్వరికైనా చాలా అనుమానం కలిగివుండేది. ఒక పట్టణ వాస్తవ్యుడు మాతో యింత చనువుగా మాట్లాడటానికి ఇదే మొదటిసారి.

ఆయన్ని మాట్లాడ నిచ్చాము.

"నాకు అర్థమవుతోంది. మీ ముఖాలు చూస్తేనేచాలు, అంతా బోధపడుతుంది. పోలీసులు మిమ్మల్ని ఒక గంటలో

యీ అవిజ్ఞానాని వదలిపెట్టి వెళ్ళిపొమ్మన్నారు. కాని యింకా మీరు వెళ్ళలేదు. నాకు బోధపడుతోంది. ఈ ఉద్యోగస్థులకి వ్యతిరేకంగా యేమన్నా చెయ్యాలని వుందిమీకు. అది స్పష్టంగా తెలుస్తోంది; అది కాదని మీరు అనలేరు. మీకు సహాయం చేసేందుకు నేను సిద్ధంగా వున్నాను. మీకు యేమికావాలో అన్నీ సమకూర్చి పెడతాను. మీకోసం నేను నా సర్వస్వమూకూడా త్యాగంచేస్తాను. మీ రేమీ సందేహించవద్దు. అర్థం అయిందా?''

మా కేమీ అర్థం అవడం లేదు. పిలాటో యేదో మాట్లాడేందుకు నోరు విప్పబోయాడుకాని, బెరార్డో పాదాన్ని గట్టిగా నొక్కాడు, మళ్ళీ పెదవిల్ని మూసేశాడు.

"సరే నేనుకూడా యీ ప్రభుత్వానికి ప్రబల విరోధిని. బహుశా మీకు తుపాకులూ, పిస్తోళ్ళూ కావలసివుంటాయి. ఔను. ఈ ప్రభుత్వాధికారులమీద పగతీర్చుకోవాలని మీకు ఉందని అనుకుంటాను. ఉంటే, మీకు సాధన సామగ్రులు లేవు. అవ్వి కొరత అయ్యాయి. కాని వాటిని సంపాదించడం అంత కష్టమైన పనికాదు. అది సులభమైనపని. చాలా సులభం. ప్రపంచంలో అంత సులభమైన పని మరొకటి లేదు.''

మేము యింతవరకూ ఒక్క మాటకూడా పలుకలేదు, కాని అతడు మాత్రం ప్రశ్నలు వేస్తూ, తనేసమాధానాలు చెబుతో, మాట్లాడేస్తున్నాడు.

"పలుకులకేం చాల తియ్యగా వున్నాయి. ఐతేం, మాటలు వేరు, చేతలువేరు, అని మీరు లోపల అనుమాన పడుతున్నారేమో. సరే, నన్ను మీరు పరీక్షించండి. ఇక్కడ నా కోసం ఒక పావుగంట వరకు చూడండి. మీకు కావలసినవి నేను తీసుకొని రావడమేకాకుండా, వాటిని యెలా వుపయోగించడమోకూడా చెబుతాను. ఇంకా నన్ను అనుమానిస్తున్నారా? నాలో యింకా మీకు నమ్మకంలేదూ? సరే, బాగుంది, ఇక్కడే వుండండి. నా మాటల్లో నిజానిజాలు పరీక్షించండి."

అంటూ ఆయన లేచి, మా చేతులు కదిపి, సారాయికి డబ్బు యిచ్చి, బయటికి వెళ్లాడు.

ఆయన బయటికి వెళ్ళగానే, మా ప్రక్కని కూర్చున్న యువకుడు లేచి మా దగ్గరకు వచ్చి

"వాడో పోలీసుగూఢచారి, ఏజంటు ప్రోవాకేచరు. (ప్రజల్ని దౌర్జన్యానికి పురికొల్పేందుకు ప్రభుత్వంచేత నియమింపబడిన యేజంటు) చాలా జాగ్రత్తగా వుండండి. మీ దగ్గిరకి ఒక బాంబుతీసికొని వస్తాడు. ఆ తక్షణమే మిమ్మల్ని అరెస్టు చేయిస్తాడు. వాడు వచ్చేలోపుగా వెళ్ళిపొండి, లేవండి" అన్నాడు.

ఆ ఏజంటు ప్రోవాకేచరుని కలుసుకోకుండా వుండేందుకు పొలాలమధ్యనుంచి పరుగెత్తాము.

ఆకలి వేస్తోంది. దారుణంగా దాహంవేస్తోంది. కాలినడకని ప్రయాణం. అన్నిటికంటె మానసిక వ్యథ. శాన్‌రాకో

పతాకం గాలిలో ఆహ్లాదకరంగా యెగురుతోంటే, భూముల విషయంలో మాకు హక్కు స్థిరపడుతుందనే ఆశతో, హృదయాన్ని వెళ్ళినరోడ్డుమీదనే, కాళ్లీడ్చుకుంటో, కృంగి పోతోన్న హృదయాలతో ఘటాలని అతి భారంగా యింటికి జేరవేశాం.

మేము యిళ్ళకివచ్చేటప్పటికి అర్థరాత్రి అయింది. మళ్ళీ మూడుగంటలకి రోడ్డు అందుకున్నాము. అప్పుడే ఫ్యూసినోలో ఊడ్పులు ఆరంభించారు.

౫

కంట్రాక్టరు ఆక్రమించిన గ్రామకంఠం చుట్టూ కంచె వేయించాడు.

రైతులూ, పశువుల కాపరులు యికముందు యెప్పుడూ గొణగకుండా వుండేందుకుగాను ఆ కంచె వేయబడింది. శతాబ్దాల తరబడి, గ్రామ వుమ్మడి భూమిక్రిందవున్న ఆ పచ్చిక మైదానం అతని సొత్తు యెట్లాఅయిందో, రైతులకింకా అర్థం అవలేదు. వారికి యింకా అతని హక్కువిషయంలో సందేహం వుంది. ఆ కంచె వున్నప్పటికీ వారు గొణుగుడు మానలేదు. ఒకరోజున ఆ కంచెకు నిప్పు పెట్టబడింది.

ప్రజలసొమ్ముంనుంచి డబ్బు వెచ్చించి, కంట్రాక్టరు దాని చుట్టూ కంచెవేయించి, యిద్దరు మనుష్యులను కాపలా పెట్టించాడు.

సృష్టి ఆరంభమైన మొదటిరోజునుంచి, నేటివరకూ, పశువుల కాపరుల దెబ్బలాటలకూ, గొడ్డెలకూ, తోడేళ్ళకూ, బంది

పోటు దొంగలకూ, యుద్ధాలకూ నిలయమైన ఆ పెద్ద మైదానము, నేను యిద్దరు కాపలాదారులకి చులాగ్గా లోబడి పోతుందా? దానిని అదుపు ఆజ్ఞల్లో వుంచి శాంతి వాతావరణాన్ని వారు స్థాపించగలరా?

కాపలాదారులు చూస్తుండగానే, కంచెకు నిప్పంటుకుంది, పొగవచ్చింది, నిప్పురాజుకుంది, కొద్దిక్షణాల్లో మంట వ్యాపించింది, కంచె పూర్తిగా భస్మీపటలమై పోయింది. ఈ అద్భుతాన్ని ఆ పహారావాళ్ళు కనపడిన ప్రతివాళ్ళతోటీ చెప్పారు. డాన్ అబ్బేషియో పురోహితుడు. అనేక పురాణగ్రంథాలు తిరగవేసి, భూమిలోనుంచి పుట్టుకువచ్చిన ఆ నిప్పు మానవులు పెట్టింది కాదనీ, దెయ్యాలు పెట్టినదే ననీ నిర్ధారణ చేశాడు. ఐతే దెయ్యాలు మనం అనుకునేటంత చెడ్డవి కావు అని మేము అనుకోనారంభించాము. ఆ దెయ్యాలని అరెస్టు చేయలేని కంట్రాక్టరు, వాటికి బదులుగా, ఆ కాపలా మనుష్యుల్ని ఖైదులో పెట్టించాడు.

దెయ్యం నెగ్గుతుందా, కంట్రాక్టరు జయిస్తాడా? మేమందరమూ కంట్రాక్టరుకి వ్యతిరేకం. కాని మాలో బెరార్డో ఒక్కడే దెయ్యాలకి యెక్కువగా తోడ్పడేవాడు.

ఫాంటమారా ఆడవాళ్ళలో కొందరం క్రీస్తు దేవాలయం ముందు కూడి ఒక సాయంకాలం మాట్లాడుకుంటున్నాము. నేను మేరియా, ఫిలమేనా, కాష్టానా, రెఫీటా, కన్నరోజో కూతురు, యింకా ఒకరిద్దరు వున్నాము. మామొగవారింకా పొలాలనుంచి తిరిగి రాలేదు. అప్పుడే బాగా చీకట్లు కమ్మి

వేశాయి. ఫాంటమారాకి కిందుగావున్న మైదానం తెల్లటి రోడ్డు యీలాన్ని రెండు భాగాలుగా చీలివున్నట్లు కనపడు తోంది. ఆ రోడ్డుమీద నరసంచారం లేదు. కొండనిచుట్టి మైదానంనుంచి, ఫాంటమారాకి వచ్చే రోడ్డుకూడా నిర్జ నంగా వుంది.

అవ్వీ పూవుల్లరోజులు కనుక, మా మొగవారు గడియా రంలో గంటలను చూచుకోని, ఆయన్నర అయ్యేటప్పడికి కాని యింటికి చేరుకోరు, అని మా అందరికీ తెలుసును. అకస్మాత్తుగా, ఘనీభవించిన ఆ నిశ్శబ్దతని చీల్చుకుని ముస్ముందు తేనెటీగల ఝుంకారంలాగూ, తరువాత క్రమ క్రమంగా పెద్ద యంత్రపు ధణ్ ధణ్ ధ్వని వినపడసాగింది. ఆ మైదాన ప్రదేశంనుంచి, ధ్వని వినపడుతోన్నట్టుంది, కాని ఆ ధ్వనికి కారణం యేమిటో తెలియడంలేదు.

ఆధ్వని అంతకంతకు, మరీ అధికం అవుతోంది.

లోయ మళుపుదాటి వస్తూన్న లారీ మాకంట పడింది. ఆ లారీనిండా మనుష్యులున్నారు. దాని వెనకనే మరొకటి, యింకొకటి, మరొకటి, వరుసగా యింకా యెన్నోవస్తు న్నాయి. పన్నెండో, పదిహేనో, యిరవయ్యో యెన్ని వున్నాయో లెఖ్ఖపెట్టలేక పోయాం. కన్నరోజో కూతురు ఒక వందలారీలు వున్నాయంది. మేము యెప్పుడూ, అన్ని లారీలని చూడలేదు మా జీవితంలో!

ఫాంటమారాలో వున్న జనాభా అందరూ, అంటే స్త్రీలు, పిల్లలు, పనిచెయ్యలేని వృద్ధులూ, ఆ ధ్వనిని విని దేవా లయం దగ్గిరకి పరుగెత్తుకుని వచ్చారు.

"యాత్రకి వెళుతున్నారమ్మా యాత్ర!" అని ఆశ్చర్యంగా జోర్సనారా అంది. "ఈ రోజుల్లో యాత్రికులు నడిచి వెళ్లడం లేదు. మోటార్లమీద యాత్రలు చేస్తున్నారు. మన శాన్ రాకోని దర్శించుకునేందుకు వస్తున్నారు."

"అబ్బే, అదికాదు. మోటారుపందెములు జరుగుతున్నాయి. ఎవ్వరు వేగంగా నడుపగలరా అని పోటీపడి, మోటార్లని నడిపిస్తున్నారు. పట్టణాల్లో ప్రతిరోజూ యిల్లాంటి మోటారు పందెములు జరుగుతుంటాయి!" అన్నాడు సేనల్లో పనిచేసి, పించను తీసుకుంటోన్న, సిపోలా.

ఆ మోటార్లధ్వని, క్షణక్షణం అధికమౌతోంది. ఆ మోటార్లలోవున్న మనుష్యులు వికృతంగా అట్టహాసం చేస్తున్నారు. మాకు కొంత దూరంలో ఆగి, అందరూ పిస్తోళ్ళు కాల్చడం మొదలెట్టారు. ముందు మాకు కలిగిన ఆశ్చర్యంపోయి, భయంవేసింది. దేవాలయపు గోడల బెల్లు లూడి పడుతున్నాయి.

"వాళ్ళు కాలుస్తున్నారు! పేలుస్తున్నారు! చర్చిమీద తుపాకులు పేలుస్తున్నారు! మనమీదకూడా కాలుస్తున్నారు."

"వెనక్కి పరుగెత్తండి! పారిపోండి! పారిపోండి! కాలుస్తున్నారు!" అంటూ చర్చి ఆవరణపు గోడదగ్గరవున్న బాల్డిస్సేరా అరిచాడు.

మా మీద పిస్తోళ్లు పేలుస్తున్న వీళ్లెవరు? ఎందుకు కాలుస్తున్నారు." ఇది యుద్ధం! వాళ్ళు యుద్ధంచేస్తున్నారు! అంటూ, మళ్లీ బాల్డిస్సేరా సేనాని కేకలువేశాడు.

ఎందుకూ యుద్ధం? అందులోనూ యుద్ధం మామీద యెందుకు?

ఔనయ్యా, అది యుద్ధమే! ఎందుకో భగవంతుడికి తెలియాలికాని వాళ్ళు యుద్ధమే చేస్తున్నారు!'' అని గొంతుక చించుకుని చెప్పాడు, సేనాని.

అది యుద్ధం అయితే మనం దైవప్రార్థన చెయ్యాలి, హే భగవానుడా! కరుణామయుడా'' అని టెరొఫిలో ఉచ్చరిస్తోండగానే, అగ్నిగోళాల వర్షం చర్చిని ముంచెత్తింది. మట్టి బెల్లులు మామీద యెగిరిపడ్డాయి. ఈ విషయం అంతా అర్థహీనంగా కనపడుతోంది. మామీద యెందుకు యుద్ధం చెయ్యాలి? అందుకు కారణం యేమిటి? స్కార్పోనా మతిచలించినట్టు గట్టిగా యేడుస్తోంది, కేకలు వేస్తోంది. మేమందరమూ, ఆమెచుట్టు మేకలగుంపు వలె మూగాము. మేముకూడా గోలచేయ నారంభించాము. మా అందరిలోనూ, బుర్ర పోగొట్టుకోకుండా వున్నది బాల్డిస్సేరా సేనాని ఒక్కడే!

"మనం యేమీ చెయ్యలేం. ఇది యుద్ధమే. యుద్ధం చేస్తున్నారు. మనం దానిని ఆపలేము. ఇది యుద్ధం. మన అందరి దురదృష్టం. ఎప్పుడు పెద్ద యుద్ధాలు జరిగినా, యీ విధంగా—జననాశనం, పంటలనాశనం, గ్రామాలనాశనం జరుగుతుంది.'' అని సేనాని తత్వోపదేశం చేయ నారంభించాడు.

మేరియాక్కి మంచి ఆలోచన తట్టింది.

"చర్చిగంట మోగిద్దాం. దేశం అపాయకరమైన స్థితిలో చర్చి గంటలు మోగిస్తో వుంటారట. షైడ్ మాంటీస్ రాజులు మన దేశంమీద దండెత్తినప్పుడుకూడా యిదివరకు యిల్లాగే గంట రాత్రి అంతా మోగించారు." అని ఆమె వుపాయం చెప్పింది.

కాని టియోఫిలో లేచి నిలబడలేనంత భయపడి, చదికిల బడి పోయాడు. చర్చి తాళంచెవులు నాచేతి కిచ్చాడు. నేనూ ఎల్వీరా కలిసి చర్చిగంట మోగించేందుకు వెళ్ళాం. కాని ఎల్వీరా ఝుడుస్తోంది.

"ఇంతవరకూ యెప్పుడైనా స్త్రీలమీద యుద్ధం జరిగిందా? అక్కా?" అని ఆవిడ నన్నడిగింది.

"నేనూ వినలేదు అమ్మా"అని చెప్పాను.

"అయితే వీళ్ళు మనమీద యుద్ధంచేసేందుకు రాలేదమ్మా మన మొగవారు కనపడితే వారి నందరినీ నిలబెట్టి చిత్రవధ చేస్తారు. అప్పుడు యుద్ధం జరుగుతుంది. వీళ్ల పగ అంతా మగవాళ్ళమీదే. గంట మోగిస్తే, యే యిల్లో తగలబడు తోంది అనే ఖంగారు పడుతో మనవాళ్ళు పరుగెత్తుకుని వస్తారు. అప్పుడంతా సర్వనాశనం అయిపోతుంది" అని ఎల్వీరా భయపడుతో చెప్పింది.

ఎల్వీరా బెరార్డోనిగూర్చి ఆలోచిస్తోంది. నేను, నా భర్తని, నా కొడుకుని గూర్చి ఆలోచిస్తున్నాను. అందుచేత మేము గంట మోగించకుండా, ఆ చర్చి గోపురంమీదనే ఆగి పోయాం.

ఫాంటమారా గ్రామంవద్దకువచ్చి, ఆ లారీలు ఆగడం, ఆ గోపురంమీదికి బాగా కనబడుతోంది.

లారీలలోనుంచి చాలామంది రైఫిలులు ధరించిన సైనికులు మా చర్చివైపు వస్తున్నారు. మరికొందరు లారీలదగ్గరనే నిలబడి వున్నారు.

ఫాంటమారా స్త్రీలు, వృద్ధులు, బాలురు ప్రార్థన చేయనారంభించారు.

కావుమో పరమేశ!
జగదీశా కావుమో పరమేశ!

టియోఫిలో మొదటిచరణం చెబుతున్నాడు. తక్కినవారంతా ముక్తకంఠంతో పాడుతున్నారు. ఏం జరుగబోతుందో యెవ్వరికి తెలియదు. ఆతనికి తోచిన, మహాపాపాల పేర్లన్నీ చెబుతున్నాడు, తక్కినవారంతా "కావుమో పరమేశా" అని పాడుతున్నారు.

ఒకక్షణంలో యేం జరుగుతుందో యెవ్వరూ వూహించలేకుండా వున్నారు. శస్త్రపాణులైన ఆ సైనికులు దేవాలయ ఆవరణలోనికి వస్తున్నారు. వారి సంఖ్య మాకు చాలాభయం కలిగించింది. మేము భయంతో ఒక చీకటికోణంలో నిలబడి చూస్తున్నాము.

రెండువందలమంది సైనికులవరకూ వుంటారు. వారి చేతుల్లో రైఫుళ్ళేకాకుండా, మొలచుట్టూ ఉన్న తోలుపటకాల్లో బాకులు ఉన్నాయి. వాళ్ళంతా నల్లదుస్తులు వేసుకున్నారు. ఆ సైనికుల్లో కొద్దిమందితప్ప తక్కినవారంతా

భూమి పుట్రా లేక, కూలినాలి చేసుకుంటూ, సంపాదించిన కూలి సరిపోక, దొంగతనం మొదలైన నీచపు పనులు చేసుకుంటూ జీవించేవారు. వారంతా మా చుట్టుప్రక్కల గ్రామాలవాళ్ళే. మరికొందరు పెద్దపెద్ద సంతల్లో తిరుగుతూండే దళారిబేరగాళ్ళు. కొందరు కప్పలు పెట్లు కడిగే వారు. మరి కొందరు భాగ్యవంతుల దగ్గర, పెద్ద భూస్వాముల దగ్గర పొగడుతో పెత్తనాలు చేస్తోండే పర భాగ్యోపజీవులు, పరాన్న భుక్కులు. పూర్వం మా ఓట్లకోసం మా చుట్టూ తిరుగుతూండేవారు. ఇప్పుడు పిస్తోళ్లు పుచ్చుకని మా మీద యుద్ధం చేసేందుకు వచ్చారు. శాంతి భద్రతలనీ, ఆస్తిపాస్తులనీ, నీతినియమాలనీ, ప్రభుత్వాన్నీ కాపాడేందుకు గాను, రౌడీలు, బందిపోటుదొంగలు తయారయ్యారు. కుటుంబాల్లేని, పేరు ప్రతిష్టలు లేని, నీతిజాతిలేని, నిరక్షరకుక్షులైన మనుష్యులు, వాళ్ళు బీదవాళ్ళైనా బీదలశత్రువులైన స్వవర్గ ద్రోహులు యీ రోజున, మా మీద పిస్తోళ్లు పేలుస్తో యుద్ధం చేసేందుకు వచ్చారు.

పొట్టిగా, వలంగావుండే ఒక వుద్యోగస్థుడు ముందు నడిచి వచ్చాడు. ఆయన కడుపుచుట్టూ త్రివర్ణపతాకంవుంది. ఆయన ప్రక్కనే ఫిలిప్స్ బెల్లో వస్తున్నాడు.

"మీరేమిటి పాడుతున్నారు? అని ఆ ఉద్యోగస్థుడు టిమోఫిలోని, అడిగాడు.

"మేము శాంతికోసం ప్రార్థిస్తున్నాం." అని జవాబిచ్చాడు టిమోఫిలో.

"సరే, చాలా బాగుంది. మీకు శాంతినే ప్రసాదిస్తాం" అని నవ్వుతో ఫిలిప్పోకి సౌజ్ఞచేశాడు.

ఫిలిప్పోబెల్లో, టియోఫిలో దగ్గిరకివచ్చి ఫెడేలుమని చెంప మీద కొట్టాడు.

టియోఫిలో చెంపని,నిమురుకుంటో, మా అందరివైపు అగమ్య గోచరమగు చూపులుచూసి, "ఎందుకు కొడుతున్నారు?" అని అడిగాడు.

"పిరికిపంద! పిరికిపందా! నిన్ను కొడితే, మొగతనంలేనట్టు అల్లాగ చూస్తావేం? తిరగబడు!" అంటో పళ్ళు కొరికాడు, సైనికాధికారి.

కాని, టియోఫిలో నోరు మెదపలేదు, అడుగు కదపలేదు, స్త్రీలు, వృద్ధులు, బాలురు, జబ్బుపడిన ఆ మానవులగుంపులో యెంత రెచ్చగొట్టినా, యెదురు తిరగగలిగినవారు ఆ పొట్టి మనిషికి కనబడలేదు.

ఆ అధికారి ఫిలిప్పోతో కొంతసేపు సంప్రదించి, ఈ సందర్భంలో మన మేమీ చెయ్యలేం" అంటూ, మా వైపు తిరిగి "అందరూ యిళ్ళకి పొండి!" అని గద్దించి ఆజ్ఞాపించాడు.

మావాళ్ళందరూ యిండ్లకు వెళ్ళిపోయినతర్వాత, నల్ల దుస్తుల సైనికులవైపు తిరిగి "అయిదేసిమంది జట్లులుగా విడిపోయి, గృహాలన్నీ వెతికి, మొగాళ్లు వచ్చేలోపుగా తుపాకులు మొదలైన ఆయుధాల్ని వశపరచుకోండి!"అని ఆజ్ఞాపించాడు.

మెరుపు మెరిసినంత వేగంగా ఆ ఆవరణ ఖాళీ అయిపో యింది. అప్పటికే బాగా చీకట్లు కమ్మాయి. ఆ మెత్తుగోపు రంనుంచి మేము, ఆ సైనికుల జట్లు వీధుల్లోకి వెళ్లడం చూడ గలిగాము. ఫాంటమారాలోని సందుగొందుల్లోవున్న పూరి యిండ్లలో వాళ్లు చొరబడ్డారు.

ఈ శాంతి, భద్రతల ప్రతినిధులు, యెలక్ట్రిక్ దీపాలకాంతి లేందే ఆ చీకటి యిండ్లలో యేమీ వెదుక లేరు.

మా చర్చిగోపురానికి ప్రక్కనే వున్న మేరియాయింట్లో నుంచి అకస్మాత్తుగా పెద్ద ఆర్తనాదం వినపడింది. వెను వెంటనే ఫిలోమినా, సోఫియా, లిజబెట్టాల యిండ్లలోనుంచి కూడా యేడ్పులూ, పెడబొబ్బలూ, కుర్చీలు, బల్లలు, మొద లైన సామాన్లు నేలమీద పడిన చప్పుడు వినపడ్డాయి.

కసాయివానివద్దవున్న మేక, హృదయవిదారకంగా కేకలు వేసేవిధంగా, మేరియా యేడుస్తోంది. తలుపులు తెరచివున్న యింట్లో, అయిదుగురు సైనికులు బలాత్కారంచేస్తోంటే, వాళ్ళ బారినుండి తప్పించుకొనేందుకు పెనగులాడుతోన్న యువతి కనపడింది. అనేకసార్లు విడిపించుకుని తలుపు దగ్గరికి వచ్చేదికాని ఆసైనికులు మళ్ళీ ఆమెనిపట్టుకొని లోపలికిలాగు కొనిపెడుతున్నారు. ఆమెకాళ్లూ, చేతులూ పట్టుకొని, క్రింద పడుకోబెట్టి, అదిమిపెట్టారు. ఆమె దేహంమీద వున్న గుడ్డ లన్నిటిని చించిపారవేశారు. నలుగురు ఆమెను అదిమివుం చగా, అయిదవ సైనికుడు తన కామాన్ని తీర్చుకుంటు న్నాడు. పీక వుత్తరింపబడుతోన్న జంతువువలె ఆమె చేసే

ఆర్తనాదం, గొంతుకలోనే హరించిపోతోంది. మొదటి వాడైపోగానే, రెండవవాడు ప్రారంభించాడు. ఆ తరువాత మూడవవాడు. ఆతని తరువాత ఆమెను అదిమిపుంచవలసిన స్థితిలో లేదు. ఆ జీవచ్ఛవయంత్రంమీద మిగిలిన యిద్దరు సైనికులూ కామాన్ని తీర్చుకున్నారు. తరువాత, నవ్వుతో వారంతా పరిహాసాలు చేసుకుంటూ, ఆ యింట్లోనుంచి బయటికివచ్చి, యిరవై గజాల దూరంలోవున్న లిజబెట్టాయింటికి వెళ్ళారు.

ఈ దృశ్యాన్ని, నేనూ, ఎల్వీరా చూశాం. మా కండ్ల యెదుటనే కొన్ని గజాల దూరంలో జరిగింది. ఆమెచేతుల్ని నా మెడచుట్టూ పెనవేసి, గజగజ వణకిపోతోంది. ఆ చర్చి గోపురం అంతా వూగుతోన్నట్టు, భూమి కంపిస్తోన్నట్లు వుంది. కిందపడి, మేము దాక్కున్నచోటుని కాస్తా, బయటికి వెల్లడి చెయ్యకుండా, ఆమెని పట్టుకునేందుకు నేను చాలా కష్టపడవలసి వస్తోంది. సైనికులు మేరియా దేహాన్ని దారుణంగా హింసించిన గదివైపు, కనురెప్పలు వెయ్యకుండా గాజుకళ్లతో ఎల్వీరా యింకా చూస్తోంది. చనిపోయినవారి కళ్లని కప్పేటట్లు ఆమె కళ్ళని మూశాను. ఆ మరుక్షణంలోనే, నా కాళ్ళలో శక్తి వుడిగిపోయింది. నా కళ్ళు చీకట్లు కమ్మాయి, నాకు స్పృహతప్పి క్రిందపడిపోయాను.

ఆ రాత్రి యింకా యేమిజరిగిందో, నాకు తెలియదు, ఇప్పుడు యింతవరకూ నీకు చెప్పింది మాత్రమే జ్ఞాపకంవుంది. ఆ రాత్రి జరిగిన విషయాలు తప్ప మరేమీ నాకు జ్ఞాపకం వుండవేమో అని చాలాసార్లు తోస్తోవుంటుంది. తక్కిన

విషయాలు మా ఆయన చెబుతాడు.

ఫ్ర్యాసినో పొలాలనుంచి తిరిగి వస్తోన్న మా మొగాళ్ళకి యీ విషయా లేమీ తెలియవు. వాళ్ళు చర్చిగంట మోగించక పోవడం చాలా పొరపాటే !

బెరార్డో, లింసెంజా, జెరాండా, మేరియాతిండి, లిజబెట్టా వరుసా నేనూ, పెస్సినా పొలాలదగ్గిర కలుసుకొని పిచ్చా, పాటీమాట్లాడుకుంటూ వస్తున్నాం. మావెనకాల బాల్లెట్టా, శాంటో, మరొక యిద్దరు ముగ్గురు వస్తున్నారు.

ఫాంటమారా యువతల చాలా లారీలూ, శస్త్రపాణులైన సైనికులూ మా కళ్ళబడ్డారు. "బహుశా, ఆ కంచెవిషయమై వచ్చివుంటారు. మనవూరువాడెవడో దాన్ని కాల్చివేశాడని ఆ కంట్రాక్టరు అనుమానపడి వీళ్ళని పంపించివుంటాడని నాఅనుమానం" అన్నాడు బెరార్డో.

లారీలదగ్గర నిలబడివున్న అనేకమంది సైనికులు బెరార్డోని ఎరుగుదురు. కాని ఫాంటమారాకు ఎందుకువచ్చారో వాళ్ళు చెప్పలేదు. వాళ్ళకే, బహుశా తెలియదేమో! మమ్మల్ని వెంటబెట్టుకుని వూళ్ళోకే తీసుకవెళ్ళారు. నలుచదరంగా సైనికులు బారులుతీర్చి నిలబడివున్నారు. చిన్న బొజ్జపొట్టి సేనానాయకుడు ఆవ్యూహం మొగ్గరాన్ని వున్నాడు. ఆ వ్యూహంమధ్యని బాల్డిస్సేరాసేనాని, టియోఫిలో, ముసలి దర్జీ, సిపోలా, మరికొందరు, వివర్ణవదనాలతో, నిశ్చేష్టులై యుద్ధబందీలవలె నిలబడివున్నారు.

మేమురాగానే ఆవ్యూహం తెరుచుకొని, లోపలికి వెళ్ళగానే మూసుకుపోయింది.

నవ్వాలో, కోపగించుకోవాలో తెలియనట్టు బెరార్డో నావంక చురుకుచూపు విసిరాడు. మేము వచ్చేముందు ఏం జరిగిందో తెలుసుకోవాలని ప్రయత్నించాం. బాల్డిస్సేరా సేనాని "ఇంతకుముందు కనీ వినీ యెరుగని దారుణం జరిగింది" అని నాచెవిలో మెల్లిగా అన్నాడు. ఆ తరువాత "నాకళ్ళను నమ్మలేకుండా వున్నాను. మహాదారుణం జరిగింది" అంటూ బెరార్డోతోటీ తక్కిన అందరితోటీకూడా అతి మెల్లిగా గొణిగి వచ్చాడు. అతని మాటలు మాకేమీ అర్థం అవలేదు కాని, యెంతటి దారుణమైన సంఘటన జరిగినా, ఒక చారిత్రక ఉదాహరణ, చెబుతోండే బాల్డిస్సేరాసేనానే అల్లా అనడం చాలా అసాధారణంగావుంది.

అసలుచివరపు వ్యూహం మళొకసారి మూడవసంపు త్రోవ యిచ్చి మరల మూసుకుపోయింది. ఈసమూహంలో, మిచిలీ జోంపా, పిలాటో మొదలైనవాళ్ళున్నారు.

మేమే యీఅనర్థానికీ, కష్టాలకీ కారకులం అన్నట్టు మాకేసి వాళ్ళు చూశారు కాని అంతమంది శస్త్రపాణుల యెదుట నోరు మెదప లేకపోయారు.

ఆ వ్యూహంలోకి తరువాత వచ్చినవారిలో, అచిలీ, ఆల్బర్టో, మేరియావరుడూ, మరికొందరు యువకులూ వున్నారు.

ఏంజరుగుతుందో యెవ్వరూ వూహించుకోలేకపోతున్నారు. ప్రతిఒక్కరూ, ప్రతి యితరునివైపు చూస్తున్నారు. ప్రతి వాళ్ళు, అధికార్లకు, గ్రామస్తులకు యేదోతగాదా వచ్చిందని అనుకుంటున్నారు. కాని యెవ్వరూ పైకి చెప్పి తేలిపోకూడదని మేకపోతుగాంభీర్యంగా, మాట్లాడటం లేదు.

ఆ బొజ్జమనిషి యేమి చెయ్యాలనుకుంటున్నాడో మాకు గ్రహించడం కష్టంగానేవుంది. ఖైదుకి తీసుకొనివెళతాడా? బహుశా తీసికొనివెళ్ళడు, తీసికొనివెళ్ళడం అసాధ్యమైన పనికూడాను. ఆ ప్రవాహంలో మనుష్యుల్ని యింకా కొంతకాలం నుంచోమంటారు, అంతేగాని యింటిమందిని వాళ్ళు యీడ్చుకొని పోలేరు.

నల్లమనుష్యుల సైనికుల్ని మేమెరుగుదుం. వాళ్ళూ తిరవచ్చారు, లేకపోతే వారికి ధైర్యం వుండకపోను. వాళ్ళలో చాలామంది తప్పతాగివున్నారు. వాళ్ళకళ్ళల్లో చూస్తోంటే ముఖాలు ప్రక్కకు త్రిప్పుకుంటున్నారు. వాళ్ళు చాల బీదవాళ్ళు. భూముల్లేవు. ఏవృత్తి చెయ్యరు. లేకపోతే చాలా చెయ్యాలిగి వుండడంమూలాన్ని, యేపనీ చెయ్యడానికి యిష్టపడరు. కష్టపడి పని చెయ్యటానికి ఒప్పుకోరు. వారం వారం యెవరినో ఒకరిని ఆశ్రయించుకొని పొట్టనింపుకునే రకం. ప్రభుత్వాధికార్ల మీద యెదురుతిరగ లేనంత బలహీనం, భాగ్యవంతులని పట్టుకొని, వాడు తంతోన్నా వేళ్ళాడేరకం. బీద రైతుల్ని, యితరులవద్ద భూమితీసుకొని మగతాకి పొలం సాగుచేసేవాళ్ళనీ, బెదిరించీ చేతికిదొరికినంత తీసుకుపోతారు. పట్టపగలు వీధుల్లో వారిని కలుసుకుంటే వంగివంగి నమస్కారాలుచేస్తారు. చీకటి పడగానే, పదిమంది కలసి నీచవృత్తిలోకి దిగుతారు. కాని, యిల్లాంటి దొంగల్ని, యాచకుల్ని, నీచుల్ని, హంతకులినీ, సేవలలోచేర్చి వారికొక క్రొత్తరకపు దుస్తులనీయడం యీమధ్యనుంచీ జరుగుతోన్న వింతవిషయం.

ఫాసిష్టులని పిలువబడేవాళ్ళు, వీళ్ళే.

వాళ్ళ ధైర్యానికి మరొక కారణంకూడావుంది. మాలో ఒక్కొక్కడు ముగ్గురికి సమాధానం చెప్పగలం, కాని మమ్మల్ని అందర్నీ బంధించే ప్రయోజనాలేమిటి? శిక్షణఏది? సంస్థయేది? సైగా వారిమధ్యకూడా ఉన్నాం.

అవ్యూహంలో మేమందరమూ చుట్టుముట్టివేయబడిఉన్నాం. మేమందరమూ ఫాంటమారాలో జన్మించాము. ఇదొక్కటే మాఅందరికీ సంబధించిన సామాన్య విషయం మాలోని ప్రతి వ్యక్తీ తననిగూర్చే ప్రధమాన్ని ఆలోచించుకుంటున్నాడు. తాను యేవిధంగా తప్పించుకుని బయటపడటం? మాలో ప్రతిఒక్కరికీ కుటుంబాలు వున్నాయి, మా కుటుంబాలనిగురించే ఆలోచించుకుంటున్నాము.

ఇందుకు విరుద్ధంగా ఆలోచిస్తున్నవాడు ఒక్క బెరార్డో అయివుంటాడు. ఐతేం, అతనికి పొలమూలేదు, పెళ్ళాంలేదు.

ఈలోపుగా ఫ్యూసినోనుంచితిక్కిన రైతులూ, పనివాండ్రూ) వచ్చారు. వారినికూడా వ్యూహంలో మధ్యని వుంచారు.

రాత్రి చాలా ప్రొద్దుపోయింది.

" ఇంక మనం పరీక్షించడం ఆరంభిద్దాం!"

అని ఆ పొట్టి అధికారి అన్నాడు.

పరీక్షిస్తారు? ఏం పరీక్షిస్తారు?

ఆ వ్యూహంలో ఒక గజంవెడల్పుని ఒక త్రోవచేశారు. ఆ పొట్టిఅధికారి, ఫిలిప్పో వారి ప్రశ్నకాండ ఆరంభించారు.

పరీక్ష ఆరంభంఅయింది. మొదట టిమోథిలోని పిలిచారు.

" ఎవరు వధిల్లాలి? అని ఆ బొజ్జ అధికారి అడిగాడు.

టిమోథిలో కిక్కురు మనకుండా నేలమీదపడ్డాడు. దీనంగా మాఅందరివైపు చూశాడు. మాకీ పరీక్ష యేమో అర్థంఅవక తెల్లబోయాం.

" వధిల్లాలి? యెవరు?" అని ఆన్యాయశాస్త్ర ప్రతినిధి అడిగాడు.

టిమోథిలో యేమీ జవాబు చెప్పకపోవడంచూసి పుస్తకం పట్టుకొని నుంచున్న ఫిలిప్పోతో అధికారి ఇల్లా చెప్పాడు.

" 'తలబిరుసు'లో చేర్చు"

టిమోథిలోని వదిలేశారు. దర్జీని పిలిచారు.

"ఎవరు వధిల్లాలి ?" అని ఆ అధికారి అడిగాడు.

ఆ దర్జీ చాలాసేపునుంచి ఆలోచించుకుంటున్నాడు కనుక వెంటనే సమాధానం యిచ్చాడు.

"మేరీ వర్ధిల్లాలి!"

"ఏ మేరీ?" అని ఫిలిప్పో అడిగాడు.

"లారెటో మేరీ!"

" 'తలబిరుసు'లో చేర్చు" అన్నాడు ఆ పొట్టిమనిషి.

దర్జీతరువాత ఆంటోనియోని పిలిచారు. అతడు కూడా వెంటనే జవాబిచ్చాడు.

"శాన్ రాకోకీ జయ్!"

ఈ సమాధానంకూడా అసంతృప్తికరంగానే వుంది.

"తల బిరుసులో జేర్పు"

"ఎవరు వర్ధిల్లాలి?' అని సిపోలాని ప్రశ్నించారు.

"క్షమించండి. అయ్యా! కాని మీ వుద్దేశ్యం యేమిటో నా కర్థం అవడం లేదు" అని సాహసించి ప్రశ్నించాడు.

"ని మనస్సులో యేం వుందో స్పష్టముగా చెప్పు. ఎవ్వరు వర్ధిల్లాలి?" అని ఆ బాడ్జ వుద్యోగిస్థుడు అడిగాడు.

"కొర్ట్సి, సారాయిలు వర్ధిల్లాలి?" అని సిపోలా సమాధానం యిచ్చాడు. ఈసమాధానంచాలా గంభీరమైన భావంతోసవ్యం గావున్నట్టు మాకుతోచింది. కాని అతనినికూడా తల బిరుసులో జేర్పు.

ఈ ప్రశ్నకి అర్థంయేమిటో మాకెవ్వరికీబోధపడ లేదు. మేము తప్పుడు సమాధానం యిస్తే, యేమైనా చెల్లించవలసి వుంటుందేమో అనే భయపడసాగాము. 'తలబిరుసు'లో 'జేర్పమంటే మా కర్థంకావడం లేదు. కాని, "చెల్లించండి" అంటేమాత్రం బాగా బోధపడుతుంది.

మా అందరిలోనూ, పెద్ద చదువు చదువుకుని చిన్నతనంలో ఒకసారి నేపుల్సుపట్టణం వెళ్లివచ్చిన బాల్డిసేరా సేనాసిదగ్గర జేరాను. అతడు తనకిమాత్రమే సత్యం బోధపడినట్లు, దానిని పైకి వెల్లడించ లేనట్లు అర్థం గోచరించే మందహాసంచేశాడు. "ఎవ్వరు వర్ధిల్లాలి? అని బాల్డిస్సేరాని అడుగగానే, టోపీని తీసి "మార్గరెట్టా మహారాణికీ జయ్! అన్నాడు.

బాల్డిస్సెరా అనుకున్నదానికి వ్యతిరేక ఫలితం కలిగింది. తీవ్రవాదులైన సైనికులందరూ కసుపు [illegible] చ్చారు. ఆ పొట్టి అధికారి "ఆమె చనిపోయింది. మా[illegible] మహారాణి స్వర్గం అలంకరించింది" అన్నారు.

—క్లెమెంటైన్ విధానవాది, అని [illegible]." అని వృద్యోగస్తుడు చెప్పాడు.

ఆజ్ఞా సూచకంగా బుర్రపూపుతో బాల్డిస్సెరా వెళ్లిపోయాడు.

పెరాల్టో ప్రశ దేశాన్ని అనుసరించి ఆంటోనియాజప్పు [illegible] రాగానే

"బందిపోటు దొంగలు నాశనం అవ్వాలి!" అని గట్టిగా అన్నాడు.

ఈ సమాధానం నల్ల దుస్తుల సైనికులకి తీవ్రమైన కోపం కలిగించింది. కొందరు మెల్లిగా తిట్టారు.

అరాచకవాదుల్లో ఆంటోనియా జమకట్టబడ్డాడు.

"కాడీలు నాశనం అవ్వాలి" అంటూ స్పాలెంటా సమాధానం యిచ్చాడు. నల్లని దుస్తుల సైనికులకి యీ జవాబు చాలా కోపావేశాన్ని కలిగించింది. అతనిని కూడా అరాచకవాదులలో జమచేశారు.

"ఎవ్వరు వదిల్లాలి?" అంటూ ఆ లావుపాటి అధికారి అడిగాడు. క్రోస్ కూడా పెరాల్డో శిష్యుడే.

"పన్నులు నాశనం అవ్వాలి!" అని అతని సమాధానం.

ఈ సమాధానానికి ఆ సైనికులు కోపగించలేదు. అతణ్ణికూడా అరాచకవాదులలో చేర్చారు.

ఆ న్యాయప్రతినిధి ముఖంలో ముఖంపెట్టి "పన్నులు చెల్లించే ప్రజలందరూ నాశనంఅవ్వాలి!" అంటూ రాఫేల్ గట్టిగా అరిచాడు. సైనికులలో చాలా గందరగోళం బయలుదేరింది. ఆ ఉద్యోగస్థుడు ఆతనిని పట్టుకొని బంధిద్దామని అనుకున్నాడు కాని, ఈలోపుగానే రాఫేల్ ఆ వ్యూహం దాటి చీకట్లో మాయమయ్యాడు.

తరువాత వచ్చిన కొద్దిమంది చాలా జాగ్రత్తపరులు.

"అందరూ వర్ధిల్లాలి అంటూ లోసర్డో జవాబిచ్చాడు. కాని దానిని యెవ్వరూ హర్షించలేదు. ఆతడు ఉదారవాదులలో చేర్చబడ్డాడు.

"ప్రభుత్వం వర్ధిల్లాలి!" అని ఉలీవా అన్నాడు. చాలా మంచితనంతో.

"ఏ ప్రభుత్వం?" అని ఫిలిప్పో ప్రశ్నించాడు.

"న్యాయసమ్మతమైన ప్రభుత్వం, అని ఉలీవా సమాధానం. అతనిని ప్రభుత్వద్రోహులలో జమచేశారు.

పిలాటో కూడా చాల తెలివితేటలుగా సమాధానం చెబుదామనుకున్నాడు. "ప్రభుత్వం వర్ధిల్లాలి!"

"ఏ ప్రభుత్వం?"

"న్యాయవిరుద్ధమైన ప్రభుత్వం!

ఆతణ్ణి దోషులపట్టికలో చేర్చారు.

ఇంతవరకూ యెవ్వరికీ సరియైన సమాధానం దొరకలేదు.

తప్పుడు సమాధానాల సంఖ్య పెరిగిపోతున్నకొద్దీ, సరియైన సమాధానాల సంఖ్య తరిగిపోతోంది. ఈ విధంగా తప్పు జవాబు లివ్వడంమూలాన్ని, యేదైనా కొత్తపన్ను యిచ్చుకోవాలా? అనేదే మమ్మల్ని బాధిస్తోన్న పెద్ద ప్రశ్న.

ఏభయమూ లేకుండా, యీ ప్రశ్నలు, సమాధానాలు విని ఆనందిస్తోన్నది ఒక్క బెరార్డోయే. తన అనుచరులకి "ఫలానిది వర్ధిల్లాలి!" అని కాకుండా "ఫలానిది నశించాలి!" అంటూ తిరస్కార సూచకమైన సమాధానాలు చెప్పి పంపుతున్నాడు.

"బ్యాంకి నశించాలి!" అన్నాడు శాంటో.

"ఏ బ్యాంకు?" అని ఫిలిప్పో అడిగాడు.

"ఉన్నదే ఒక్క బ్యాంకు. ఆ బ్యాంకే కంట్రాక్టర్లకి డబ్బిస్తోంది. అదే నశించాలి" అని శాంటో ధైర్యంగా సమాధాన మిచ్చాడు.

"కమ్యూనిస్టులలో వెయ్యి, వీడిపేరు" అన్నాడు పోట్టి అధికారి.

"టార్లోనియా ప్రభువు నశించాలి!" అన్నందుకు గాస్పరోన్ని కూడా కమ్యూనిష్టుల పట్టికలో యెక్కించారు.

"బీదవాళ్లు వర్ధిల్లాలి!" అన్నందుకుగాను పాలమ్మోని సోషలిష్టులలో జేర్చారు.

ఈ సమయానికే, ఆ వ్యూహం అవతలివైపునుంచి బేరార్డో అమ్మగారు వచ్చింది.

"బెరార్డో! బెరార్డో! బెరార్డో యెక్కడున్నాడు నాయనా!" అంటూ ఆమె యేడుస్తోంది. "ఈపోకిరీ వెధవలు మన కొంపలుకూల్చేశారురా నాయనా? మన ఆడవాళ్ళని యెంతబాధలు పెట్టారురా? మన మొగాళ్ళని యేంచేస్తారురా? బెరార్డో, యేరిరా మన మొగాళ్లు? బెరార్డో!"

బెరార్డోవెంటనే అర్థంచేసుకున్నాడు. కనీసం అర్థంచేసుకున్నట్లయినా నటించాడు. ఒక్కదూకు దూకి, ఫిలిప్పో గొంతుక పట్టుకున్నాడు. గట్టిగాప్రాపుతో "ఎల్వీరా యెక్కడుందిరా? ఎల్వీరానియేంచేశావురా? అంటూపళ్లు కొరుకుతో అడిగాడు. ఆ ముసిలమ్మ చర్చి దగ్గర మోకరిల్లి "తల్లీ! మేరీ మాతా! మమ్మల్ని రక్షించు! మాకు అడ్డంపడు" అని ప్రార్థిస్తోంది.

ఆమె యింకా ప్రార్థిస్తోవుండగానే, ధణ్ మని చర్చిగంట మోగింది. మేమందరం చర్చిగోపురంవైపు చూశాం.

ఆ చర్చిగోపురంమీద, పొడుగ్గా బక్క పలాచగావున్న ఒక యువతి ప్రేతం కనపడింది. ఆ పిశాచంయొక్క ముఖం వివర్ణమైవుంది. స్థంభానికి చేతుల నాన్చుకొని ఒరిగి నిలబడి వుంది.

ఈ దృశ్యం మాఅందరికీ హడలుపుట్టించింది. కొద్దిక్షణాలలో ఆ దృశ్యం మాయమైంది.

"ఆమె లోకమాత, మేరీ. మేరీమాత !" అంటూ కంపించిపోతో ఫిలిప్పో అన్నాడు.

"మేరీమాత ! మహాశక్తి ! మేరీతల్లి !" అంటూ తక్కిన సైనికులుకూడ అరవనారంభించారు.

మేరీమాత ! మేరీమాత !

నలుచదరంగావున్న ఆవ్యూహం కలిగిపోయింది. లారీలదగ్గరికి సైనికులు ప్రాణభయంతో పరుగెత్తారు.

ఆ లారీలని బయలుదేరదీసే చప్పుడు వినపడింది. ఆ కొండ కిందికి లారీలు మహావేగంతో పరుగెత్తుతున్నాయి.

కొండదిగిన తరువాత, హైరోడ్డులోకి మళ్ళేముందు, ఆ లారీ పరివారం హఠాత్తుగా ఆగింది, ఒక అరగంటవరకూ వాళ్ళు మళ్ళీ కదలనే లేదు.

''ఎందుకు ఆగారంటావ్? మళ్ళీ వెనక్కి వస్తారా? అని నేను బెరార్డో ని అడిగాను.

''దానికి కారణం రాఫేల్ కి తెలుస్తుంది'' అంటో బెరార్డో నవ్వాడు.

మళ్ళీ ఆ లారీలు బయల్దేరేటప్పటికి చాలా ప్రొద్దుపోయింది. ''పోయి పడుకుందామా, లేకపోతే మరొక గంట యిల్లాగే కాలక్షేపంచేసి పొలాలు వెళ్ళిపోదామా?'' అని అడిగాను. ''ఆ చర్చిగోపురం యెక్కి అక్కడ యెవ్వరున్నారో, మొట్ట మొదట చూడాలి'' అన్నాడు బెరార్డో.

బెరార్డోకి మేరీ మాతలో నమ్మకంలేదు కాని, భూతాల్లో నమ్మకంవుంది. నిజంగా భూతం అంటే నమ్మేవుండేవాడు కాని, మేరీమాత అనగానే వెతుకుదాం, పద అన్నాడు.

ఆ గోపురం యెక్కాం. అక్కడ నాభార్య, ఎల్వీరా ప్రాణాలు లేనట్లు పడివున్నారు.

(ముందువచ్చే లారీ దారిలో అడ్డంగా పడివున్న చెట్టు మొంగకి తగిలి బోల్తాపడిందని, అందుచేతనే లారీలన్నీ ఆగిపోయాయని మరుసటి వుదయం మాకు తెలిసింది. మొదటి లారీలోవున్న అనేకమందికి చిన్నచిన్న గాయాలు తగిలాయి. ఆ పొట్టి, బొజ్జ సేనాని వుండ్రడముక్కలాగు రోడ్డుప్రక్క గోతుల్లోకి దొర్లుకొని పోయాడట.)

౬

ఆ రాత్రి జరిగిన దారుణాలవలన ఎల్వీరా మంచంయెక్కింది.

అంతక్రితంరోజుననే ఒకరు నేసి, రంగులు వేసేందుకుగాను కొంతవూలు పంపించారు. మా ప్రాంతాలలో నేతపనిచాల పడిపోయింది. ఇంకా పనిచేస్తోన్నకొద్ది మగ్గాలలో ఎల్వీరాది ఒకటి. పని చాలాతక్కువగా దొరుకుతోంది. నేసేందుకు, రంగులువేసేందుకు వూలు యెప్పుడోగాని రావడంలేదు. శతాబ్దాల తరబడిని పనిచేసిన మగ్గాలని, చుట్టుప్రక్కలవూళ్లో పెద్దపెద్ద మంటలలో దహనంచేశారు. ఈ వృత్తిని చంపేందుకు అనేక కారణాలున్నాయి. గొర్రెల మందలు మా ప్రాంతాలలో మాయమవడం, పట్టణాలలో తయారౌతోన్న వూలుతో నేసిన వస్తువుల్ని అందరూ వాడడం, అన్నిటికంటె ముఖ్యంగా అత్యధికంగా పెరిగిపోతోన్న రైతుల దారిద్ర్యం.

వంటచెరకుని కొట్టిపెట్టమని ఎల్వీరా అడిగింది. బెరార్డో సంతోషంతో ఒప్పుకున్నాడు. పనిచేసినందుకు యేమీ

పబ్బతీపికోసం లేదు. ఒక పుల్లలుకొయ్య పెట్టడమే కాకుండా, ఎస్తేరా చెబుతోంటే నేస్తో అష్టకం పఠకాడా చేస్తున్నాడు.

ఎస్తేరా ఒక మూలాలని గడ్డి పరుపుమీద పడుకొని వుంటుంది. ఆమె యింకా ఆ రాత్రి దెబ్బనుంచి తేరుకోలేదు. పాలిపోయిన ఆమె ముఖం, మరీ లక్షణీయంగా వుంది. పలాకీలాగవున్న ఆమె నాజూకు దేహం, గుండ్రటివదనమూ, నల్లటికురులూ, నల్లటి కండ్లూ యెంతో అందంగావున్నాయి. ఆమె అస్తూ పస్తూ వుంటుంది. కొత్త విషయాలు నేర్చుకుంటోన్నా బుద్ధిమంతుడైన కుర్రాడికి మల్లే బెరార్డో ఆ ఆజ్ఞలన్నీ నెరవేరుస్తాడు. అప్పుడప్పుడు, పచ్చగావుండే గుడ్డను నీలిమందులో ముంచగానే ముదురునీలవర్ణపు గుడ్డలా యెందుకు మారుతుంది అనీ, యిల్లాంటివే మరికొన్ని ప్రశ్నలు వేస్తోంటాడు. ఆమె కేమీ సమాధానం తోచక కళ్ళ రెప్పలు ఆడిస్తో కూర్చుంటూ వుంటుంది.

“అది అల్లాగె అవుతుంది” అని సమాధానం చెబుతుంది.

“ఎందుచేత ఔతుంది, అనే నేనడుగుతోన్నది” అంటాడు బెరార్డో.

“అల్లాగ అవక తప్పదు, కనుక” అని చెప్పి ఆమె యీ పోటీ ప్రశ్న వేస్తుంది.

“ములగచెట్టు ఉల్లిపాయల్ని యెందుకు కాయదు?”

“అబ్బే అల్లాంటి వేళాకోళాలు చెయ్యకు. మనం నిజంగా ములగచెట్టు వేస్తే, అది వుల్లిపాయల్ని యెందుకు కాస్తుంది?” అని జవాబిస్తాడు.

నేను ఎల్వీరా యింటికి వెళ్లినప్పుడల్లా, బానలలో గుడ్డల్ని వుడకబెడుతున్న బెరార్డో కనబడేవాడు.

ఒక రాత్రి నా సమక్షంలో ఎల్వీరా కొద్దిడబ్బు తీసుకోమ్మని బెరార్డోని బలవంత పెట్టింది. కాని, బెరార్డో మాత్రం అంగీకరించలేదు.

"బెరార్డో యెందుకు డబ్బుతీసికోవడంలేదో, తెలుసునా? లోపల ఒకవుద్దేశ్యంవుంది. ఆ డబ్బుని పెళ్లిఖర్చులకు నిలవెయ్యాలని అతని కోరిక" అన్నాను మందహాసంచేస్తూ.

ఎల్వీరా ముఖం సిగ్గుతో యెర్రబడింది. నన్ను కొట్టేట్లు వుడుముతో బెరార్డో నావైపు చూశాడు.

మరుసటిరోజు వుదయాన్ని బెరార్డో అమ్మమ్మ మా యింటికి వచ్చి "నాయనా మా బెరార్డో నీకు యీ వేళ కనబడ్డాడా?" అని అడిగింది.

"ఏమిటి? రాత్రి యింటికి రాలేదూ?" అని నే నాశ్చర్యపడుతో అడిగాను.

"రాలేదు నాయనా, రాలేదు" అని చెప్పి ఆ ముసలమ్మ వెళ్లి పోయింది.

కొంచంసేపు తర్వాత, బెరార్డోవచ్చి పలకరించకుండా మా ద్వారం దగ్గర నిలబడ్డాడు. నేనూ యేమీ మాట్లాడించలేదు. పొలం వెడదామని యివతలకి రాగానే "నాకు సలహా చెప్పాలి" అన్నాడు.

ఆ మనిషి జీవితంలో యితరులని సలహాకోరడానికి యిదే ప్రథమ పర్యాయం.

"నా వివాహవిషయంలో నిన్నను రాత్రి నువ్వు అన్నప్పుడు ఆవిషయం అంత జరూరుకాదు. ఇప్పుడు అది వెంటనే జరిగిపోవాలి''.

గతరాత్రి ఆమెతో గడిపాడని నేను గ్రహించాను.

"నువ్వు వెంటనే తొందరపడి వివాహంచేసుకోవడం చాలా మంచిదని నా సలహా! పెళ్ళిచేసుకున్నందువల్ల లాభమేగాని. నష్టమేమీ లేదు'' అని చెప్పాను. ఆమెకంటె నీకు మంచి భార్య దొరకదు.

"నీకు అర్థం కావడంలేదు. ఆ అమ్మాయికంటె నాకు మంచి సంబంధం దొరుకుతుందని నే నెప్పుడూ ఆశించలేదు. నా జన్మలో నే నితరులను కోరను. ఐతే, నాస్థితి యేమిటి? కన్నంలేని అడవియెలుకలాంటి వాణ్ణి. నాకు సెంటుభూమి కూడా లేదు. ఒకవేళ ఆస్థిపాస్తుల్లేని మోడులాగున్న నన్ను ఎల్వీరా పెళ్లిచేసుకునేందుకు సిద్ధపడినా, నాకైనా కొంచం విచక్షణశక్తి వుండాలా అక్కర్లేదా? నేనూ, మాఅమ్మమ్మ మాడి చచ్చిపోయామంటే హాని యేమీలేదు. ఎల్వీరాని యింట్లోపెట్టుకుని పనుల్లేని రోజులలో యెలాగు పస్తులు పడు కోవడం? ఒక మగవాడు, ఒకరోజు ఒక రైతుదగ్గరకి, మరొక రోజు మరొక ఖామందుదగ్గరకి కూలిపనికి వెళ్ళడంలో నీచం లేదు. కాని ఎల్వీరాని పెళ్లిచేసుకున్న తరువాత ఆ మొగుడు కూలిపనికి వెళ్లడం తలగొట్టుకున్నట్టు వుండదు? ఎల్వీరా మొగుడు భూమిలేని మొరటు నిర్భాగ్య దామోదరుడి క్రింద వుండిపోవలసిందేనా?''

"ఇవంతా ముందే యెందుకు ఆలోచించకపోయినావ్? ఆమెతో గడిపేముందే నువ్వు యెందుకు ఆలోచించలేదు" అన్నాను.

"నేను బాధపడలేదు. ఎల్వీరాని పెళ్ళి చేసుకోకూడదని కాదు నావుద్దేశ్యం. ఇంకొకరెవరైనా ఆమెని వివాహం చేసుకోసిద్ధామని కాదు."

ఇల్లాగే సాగాయి బెరార్డో వితండవాదాలు. ఒకరోజంతా వాదించినా చివరకి యే నిర్ణయానికీ రాలేము.

కాని యీ సారిమాత్రం, యీవిషయం చాలా స్పష్టంగా కనబడుతోంది. అందుచేత ఒకే ఒక ప్రశ్నతో తేల్చుకుందామని అనుకున్నాను.

"ఎల్వీరాని పెళ్ళిచేసుకుంటావా?" చేసుకోవా?

"నీకింత క్రితం యెప్పుడూ అర్థం అవలేదు. నీజీవితంలో నీకర్థం కాదు." అంటూ బెరార్డో విసవిసా నడిచి వెళ్ళిపోయాడు.

బెరార్డో మానసికంగా చాలా బాధపడుతోన్నట్లు కనబడుతున్నాడు. కొంటుభూమికూడా లేకపోవడం యీ వ్యధకి మూలకారణం. ఇంతవరకూ, చొప్పకట్ల ప్రశ్నల్తోటీ, వితండ వాదాలతోటీ, యీ సమస్యని కప్పిపుచ్చాడు. కాని వివాహంచేసుకోని, గృహస్థు జీవితంగడపవలసిరావడంతోటే యీ విషయాన్ని కప్పిపుచ్చ లేకపోయాడు.

ఫాంటమారాలోనూ, చుట్టుపక్కల గ్రామాలలోనూ వున్న వాళ్లల్లో అధిక భాగానికి కొద్ది భూప్రతులయినా వున్నాయి,

లేక రెండుమూడెకరాలు మగత్తాకైనా చేసుకుంటూ వుంటారు. భూమి అసలు లేనివాళ్ల సంఖ్య చాల తక్కువ. భూమిలేని వ్యవసాయకూలీని అందరూ చాలా నీచకంగా చూస్తారు. అతను రోజురోజుకీ వృత్తి మార్చుకోవలసివస్తుంది. ఈమధ్య కొద్దియేళ్లనుంచీ అతనికూలి మరీ తగ్గిపోయింది. కాలం చాలా చౌకగా దొరికే రోజుల్లో, స్వంతభూమి లేని వ్యవసాయదారుడు వ్యవసాయకూలి, వట్టి పామరిపోతు, నిరక్షరకుక్షి పరమ మూర్ఖుడు నిర్భాగ్యవానిమాదనుక్రింద పరిగణింపబడేవాడు. నిజానికికూడా యీ కూలీలలోచాలా మంది అల్లాగే వుండేవారు. కాని యీ కొద్దియేళ్లలో, పరిస్థితులు తారుమారయ్యాయి. ఒకటి రెండు యెకరాలున్న, చిన్న రైతులు కొత్తగా భూములిన్ని కొనుక్కో లేకపోతున్నారు. వ్యవసాయకూలీలు ఒక్క సెంటుభూమికూడా సంపాదించలేక పోతున్నారు. తద్వ్యతిరేకంగా, చిన్నరైతులు పెట్టుబడుల నిమిత్తం, తదితర అవసరాలకీ చేసిన అప్పులకిగాను వారి భూములు ఋణదాతలకి దఖలుపడిపోతున్నాయి. భాగ్యవంతులైన రైతులుకూడా చిన్న రైతులైపోతున్నారు. బెరార్డోనిగూర్చి యెవరేమి అనుకున్నా శీలంలోనూ, తెలివితేటలలోనూ ఫాంటమారాలోని అందరికంటె అధికుడని ఒప్పుకుని తీరాలి. అతను భూమిని కొనేటంత నిలవ చేయలేక పోవటానికి కాలం మారిపోవడమే కారణం. ఫాంటమారా యువకులు చాలామంది యీ స్థితిలోనే వున్నారు.

కాలం మారిపోయినప్పటికీ, ప్రజ లింకా పూర్వంమాదిరిగానే ఆలోచిస్తున్నారు. స్వంతభూమి లేని రైతుని తక్కువగా

చూస్తున్నారు. అమెరికాయో, ఇటలీలో మరో ప్రదేశానికో వెళ్ళి నాలుగురాళ్లు సంపాదించాలనే ఆశ బెరార్డోకి అమితంగా వుంది. తక్కిన రైతులకంటె తన స్థితి చాలా తక్కువగా వుందనే భావంతో చాలా సిగ్గుపడేవాడు. వేరుమార్గంకూడా కనపడటంలేదు.

పట్టణాలలోని కూలీల పరిస్థితు లెట్లావున్నాయో, మాకు ఆకస్మికంగా ఒక రోజున తెలిశాయి.

ఒకరాత్రి చర్చి ప్రాంగణంలోకి ఒక ముసలి మనిషి వగర్చు కుంటూ వచ్చాడు. నడుం వంగిపోయింది. బాగా చిక్కిపోయి వున్నాడు. పట్టణవాసివలె లేడు. పల్లెటూరి రైతువలె లేడు. వేసుకున్న బట్టల్నిబట్టి, యెక్కడివాడో గుర్తించడం చాలా కష్టం. పోనీ, పట్టణపు దుస్తులు వేసుకున్న పల్లెటూరి మనిషిలాగూకూడా కనపడటంలేదు. ఒకసంచి భుజంమీద వేళ్ళాడుతోంది. రోగాలతో బాధపడేవాళ్లకి, వనమూలిక లిస్తో, దిష్టికొట్టీ, దెయ్యాలు పట్టుకునీ బాధపడేస్త్రీలకి యంత్రాలువేసి, పూజలుచేస్తో పంటయెల్లాపండేది చెబుతో గ్రామాలవెంట తిరుగుతోంటే సాధువని మేము అనుకున్నాం.

ఆ సాధువు తన దుకాణం దగ్గరనుంచి వెడుతోంటే, యెవరో తెలుసుకోవాలనే కుతూహలంతో బాల్డిస్సేరా, సోర్స నారాని, జోంపాని, బెరార్డొని నన్నూ పిలుచుకొనివచ్చాడు. "అయ్యా, తమ రెక్కడనుంచి వస్తున్నారు? ఏయే విద్యల్లో మీకు ప్రవీణతవుంది?" అని యెక్కువ కుతూహలంతో బాల్డిస్సేరా సేనాని అడిగాడు.

ఆ దేవాలయ ఆవరణమధ్యకి వెళ్లి చంకలోని సంచీని కింద పెట్టి, కూర్చున్నాడు.

"ఎవరూ వాళ్ల దేశంలో ప్రవక్త లవలేరు, ప్రసిద్ధిగవ్వాకికూడా మారరు" అన్నాడు.

దాని అర్థం మాకు బోధపడలేదు.

ఆ ముసలి ఆయన చాలా విలక్షణంగా వున్నాడు. కుర్రవాని తలవలె చాలా చిన్నతల. చెమ్మగిల్లుతోండే కళ్లు, పొడుగైన పూర్వకాలపు పెద్ద మీసాలు, పెద్ద బొ్రమ్ములు, వుచ్చు కాయలాంటి టోపీ పెట్టుకున్నాడు. ముఖమలు కాలుస కోటు తొడుక్కున్నాడు. రెండు వరసలు తళతళలాడే బొత్తాములు వున్నాయి. సైనికుల లాగువంటి బూడిద వర్ణపు లాగు తొడుక్కున్నాడు.

"చెయ్యిచూసి చెప్పండి; కాని ఒక్కపైసాకూడా ఇవ్వలేను సుమండీ" అని మిచీలీ అన్నాడు.

"ఒక్కక్షణం ఆగవయ్యా! ముందు గొరియానోని వెళ్ళి పిలుచుకురా" అని ఆ ముసలాయన అన్నాడు.

"ఆమె మన్నా, మశానం స్మశానంలో దొరుకుతాయి" అన్నాడు మిచీలీ, ఆ ముసలాడి జ్యోతిషం ఆరంభంలోనే తప్పినందుకు మేము కడుపు వుబ్బేట్లా నవ్వుతున్నాము.

"ఆవిడ చచ్చిపోతే, బెరార్డా గొరియానోని తీసుకురండి" అన్నాడు ఆ కుహనాజ్యోతిష్కుడు.

"గొరియానోకూడా చచ్చిపోయాడు. చాలా కాలంఅయింది" అని సోర్సనారా జవాబుచెప్పింది.

"ఐతే పెప్పినో కూడా చచ్చిపోయాడా?" అంటూ కోపంగా ఆ నూతన వ్యక్తి అన్నాడు.

ఈ సమస్యమీద అభిప్రాయాలు భేదించాయి. చిన్నతనంలో అతనితో ప్రేమవ్యవహారం జరిపిన సోర్సనారా, పెప్పినో రోమ్‌నగరం వెళ్ళి అక్కడే చనిపోయాడని అంది. పెప్పినో రోమ్‌లో ఒక భాగ్యవంతురాలిని వివాహం చేసుకొని అక్కడే వుండిపోయి, ఆతని స్వగ్రామాన్ని మరిచిపోయాడని బాల్డిస్సెరా సేనాని గట్టిగా వాదించాడు.

"సరే, ఐతే వినండి, పెప్పినో విషయంలో జరిగిన కథ వున్నదున్నట్టుగా చెబుతాను" అని ఆ వృత్తాంతాన్ని చెప్పనారంభించాడు.

"హంబర్టురాజు హత్యజరిగిన సంవత్సరాన్ని ఫాంటమారాని వదిలిపెట్టి పెప్పినో రోమ్‌నగరం వెళ్ళాడు. ఎన్నియేళ్ళై వుంటుంది. హంబర్టురాజు చచ్చిపోయిన యేడునుంచి ట్రిపోలీ యుద్ధం అయ్యాక తోకచుక్క పొడిచినంతవరకు పదేళ్ళైంది. తోకచుక్క దగ్గరనుంచి, ట్రీష్టియుద్ధంవరకు ఐదేళ్లు. మొత్తం పదిహేను యేళ్లు. ఆయుద్ధం నాలుగైదేళ్లు జరిగింది. అంటే అప్పటికి యిరవై అన్నమాట. ఆతర్వాత నాలుగైదేళ్లు కార్మికసంఘాలు అధికారంలో వున్నాయి. అప్పటికి యిరవై ఐదేళ్లు. ఆపైని పదేళ్ళపాటు నిరంకుశప్రభుత్వం జరిగింది. మొత్తం యిప్పటికి ముప్పైఐదేళ్లు జరిగింది.

ముప్పైఐదేళ్లక్రితం పెప్పినో రోమ్‌నగరానికి నాలుగురాళ్ళు సంపాదించుకుందామనీ, అటుతర్వాత ఫాంటమారా తిరిగి

వచ్చి ఆసమయానికి పదహారేళ్ళ పడుచుపిల్ల అయిన సోర్నవారాని పెళ్ళిచేసు......"

"నేనే ఆపిల్లని" అంటూ సిగ్గుపడింది సోర్నవారా.

"అసంభవం!" అంటూ ఆ దైవజ్ఞుడు ఆమెను ఆపాదమస్తకము పరీక్షించాడు.

ఇప్పుడే సోర్నవారా అని మేము సాక్ష్యం చెప్పాము. ఆ దైవజ్ఞుడు కొన్నిక్షణాలు చింతానిమగ్నుడై ఆతర్వాత సంభాషణను సాగించాడు.

"బోస్టనునగరంవెళ్ళేముందు పెప్పినో రెండేళ్ళలో కొంచెండబ్బు నిలవచేసి, ఫాంటమారా వచ్చేద్దామనుకున్నాడు. ఒక ధర్మశాలలో చేరి కప్పులు కడుగుతోండేవాడు. కాని ఆ రెండేళ్ళలో ఒక్కపైసాకూడా వెనకవెయ్యలేకపోయాడు. రోజుకు పద్నాలుగు గంటలు పనిచేసినా కడుపునిండా తిండికీ, పడుకునేందుకు ప్రదేశానికీ తప్పితే, తాగేందుకుకూడా సరిపోయేనంత జీతం దొరకలేదు. ఆ ధర్మశాలాధికారులైన క్రీస్తుమతగురువులు, తమ పనివారు త్రాగి చెడిపోకూడదని శాసించేవారు. కాని ఆగురువులే ఒకగదిలో సారాయి మొదలయిన రకరకాల మద్యాలని దాచి, రహస్యంగా తాగుతోండేవారు. ఆగదిలోనే పెప్పినో పనిచేస్తోండేవాడు. రెండేళ్ళ తరువాత ఆమతబోధకులు సారాయిసీసాల్లో కొద్దికొద్దిగా హరించిపోతోండటం చూసి పెప్పినోని అవతలికి గెంటివేశారు. ఆతరువాత కొన్నినెలలపాటు అతనికేమీ నౌకరీ లేదు. పనిచేసినరోజున దొరికిన నాలుగుడబ్బులూ గొంతుక

తడుపుకునేందుకు సరిపోయేవికావు. ఒకరాత్రి ఒకతోటలో పడుకునివుండగా శాకారాకో కలలో కనిపించి, ఆతోటకి దగ్గరగా వున్న ఒక కిరాణాదుకాణంలో ప్రవేశించే మార్గం వుపదేశించాడు. ఆతక్షణమే పెప్పినో నిద్రనుంచి లేచి, ఆ దుకాణం దగ్గిరకి పరుగెత్తాడు. కాని పోలీసులు ఆతణ్ణి పట్టుకుని యెనిమిదినెలలు కారాగృహవాసశిక్ష విధించారు. విచారణ జరిగేకాలంలో శాకారాకో విషయం పెప్పినో చెప్పినా జడ్జీ పెడచెవినిపెట్టి శిక్ష విధించాడు.

కాని ఖైదులో అదృష్టం పండింది. ఆతనికి కళ్లజబ్బువచ్చింది. మొదట ఒక తెల్లటి చిక్కని ద్రావకం కారేది; తరువాత కళ్ళువాచి, చింతనిప్పుల్లాగు అయ్యాయి. ఆతణ్ణిచూచే ప్రతి వాడికీ చాల జాలికలిగేది. ఆతని కళ్లసితినిబట్టి, వెంటనే విడుదలచెయ్యాబడ్డాడు. ఆ తక్షణమే ఒక ముష్టివాడి కూతురిని నెలకి కొంత డబ్బిచ్చేందుకు కుదుర్చుకొని, అన్ని చర్చిలకూ వెళ్లి భిక్షాటనం ఆరంభించాడు. మధ్యాహ్న భోజన సమయానికి కొన్ని మఠాలకు వెళ్లి కడుపు నింపుకుంటోవుండేవాడు. సాయంకాలం అయ్యేటప్పుడికి నాటకశాలదగ్గర, సినీమాలవద్ద హాజరై, నలుగురు ధర్మాత్ములను చూచుకునేవాడు. ఆముష్టిపిల్లకి యివ్వవలసింది పోగా, కొద్దిగా నిలవేస్తుండేవాడు. భోజనంవిషయంలో తడుపుకోనక్కరలేకపోయేది. కావలసినదానికంటె మిగిలిన ఆహారాన్ని మరికొందరు కూలివాళ్లకు అమ్మి ఆడబ్బుతో కొద్దిగా తాగుతోండేవాడు. ఆ విధంగానే భైక్షుకవృత్తిని రెండేళ్లవరకూ సాగించి, కొంత

డబ్బు నిలవేసి, ఫౌంటమూరా వచ్చి, సోర్సనారాని పెళ్లిచేసు కుందామనుకున్నాడు... ..."

"మరి యెందుకు రాలేదు" అని సోర్సనారా నిట్టూర్పు విడిచింది.

"అసూయ, అసూయ అతని మార్గానికి అడ్డువచ్చింది. అతని దురదృష్టవశాత్తూ, ఒకపోలీసు ఆతనిని చూసి ఒక ధ్వాంక్షసు పత్రికి కళ్లు బాగుచేయించేందుకు లాక్కునివెళ్ళాడు. పెప్పినో అనేక విధాల మొరబెట్టాడు. "ఆకళ్ళు నావి. నాకళ్లతో నాయిష్టంవచ్చినట్లు చేసుకుంటాను." అంటూ తప్పించుకునేందుకు చూశాడు. కాని యీ ఇటలీలో యెప్పుడూ నిజమైన స్వాతంత్ర్యంలేదు. అతని కళ్ళు కొద్దిరోజుల్లోనే బాగు పడ్డాయి. కాని అతని వృత్తిమాత్రంపోయింది. పుష్కలంగా చేతికి డబ్బుచిక్కుతోండే ఆనందకరమైన రోజులు కాసిసీ పోయి, కరువురోజులు వచ్చాయి. ఇటికలు చెయ్యడం, కాల్చడం యింకా యెన్నో యెన్నో పనులుచేశాడు. కాని యే ఒక్కపనీకూడా వారంరోజులకంటె యెక్కువ చెయ్య లేదు. అతనికి యిచ్ఛ వున్నప్పుడు సత్తువ వుండేదికాదు. సత్తువ వున్నప్పుడు యిచ్ఛవుండేదికాదు. కొంత ధనం సంపా దించాలని వెయ్యివృత్తులు అవలంబించాడు.

"ఆరోజుల్లో దేశం నలుమూలలనుంచీ వందలకొద్దీ మను ష్యులు ధనార్జనకోసం రోమ్‌నగరం వస్తూండేవాళ్ళు. ఎక్కువ ఆశలేనివాళ్లకి యే పాకీపనో, బూట్లు తుడవడమో, తోట మాలిపనో, గుర్రాలను మేపే పనో దొరికేది. పొదుపుగా

వాడుకుంటూ, రెండు డబ్బులు నిలవ చేసుకోటానికి చూసేవారు. కాని, పదేళ్ళపాటు కష్టపడి యే నాలుగైదువందల రూపాయలో నిలవ వేసుకోనేందుకు, కావలసిన ఓపిక పెప్పినోకి లేక పోయింది. ఒక్కరోజుననే ఒక బంగారుపాతు దొరకాలని వుండేది. దానికి బదులు తరచుగా కారాగృహవాసం లభిస్తూండేది. మొత్తంమీద నాలుగేళ్ళఅయిదుమాసాలు జైలులో గడిపాడు.

"ఈ దురదృష్టాల తరువాత అతనికి మనోనిబ్బరం చెడి పోయి యెంత నీచపు పని అయినాసరే చెయ్యాలని ఆరంభించాడు. ఒక చిలకని తీసుకొని దానిచేత అదృష్టాలు యిచ్చేవాళ్ళందరి అదృష్టం, దురదృష్టం వ్రాయబడినవుండే చీటిముక్కలని తీయించేవాడు. కాని, కొన్ని నెలల తరువాత ఆచిలక్కి మనస్సు చలించి చనిపోయింది. పల్లెటూళ్ళనుంచి యెవరికీ తెలియకుండా వస్తూవుండే కూలీలదగ్గర కొద్దిగా కమీషను తీసికొని వారికి పనులు చూపిస్తూ కొంతకాలం వుండేవాడు.

ఆ రోజుల్లో పెప్పినోకి కాలోగిరి అనే ఆయన పరిచయం కలిగింది. ఆయనకి చాల చిన్నతనంలోనే విపరీతంగా సుఖరోగాలు పట్టుకున్నాయి. అందుచేత పల్లెటూరి బీదరైతుల పిల్లలని తరుచు పాడుచేసి ఆబాధను కొంత వుపశమింపచేసుకొనేవాడు. ఆ పిల్లల్ని తార్చిపెట్టేపనిచేసేందుకుగాను పెప్పినోకి, ఆ శ్రీమంతుడు ఉచితంగా భోజనంపెడుతో, కట్టుకునేందుకు గుడ్డలు యిస్తూండేవాడు. అతను తార్చిన ప్రతి పిల్లకీ పదేసి రూపాయల చొప్పున కమీషను ముట్టేది. ముందు కొన్ని నెలలు పెప్పినో చాలా కష్టపడి యిద్దరు

ముగ్గురు దాసీలని ఒప్పించి పంపించాడు. ఆయన ఒకే స్త్రీతో మూడునాలుగు పర్యాయాలకంటె అధికంగా సంభోగించడు. ఎప్పటికి అప్పుడు కొత్తవాళ్ళు కావాలి. కొత్తగా పల్లెలనుంచి వచ్చిన పడుచులను సంపాదించడం చాలా కష్టమైంది. అందుచేత కొన్ని వుపాయాలను వెదకనారంభించాడు. భోగంవృత్తిచేత జీవించే స్త్రీలచేత, గ్రామస్త్రీలు తినే నీరుల్లి, వెల్లుల్లిపాయల్ని తినిపించి, వారిచేత గ్రామీణుల దుస్తుల్ని వేయించి తీసుకొనివెళ్ళేవాడు. అప్పుడే గ్రామాలనుంచి వచ్చిన పడుచులతోనే తాను భోగిస్తున్నట్లు అనుకునేవాడు. చివరకి పెప్పినో దురదృష్టంమూలాన్ని ఒక భయంకర సంకటం ఆయనకు రావడంమూలాన్ని వుద్యోగం వూడిపోయింది.

"అప్పుడుగూడా ఫాంటమూరాకి యెందుచేత తిరిగి రాలేదు?" అని సోర్సనారా అడిగింది.

"ముష్టివాడికిమల్లే ఫాంటమూరా తిరిగి వస్తాడా? అసంభవం; అల్లా తిరిగివెళ్ళేకంటె రోమ్‌లోనేవుండి దరిద్రమే అనుభవించేందుకు సిద్ధపడ్డాడు. యెయ్యి వృత్తు లవలంబించాడు. గోరీలకి గోతులు తవ్వడం, గంటలు కొట్టడం, బూటుతాళ్ళు అమ్మడం, భోజన, కాఫీహోటళ్ళలో చిప్పలు కడగటం, ఇదీ అదీ ఏమిటీ? అన్ని పనులూ చేశాడు. ఏపని చేసినా ఫలితం మాత్రం సున్న.

ఆతడు జీవించినట్లే, వేలకొలదిమంది రోమ్‌నగరంలో జీవిస్తొండేవారు. 'ఇతరుల'కంటె వాళ్ళు చాలా తక్కువస్థితిలో

ఉద్యమాల్ని గమనిస్తోండేవారు. వారెప్పుడూ బీదలకిందే వుండిపోతారు. వీధుల్లో వాళ్ళని చులాగ్గా ఆనవాలు పట్ట వచ్చును. 'ఇతర కూలీలు' యుద్ధం అయినతరువాత కార్మిక సంఘాలకి వెళుతోండేవారు. పెప్పినో ఇతర కూలీలతో మాత్రం యెప్పుడూ కలిసేవాడు కాదు. రోమ్‌పట్టణం అంతా తలక్రిందుకాబోతోన్న సమయంలో, అందులోనూ దైవికంగా మాత్రం అతడు 'ఇతరుల'తో కలిశాడు.

ఒకరోజున రోమ్‌పట్టణంలోని బీదలు కొందరు ఒక పెద్ద వూరేగింపుని లేవదీశారు. కొంతదూరం వెళ్ళి అక్కడ వుండే పెద్ద, పెద్ద దుకాణాల్ని దోచ నారంభించారు. ఆ గుంపుతో పెప్పినో కలిసి, ఒక జోళ్ళదుకాణంలో దూరి రెండు బూట్లు లాగుకొని వచ్చాడు. తీరా చూసుకుంటే, రెండూ కుడికాలివే, పైగా ఒకటి పెద్దది. రెండవది చిన్నది. ఆ సమూహంలో వుండే ప్రతివారినీ జత చెప్పాలని అడగ నారంభించాడు. కనపడిన ప్రతివారినీ అడగడంలో, అతడు ఒక పెద్దమనిషిని తారసిల్లాడు. ఆయన అతి ప్రేమతో ఆ బూట్లజతలు తనదగ్గర వున్నాయనీ, అవ్వి సంతోషంతో ఇస్తాననీ, వాగ్దానంచేసి ఇంటికి రమ్మన్నాడు. నేను హుషారుగా ఆయన వెనక వెళ్ళాను. ఇంటికి తీసుకొని వెళ్ళేందుకు బదులుగా, నేను కొట్లుదోస్తున్నానని చెప్పి పోలీస్‌స్టేషన్లో వదిలిపెట్టాడు. విచారణదినాన్ని, ఆతడే కాకుండా అనేక వందలమంది కార్మికులు బోనులో నిలబడ్డారు. వారందరూ రాజకీయ కారణాలచేత ఆదోపిడీని చేశామని చెప్పారు. కాని పెప్పినో మాత్రం తనకి జోళ్లు చాలా అవసరంగా వున్నందు

వల్లనే, దుకాణం జొరబడ్డానని చెప్పించపూనుకొన్నా, అంతకంటె రెండింతలు అతనికి శిక్ష విధించారు.

“ఆరోజుల్లో ఒక్క మా ప్రాంతపు పట్టణాలు, నక్షిప్తుల్లో మనిషిని ఖూనీచేసినప్పటికీ రాజకీయకారణాలచేత చేశామని చెబితే, ఆహింసకుని వదిలేశేవారు. ఇప్పుడు చెప్పినా తన జీవితంలో ఇంతవరకూ ఎందుకు విఫలుడయ్యాడో పూర్తిగా తెలుసుకున్నాను కనుక్కుమండాచేసి, దారిద్ర్యకోపాన్ని చేసిన ఎంత చిన్నదోషమైనా మహాపరాధంగా న్యాయదృష్టిలో కనబడడానికి కారణం, తానే రాజకీయపక్షానికీ చెందకుండా వుండడమే! ఆరోజునుంచీ, తానేమి చేసినప్పటికీ రాజకీయ కారణాలకోసం రాజకీయప్రయోజనాలకొరకే చేశానని చెప్పాలని నిశ్చయించుకున్నాడు.

ఆతని శిక్ష పూర్తిఅయి, విముక్తలపొందిన రోజున “మేము చెప్పినట్టయినా చెయ్యి. లేకపోతే యీరాత్రి ఫాంటమూరా అయినా వెళ్లిపో! ఊరికే కనబడితే. మళ్ళీ యీ జైలు నీకు తప్ప”దని పోలీసులు చెప్పినోతో, గట్టిగా చెప్పారు. ఆ జైలు నుంచి వచ్చిన అనేకమందికికూడా ఇంతకంటె గత్యంతరం లేకపోయింది. ఆ పోలీసులు చెప్పినదానిని మనస్ఫూర్తిగా ఆమోదించి రాజకీయజీవితాన్ని ఆరంభించాడు. ఆరాత్రే వెళ్లి లెనిన్‌మియాదగ్గిర “సిట్లీకి జయ్! ఫ్యాసిజమ్ నశించాలి!” అని అరచేసుకున్నాను, అతనికి ముప్పైరూపాయలు అడ్వాన్సుగా ముట్టాయి!”

“ఊరికే అరిచినందుకు అతనికి ముప్పైరూపాయలిచ్చారా” అంటూ మా అపనమ్మకాన్ని ముచెలీ తెలియపర్చాడు.

"అస్తు వస్తోవ్వాడకు. రాజకీయాలనుగూర్చి నీకేమీ తెలియదు. ఆరాత్రి పెప్పినో తెసీషియాకివెళ్ళి అంతక్రితమే గుమిగూడివున్న తనవంటివారినే కలుసుకుని, నిట్టీకిజయ్! ఫ్యూమ్ ప్రభుత్వం నశించాలి!" అంటూ అరవడం ఆరంభించాడు. ఇంతలోనే పోలీసులు, అధికార్లు లాఠీలతో వారివైపు వస్తోండటం చూసి, ఆతని స్నేహితులందరూ చెల్లాచెదరైపోయారు. కాని, ఆతని రాజకీయజీవితానికి అదే ఆరంభం కనుక తాను వేసే కేకలికి అర్థం యేమిటో తెలియనప్పటికీ, ఒక్కడూ నిలబడి నినాదం చేసాడు పోలీసులు ఆతణ్ణి చుట్టుముట్టారు. మరుసటి క్షణంలో ఆతనికి స్పృహలేదు. రెండు మూడు రోజుల తర్వాత ఆసుపత్రిలో పడివున్నట్లు ఆతనికి తెలివి వచ్చిన తరువాత గ్రహించాడు."

" ఏమిటి? పోలీసు అధికార్లు, పోలీసులకి వ్యతిరేకంగావున్నారని చెబుతున్నావేమిటయ్యా? అధికార్ల మాటలు పోలీసులు వినకపోవడంకూడా వుందంటావా?" అంటూ పోలీసులలో అద్భుతమైన శిక్షణవుందని నమ్ముతోండే, మిచెలీ అబ్బురంతో అడిగాడు.

"అస్తు రావద్దని చెప్పానా? నీకు రాజకీయాలనిగూర్చి యేమీ తెలియదు. పెప్పినో మళ్ళీ రాజకీయరంగంలోకి దూకాడు. పోలీసులు యెక్కడవెళ్ళి రాజకీయనినాదాలు చెయ్యమంటే అక్కడచేస్తోండేవాడు. అధికార్లచేత చావుదెబ్బలుతింటోండేవాడు. అనేకకూలీలవూరేగింపుల్లోపాల్గొని చివరివరకూనిలబడి లాఠీదెబ్బలు తిన్నాడు. అనేకసార్లు రక్తాన్ని ధారపోశాడు.

తక్కినవా రందరూ పారిపోయేవారు. కాని, పెప్పినో యెప్పుడూ కాలికి బుద్ధిచెప్ప లేదు.''

''అయితే పెప్పినో యెందుకు పరుగెత్తేవాడు కాదు? అంటూ చాలా గాభరాపడుతూ సోర్సనారా అడిగింది.

''ఎక్కువ డబ్బు సంపాదించేందుకు. రోజుకు రెండు రూపాయలు పోలీసులు యిచ్చేవారు. గాయాలు తగిలి ఆసుపత్రికి వెళ్ళినప్పుడల్లా పదిహేనురూపాయలు అదనంగా దొరికేవి. అతను గడిపే జీవితప్రమాణాన్నిబట్టి రోజుకి రెండు రూపాయలు సరిపోయేదికాదు. అందుచేత లాఠీదెబ్బలు తినక గత్యంతరం లేదు. ఆపని అంతసౌఖ్యప్రదంగా వుండేది కాదు. ఆరోజుల్లో యేపనిచెయ్యడం బాగుండేదికాదు. ఇంతేకాకుండా నేను చేయవలసిన నినాదాలుకూడా తరుచుగా మారుతుండేవి. కొన్నిరోజులు ''నిట్టీకి జయ్!'' అనీ, ఆరునెలలతర్వాత ''నిట్టీ నాశనం అవ్వాలి!'' అనీ అరవవలసివచ్చేది. ఫలితం మాత్రం యెప్పుడూ ఒక్కటే. ప్రహారాలు, అర్ధచంద్ర ప్రయోగాలు తప్ప లేదు. ఒక యేణ్ణర్ధం యీవిధంగా రాజకీయజీవితం గడిపేటప్పటికి, శిలువ వేసిన యేసుప్రభువు శరీరం వలె, ఆతని దేహం గాయాల మచ్చలతో నిండిపోయింది.

''పెప్పినోని తప్పనిసరిగా రాజకీయ ఆత్మత్యాగిగా పరిగణించి తీరాలి. రాజకీయాలకోసం యే ఇటలీదేశస్థుడు అతనివలె బాధ లనుభవించలేదు. ఇంట్లో సుఖంగా పడుకుని, యితరుల్ని దెబ్బలాటకి పంపించే యితర రాజకీయవేత్తలవంటివాడు కాదు. అతడు రక్తాన్ని ధారపోశాడు. ఆరోజుల్లో

ఇటాలియనులనేకులు తమ ఆశయాలకొరకు పోరాడారు. కాని, వారందరికంటెకూడా పెప్పినో గొప్పవాడు. అతడు అందరి ఆశయాలకోసం, జాతీయప్రభుత్వంకోసం, ప్రజాప్రభుత్వంకోసం, సోషలిజంకోసం, మతగురువుల ప్రభుత్వంకోసం కూడా పోట్లాడాడు. వాట్లన్నిటిలోనూకూడా ఎంతో కొంత మంచి వుండటాన్ని గ్రహించాడు. ఆ ఆశయాలకి సేవ చేస్తోన్నకాలంలో రోజుకి రెండురూపాయలు ముట్టుతోండేవి. ఆసుపత్రికి వెళ్ళినప్పుడు అదనంగా పదిహేనురూపాయలు బహుమతిగా వచ్చేవి.

“ అతడు పెద్దవాడౌతోన్నకొద్దీ, ఆ లాఠీప్రయోగాన్ని భరించడం చాలా దుర్భరమైంది. రాజకీయాలనుండి విరమించాలనే తృష్ణ అతనిని అమితంగా బాధించేది. రాజకీయవిరోధాలు మరీఅపాయకరం ఔతున్నాయి. ప్రదర్శకులు పూర్వంవలె, రాళ్ళూ, ఇటికలు, కర్రలు వుపయోగించడం మాని కాల్చడం మొదలుపెట్టారు. లాఠీప్రహారాలు తిని డబ్బు సంపాదించుకునేందుకు అనుకూలించే వుపకరణంగా రాజకీయాలుండటం మానుకున్నాయి. రాజకీయాలు ఉగ్రరూపం దాల్చి విషమపరిస్థితుల్లోకి దిగాయి. పెప్పినోకి ఈ రాజకీయాలు రుచించలేదు. చాలా ఘాటుగా కనబడ్డాయి”.

“ అయితే, ఎందుకు తుపాకులుపెట్టి కాల్చడం? ” అని సోర్సనారా అడిగింది.

“ నేను రోమ్‌లో ముప్ఫైఅయిదేళ్ళబట్టి వుంటున్నాను. కాని ఆ విషయం నాకు పిసమెత్తైనా బోధపడలేదు. ఈ ఫాంట

పోలీసుల ప్రాపకం, ఓహో! ఆ ఫాసిజం చాలా అద్భుతంగా వుండేది.

ఒకరోజున ఒకపోలీసు పెప్పినోని ఒక పెద్ద భవనానికి తీసికొని వెళ్లాడు. చాల ఖరీదైన దుస్తులు ధరించిన పెద్దమనుష్యులు, విద్యార్థులు, గుమాస్తాలు, అందమైన యువతులు వ్యాపారస్థులు, కొందరు మతాచార్యులు ఒకహాలునిండా వున్నారు. అందరూ గట్టిగా మాట్లాడుతున్నారు. వారిని చూచి పెప్పినో భయపడ్డాడు. కాని ఒకమూల గూాతని పాత స్నేహితులు చాలామంది కనబడ్డారు. వాళ్ళల్లో చాలా మంది దొంగలు. కొన్ని నిమిషాల తర్వాత సభాసదులంతా పరమ నిశ్శబ్దంగా వూరుకున్నారు. ఒకాయన సభావేదిక నెక్కి పెప్పినోనీ, ఆతని స్నేహితులనీ హృదయపూర్వకంగా ఆహ్వానించాడు. వారు కార్మికులలో శ్రీమంతుల తెగకు చెందినవారనీ, రాజకీయచైతన్యం కలిగినవారనీ, ఫ్యాక్టరీ కార్మికులలో వారు అగ్రగాములై, దేశసేవకోసం వారి రక్తాన్ని అంతా ధారపోస్తారని యింకా చాలా సేపు యేదో వుపన్యసించాడు. కాని అది పెప్పినో కేమీ అర్థంకాలేదు.

" ఆ వుపన్యాసానంతరం, ఆ హాలు కాళీ అయింది. పెప్పినోనీ, ఆతని స్నేహితులనీ ఆ హాలువెనుక నిలబడి, పోర్టాపీయో మీదకు దాడివెడలేందుకు సిద్ధంగా వుండమన్నారు.

" ఆ హాలుదగ్గరలోవున్న ఒక హోటల్లో ఫలహారం తీసికొని కావలసిన పానీయాలు త్రాగిన తరువాత, వారిని ఒక లారీ యెక్కించి పోర్టాపియో దగ్గిరకి తీసుకొని వెళ్ళారు. ఆ ప్రదే

శంలో ఒకచోట వారంతా ఒక గంటవరకూ వేచివున్నారు. ఇంతలోనే శస్త్రపాణులైన సైనిక పటాలాలు ఒక కమ్యూనిష్టు అచ్చుఆఫీసులో జొరబడి లోపల పనిచేస్తోన్న కూలీలని బయటికి తీసుకొని వస్తున్నారు. ఒక పోలీసు పెప్పినోముతా దగ్గరకి వచ్చి, వాళ్ళకేమీ అడ్డంలేదనీ, నిరాఘాటంగా ఆ అచ్చుఆఫీసుని ముట్టడించవచ్చుననీ చెప్పి వెళ్లిపోయాడు. పెప్పినో తన ముఠా వెంబడించగా ఆ ఆఫీసుమీదకి దాడి వెడలాడు. లోపలవున్న సామాన్లన్నిటినీ వీధిలోనికి తీసికొని వచ్చి ఒకచోట పేర్చారు. పుస్తకాలు, పత్రికలు, తలుపులు, కిటికీలు, బొమ్మలు అన్నిటినీ వాట్లమీద పడవేసి నిప్పు అంటించారు. సిరాబుడ్లని గోడలమీదకి విసిరేశారు. ఆ ఆఫీసులో వారు యెదురులేని అవ్యాహతమైన వీరవిహారం చేశారు. ఇనపపెట్టెని శాస్త్రీయపద్ధతులపై తెరిచారు కాని అది ఖాళీగానే వుంది.

విజయోత్సాహంతో, ఆశిథిలప్రదేశాన్ని వదిలివెళ్ళేలోపుగా ఫొటోగ్రాఫరులు పత్రికావిలేఖరులు చాలమంది వచ్చి వారి చిత్రపటాలు తీశారు. మరుసటిరోజు పిక్కోలాపత్రికమీద పోర్ట్రాపియోవీరుడు అంటూ పెప్పినో బొమ్మ అచ్చుపడింది.

"పెప్పినో జీవితంలో మహోదశ కొన్నిరోజులు గడిచింది. యశశ్చంద్రికలు అన్నిచోట్లా ప్రకాశించాయి. పత్రికా కార్యాలయాలవద్దకి వెళ్ళినప్పుడల్లా ఆతనికి మంచి పానీయాలు దొరికేవి.

"తన పేరుప్రతిష్ఠలని పురస్కరించుకొని ఒక రాత్రిక్లబ్బులో ఉద్యోగం సంపాదించుకున్నాడు పెప్పినో. కొద్దిరోజుల్లోనే,

కొందరు కార్మికులచేత అతని స్నేహితు డొకడు ఖూనీచెయ్య బడ్డాడు. ఈ విషయం జరిగిన తరువాతనుంచి పెప్పినో జాగ్ర త్తపడ్డాడు. ఫాసిస్టు కార్యాలయంనుంచి కబుర్లువచ్చినప్పుడు అనారోగ్యంగా వుందని తప్పించుకునేవాడు.

" ఫాసిస్టులు ప్రభుత్వంలోకి వచ్చారంటున్నావుకదా, ఆ అవ కాశాన్ని వుపయోగించుకొని యెందుకు పెప్పినో పెద్దవుద్యో గాన్ని సంపాదించుకోలేదు?" అని పోర్సనారా సందేహాన్ని నివారించుకొన ప్రయత్నించింది.

" ఫాసిస్టులు అధికారంలోకి రాగానే వారి పాత అనుచరులకి చాలా చెడురోజులు వచ్చాయి. ఒక విచారణసంఘంవారు పెప్పినోని పిలిచి 'ఎంతకాలంనుంచి నువ్వు ఫాసిస్టుగా వుంటు న్నావు? ఎల్లాగ ఫాసిస్టు అయ్యావు? ఎప్పుడైనా ఖైదులో వున్నావా?' అని ప్రశ్నించారు. ఆ విచారణకి ఫలితంగా, దొంగతనాలకీ, యితర నేరారోపణలవలన ఖైదులో వున్న దోషుల్ని ఫాసిస్టుపార్టీఅధికారసంఘాలలో వుండనివ్వకూడదు అని నిర్ణయించారు. అందువలన పోర్టాపియోపీరుడైన పెప్పినో పార్టీనుండి తీసివేయబడ్డాడు. ఆసమయానికే అతని ఉద్యోగం కూడా పోయింది.

ఈవిధంగా నిరుద్యోగజీవితం మళ్ళీ ఆరంభమైంది. నిరంతరం సహవాసంచేసిన ఆకలిమంటలు మళ్ళీ రాజుకొని భగభగ మండజొచ్చాయి. రోజురోజుకీ జీవితం గడపడం దుర్భరమై పోతోంది. క్రొత్తప్రభుత్వం పదేళ్ళవరకూ వుంటుందని

ఎవ్వరూ అనుకోలేదు కాని నూతన ఫాసిస్టుప్రభుత్వం పదేళ్లూ నిలిచింది.

రోమ్‌లో జీవించడం అసాధ్యమైపోయింది. ప్రతిరోజూ ఒక క్రొత్తచట్టం వచ్చేది. ప్రతి ప్రభుత్వం క్రొత్తచట్టాలు చేస్తుందన్నమాట నిజమే కాని, యీ ప్రభుత్వంమాత్రం రోజుకొక క్రొత్తశాసనాన్ని చేసేది.

మతాధిపతులు శతాబ్దాలతరబడి పరిపాలించారుగాని, వారికి అయిదు శాసనాలే వుండేవి. ఆతరువాత, వెయ్యిమంది అనుచరులతోటీ రోమ్‌ని స్వాధీనంచేసుకొని ప్రభుత్వాన్ని స్థాపించిన గారీబాల్డీ మరి మూడు క్రొత్త శాసనాలు అధికంగా చేశాడు. కాని, యీప్రభుత్వం రోడ్డుమీద యెడంవైపున నడవవద్దనీ, ట్రామ్‌కారు ముందునుంచి యెక్కమని, రాత్రిళ్ళు పాడకూడదనీ, గోడలమీద యేమీ వ్రాయకూడదనీ, పెళ్ళి చేసుకోనివారికి వ్యతిరేకంగాను, ఉద్యోగాల విషయంలోనూ, యజమాని, పనివారల తగాదాల విషయాలలోనూ, మాట్లాడేందుకు, మాట్లాడవద్దనేందుకు అన్నింటికీ శాసనాలే!

"చట్టాలు యెక్కువైనకొద్దీ, దారిద్ర్యం యెక్కువౌతోంది. దరిద్రం వృద్ధిపొందుతోన్నకొద్దీ శాసనాలసంఖ్య పెరుగుతోంది. రోమ్‌నగరంలో జీవించడం అసాధ్యమౌతోంది. రోమ్ వాతావరణం అంతా కుళ్ళిపోయింది.

"ఈ దారిద్ర్యాన్ని నిర్మూలించేందుకు అనేక ప్రయత్నాలు చేశారు. కాని విఫలు లయ్యారు. ఈ దుర్గంధానికి కారణం ఎలుక లేమో అని కొందరు అనుమానించారు. వెంటనే ఎలు

కల్ని చంపేందుకు విషం పంచిపెట్టబడింది. వేలకొద్దీ యెలుకలు చచ్చాయి. ఐనా, ఆ కుళ్ళు అలాగే నిలిచింది. మరి కొందరు యీ కుళ్ళుకి కారణం యీగలేమో అన్నారు.

వెంటనే యీగలమీద యుద్ధం ప్రకటించి, కొన్ని కోట్ల యీగల్ని కూల్చారు. కాని ఆ కుళ్ళు అలాగే వుండిపోయింది.

"ఎక్కడనుంచి వచ్చింది ఆ దుర్వాసన? మురికి కుంటల నుంచా?" అని మిచెలీ అడిగాడు.

"అది యెక్కణ్ణుంచి వస్తోందో యెవ్వరూ కనిపెట్టలేకపోయారు. ప్రజలు అధికంగా తిరుగుతోండే ప్రదేశాల్లో తక్కువగా వుంది. మంత్రిగారుండేచోట కొద్దిగా తాళుకో వచ్చును. కాని రోమ్‌నగర మధ్యప్రదేశంలో అతి విపరీతంగా దుర్వాసన కొడుతోంది. పోలీసుస్టేషన్ల దగ్గరనుంచి, ప్రభుత్వకార్యాలయాల దగ్గరనుంచీ యీ దుర్గంధం బయలుదేరుతోంది. ఉద్యోగస్థులు భూబిలాల్లో శవాలని పాతిపెట్టారని కొందరన్నారు. అనేక వింతకథలు పుట్టాయి. కాని ఆ వాసనమాత్రం యెక్కువౌతోంది.

"వారం వారానికి పోలీసులు ఒక కొత్తకుట్ర కేసుని కనిపెడుతున్నారు. కూలీలు నివసించే పేటలన్నీ, వేలకొద్దీ సైనికుల చేత కొల్లగొట్టబడుతున్నాయి. అటకలు, మిద్దెలు, దొడ్లు, గదులు, అన్నిటినీ పోలీసులు వెతుకుతున్నారు. వేలకొద్దీ కూలీలని అరెస్టుచేసి తీసుకొనిపోతున్నారు. కారణం యేమిటో యెవరికీ తెలియదు. తనరోజుకూడా వస్తుందని

ప్రతి కార్మికుడు హడలిపోతున్నాడు. నిరంతర భయో త్పాదన పరిస్థితుల్లో అందరూ జీవిస్తున్నారు.

''రోమ్‌లో భయం, భయంకర అంటుజాడ్యంవలె ప్రబలి వుంది. కొన్ని వారాలు ప్రళయరూపం దాల్చాయి. ప్రజా సామాన్యం భయవిహ్వలులైపోయేవారు. ఏ కాఫీహోటల్లోనో బహిరంగప్రదేశంలోనో, ఎవరివంకనైనా తీక్షణంగాచూసే ఆతడు తెల్లబోయి వెంటనే తడబడుతోన్న కాళ్ళతో యింటికి జేరుకునేవాడు. ఎందుచేత? భయంమూలాన్నే.

''యెందుకు భయం?'' అని బెరార్డో అడిగాడు.

''భయమే'' అన్నాడు ఆ దొంగదైవజ్ఞుడు.

''కాని, ఆ భయమే యెందుచేత వచ్చిందని అడుగు తున్నాను?'' అన్నాడు బెరార్డో.

''భయమే! ఎందుకు భయంపడుతున్నారో యెవరికీ తెలియదు. రోమ్‌అంతా భయంతో నిండిపోయింది. దానికి కారణం యెవ్వరూ చెప్పలేరు. ప్రభుత్వ వ్యతిరేకులే కాదు, ఫాసిస్టులని పిలువబడుతోండేవాళ్ళుకూడా తక్కిన అందరికంటె అధికంగా భయపడుతున్నారు. పరిస్థితు లీవిధంగా వుండకూడదు అని పైకి డాబులుకొడుతూనే, లోపల అమితంగా భయపడిపోతున్నారు. ప్రతికక్షుల్ని వాళ్ళెందుకు ఖూనీచేస్తు న్నారు? భయమే దానికి కారణం. వారి సేనల్ని నిత్యమూ వృద్ధిచెయ్యడానికి కారణం యేమిటి? భయమే! వేలకొద్ది అమాయకులైన ప్రజల్ని ఉరితీయడానికి కారణం? వారి భయమే! వాళ్ళు దారుణాలు చేస్తోన్నకొద్దీ, వాళ్ళ భయం

కూడా పెరిగిపోతోంది. అభయం వారిచేత మరీభయంకర దోషాల్ని చేయిస్తోంది.

"ప్రభుత్వం బలంగా వుందా?" అని మిచెలీ తెలుసుకోవ ప్రయత్నించాడు.

"దాని భయంమాత్రం చాలా బలీయంగావుంది" అని ఆ సాధువు సమాధానం యిచ్చాడు.

"పీఠాధిపతి యేం చేస్తున్నాడు" అని పోర్సనారా ప్రశ్నించింది.

"పీఠాధిపతి భయపడ్డాడు. ఆయన క్రొత్త ప్రభుత్వందగ్గర నుంచి కోటిరూపాయలు తీసుకొన్నాడు. ఒక మోటారు కొన్నాడు. వైర్ లెస్ పెట్టించుకున్నాడు. క్రొత్తరైల్వేస్టేషన్ కట్టించుకున్నాడు. రేడియో పెట్టించాడు. ఇంకా అనేక విలాస సామగ్రుల్ని కొన్నాడు. ఆ విషయలోలత్వంతో పాటు ఆయన భయంకూడా అధికమైంది. దేశంలోవున్న మతాల కన్నింటికీ, బీదలకి అధికంగా అన్నదానం చెయ్యమని పీఠాధిపతి ఒక లేఖ పంపించాడు. ఆ మతస్తులుకూడా అన్నంతో పాటు పులుసుకూడా పంచుతున్నారు. అవన్నీ భయప్రేరితమైన కార్యాలే! భయానికి మారురూపాలే! ఆకోటిరూపాయల విషయం ప్రజలు మరిచిపోయేవరకూ, నిరంతరాన్నదానం జరుగవలసిందే!"

"పల్లెలనుంచి వెళ్లి స్థిరపడిన కూలీలసంగతి యెల్లావుంది?

"బీదల పరిస్థితు లేమీ బాగా లేవు. భాగ్యవంతుల కేమీ లోటు లేదు. కాని అందరూ భయంతో క్రుంగిపోతున్నారు.

బీదప్రజలని విచారణచెయ్యనారంభించింది ప్రభుత్వం. ప్రతి వారమూ ఒక వందమందిని పట్టుకొని వాళ్ళ స్వగ్రామాలకి పంపించేస్తోంది. అందులో ఇరవై ముప్ఫై యేళ్లనుంచీ రోమ్‌లో నివసిస్తున్నారు కొందరు. 1915లో భూకంపంవచ్చి నప్పుడు, వాళ్లు రోమ్‌పట్టణం జేరుకున్నారు. వాళ్ళ బంధువులు యెవరూ బ్రతికిలేరు. వాళ్ళ గ్రామాలకికూడా పూర్వపు రూపంలేదు. 'శాంతిభద్రతల' కొరకు వారిని తక్షణం రోమ్ వదిలివెయ్యమన్నారు. వారితోపాటు పెప్పినోనుకూడాపట్టుకుని రైలుయెక్కించి ఫాంటమారా పంపారు. ముప్ఫైఅయిదేళ్ల తరువాత పెప్పినో, ఫాంటమారా జేరుకున్నాడు. ఔను., తిరిగిరాక విధిలేకపోయింది.

"ఐతే నువ్వే పెప్పినోవా?" అంటూ ఆనుర్దాగా సోర్సనారా అడిగింది.

"పోర్టాపియో వీరుడివి నువ్వేనా?" అని బాల్డిస్సేరాసేనాని అడిగాడు.

ఔను, ఆతడే పెప్పినో.

## ౭

స్వంత గృహంగాని, బంధువులుగాని లేకపోవడంచేత పోర్టాపియోవీరుడు సోర్సనారా గృహంలో తలదాచుకుంటున్నాడు. చిన్నతనంలోనే, పట్టణానికి వెళ్ళి ధనార్జన చెయ్యాలనే కోరికపుట్టకపోతే, పుట్టినచోటనే గిట్టేవాడు. కాని జీవితంలో అతడు విపరీతంగా బాధలు అనుభవించాడు.

బల్లిపలె కదలకుండా, మెదలకుండా గంటలతరబడి యోచనలో కూర్చునేవాడు.

“మనం యెందుకు జన్మించాం?” అని ఆతని దగ్గరకి వెళ్ళే వారిని ప్రశ్నించేవాడు.

ఆ ప్రశ్నకు జవాబు మాకుతోచేదికాదు. ఈ ప్రపంచంమీద ఆ ప్రశ్నకి యెవ్వరు సమాధానంచెప్పగలిగారు?

బాల్డిస్సేరా సేనాని కూడా, తనకి తెలిసినట్లు, నటించేవాడు కాదు. పట్టణానిగూర్చి మేము తెలుసుకున్నవిషయాలు ఆతనిని చాలా బాధించాయి. నేటికి కూడా ఆతను నమ్మే పాతప్రపంచంపోయి. దానిస్థానే ఒకవింత ప్రపంచం వచ్చింది. ఆప్రపంచంలో యెవ్వరూ వూహించలేని అనేక అద్భుత విషయాలు జరుగుతున్నాయి. జరిగాయి.

వేలకొలది వైమానికులు ఆకాశాన్ని చీల్చుకొని విహరిస్తోంటే గ్రామస్తులుమాత్రం, యింకా పొలాలని కర్రనాగళ్ళతో దున్నుతోనే వున్నారు. గ్రామస్థులు రాగిడబ్బుల్ని నిలవ చేసుకుంటుంటే, పట్టణప్రజలు వేయిరూపాయలనోట్లమీద లెక్కలు కడుతున్నారు. ప్రొద్దుపొడిచింది మొదలు సూర్యాస్తమయం వరకూ రైతులు చెమటోడుస్తో పస్తులు పడుకుంటోంటే, పట్టణవాసులు ప్రజల్ని బాదినందుకు పదులు, వందలు, సంపాదిస్తున్నారు.

ఫాంటమారా దాటితే, యెవ్వరూ, ఆఫ్రికా వెళ్ళియుద్ధం చేసిన బాల్డిస్సేరాని జ్ఞాపకం వుంచుకోవడంలేదు. ఉంచుకుని

నల్లవాళ్ళు వచ్చేరు
సేనాసీ!
వచ్చి ముట్టడించేరు,
సేనాసీ!
ఏమిటీ నాలుగా వుండబోకోయి
సేనాసీ!॥

అంటూ వాపోటం లేదు. పట్టణంలోని పెద్దపెద్ద అచ్చుకార్ఖానాల యాజమాన్యాల, కాఫీహోటళ్ళమీద "దాడి వెడలిన" వీరావీరులని ఆకాశానికి ఎత్తి ప్రభుత్వం యెత్తేస్తోంది. పత్రికలు వారిని పొగడుతున్నాయి.

ఒకరోజున బాల్డిస్సేరా పోర్టాపియోపీయుణ్ణి, ఆధునిక యుగంలో పట్టణప్రజలు యేంపాటలు పాడుతున్నారు? అని అడిగాడు. ఆప్రశ్నకి, వచ్చేజవాబుకి అతడు అతిప్రాముఖ్యత యిచ్చాడు. ఆ పీయుడు లేచి నిలబడి, రోమ్‌నగరంలో అందరూ అతి జోరుగా పాడుతోన్న కొత్తరకపు పాటని పాడాడు.

"గైరమ్మోరెలె గైరమ్మా,
నీ కళ్ళు పళ్ళు చక్కాగుంటయ్యే గైరమ్మా॥

రోమ్‌స్టేషన్లో, ప్రభుత్వ ప్రచారకశాఖవారు పెప్పినోకి ఒక కరపత్రం యిచ్చారు. అందులో రైతులనుగూర్చి వ్రాయబడివుంది. బహుశా, మాకోసం ప్రభుత్వం యేమిచేస్తోందో అందులో వివరింపబడివుంటుందని మేము అనుకొని ఆ పీయుణ్ణి చదవమని కోరాం.

ముందుభాగం ఊడుపుపనివాళ్ళకి అంకితం చెయ్యబడివుంది. అదొకపద్యం. ఆపద్యానికి ఒకప్రతి రాసుకుని, అస్తమానం నాదగ్గరే వుంచుకొని, దానికి అర్థం యెవ్వరైనా చెప్పగల రేమో అని చూస్తున్నాను. ఆ పద్యాలు చదువుతాను, వినండి.

ఆ కరపత్రంలోని తక్కిన భాగాలు స్పష్టంగానే వున్నాయి. పొలాలలో రైతులుగడిపే సౌఖ్యకరజీవితాన్ని వర్ణిస్తున్నాయి. వారు వివరించిన ఆ కారణాలు జ్ఞాపకం వున్నంతవరకూ చెబుతాను.

''పట్టణవాసి'' స్వచ్ఛమైనగాలిని కోరేటప్పుడు, నిర్మల జీవితాన్ని గడప నిశ్చయించుకున్నప్పుడు, ఎక్కడికి వెడతాడు?

''గ్రామాలకి!

''వెన్న, మంచినూనె, తెల్లటి గోధుమపిండి, రుచికరమైన పళ్లు యెక్కణ్ణుంచి లభ్యమౌతాయి?

''గ్రామాలనుంచి!

''పట్టణవాసులు, బక్కపలచనగా, యెండిపోయి, నిరుత్సాహంగా వుంటారు.

''పల్లెటూరి ప్రజలు, బలంగా, సంతోషంగా, గులాబీవర్ణపు చెక్కిళ్ళ ఆనందోత్సాహాలతో వుబుకుతో వుంటారు.

క్రొత్తప్రభుత్వం ప్రజల కేమి మేళ్లు చేసిందో మరొకచోట వ్రాయబడివుంది.

''క్రొత్తప్రభుత్వంచేసిన చట్టాలమూలంగా, రైతులు నేడు, రోజుకి యెనిమిది గంటలకంటె అధికంగా పనిచెయ్యవలసిన అవసరం లేదు.

''అపాయాలకు, రోగాలకు, నిరుద్యోగాలకు భయపడ నక్కర్లేకుండా ప్రజల జీవితాలు భీమా (ఇన్సూర్సు) చెయ్యబడ్డాయి.

''ఇదివరలో రైతులు చెల్లిస్తూండే పన్నులు కొద్ది తగ్గించబడ్డాయి

''పెట్టుబడులు తెచ్చుకునేందుకు బ్యాంకులు స్థాపించబడ్డాయి.''

ఇల్యిచ చదువుతోన్న పుస్తకం, మమ్మల్ని పరిహాసిస్తున్నాడేమో అని మేము ఒకరిమొహాలు మరొకళ్ళం చూసుకున్నాము.

పెప్పినో ఆపుస్తకాన్ని మిచెలీకి ఇచ్చి చదవమన్నాడు. అప మేమందరమూ చదివాం.

ఆ పుస్తకం చివరని యీవిధంగా వ్రాయబడివుంది.

''చిట్టచివరకి, ప్రభుత్వాధికారం అంతా రైతుల హస్తగతం అయింది. ఇటలీ వ్యవసాయక దేశం, అందుచేత ఇటాలియను ప్రభుత్వం వారిచేతుల్లోనే వుంది. రైతుల ప్రయోజనాలే అతి ముఖ్యంగా పరిగణించబడుతున్నాయి. దేశానికి ప్రాతినిధ్యం వహిస్తోన్నది రైతులే!'

మిచెలీకి ఒక సందేహం కలిగింది. అందుతో మేముకూడా యేకీభవించాము.

''ప్రభుత్వవ్యతిరేకులు, క్రొత్తప్రభుత్వాన్ని నవ్వులపాలు చేసేందుకుగాను వ్రాసి ప్రకటించి వుంటారు. లేకపోతే యే పిచ్చాసుపత్రిలోనో వ్రాయబడివుండాలి.''

''అదినిజమే అయ్యుండాలి. కాని, పోలీసులు స్వయంగా ఆపుస్తకాన్ని నాచేతి కిచ్చారు, అన్నాడు పెప్పినో.

"పోలీసులు ఆపుస్తకాన్ని ఎందుకల్లా పంచిపెడుతున్నారు? కొత్తబాంకి, టార్లోనియో ప్రభుత్వాల ఉద్దేశ్యం ఏమిటి? రైతులపేరు చెబుతోనే, రైతుల్ని దోచుకుంటో, ప్రభుత్వం వారిని హత్యచెయ్యడానికి పూనుకుందా?" అని బెరార్డో ప్రశ్నించాడు.

రైతుల్ని పస్తులుపడుకోబెడుతోన్న యీప్రభుత్వం, యిదంతా రైతులమీదుగానే చేస్తోందని, యిప్పుడు గ్రహించాము.

"ప్రభుత్వం యెప్పుడూ బీదలకి వ్యతిరేకమే. కాని, యిదొక ప్రత్యేకరకమైన ప్రభుత్వం. బీదలకి వ్యతిరేకంకూడా ప్రత్యేక రకంగా చెయ్యబడుతోంది. దాని బలాన్నంతా బీదలని అణచేందుకు ఉపయోగిస్తోంది కాని, ఒక ప్రత్యేక పద్ధతిలో చేస్తోంది. ప్రస్తుత ప్రభుత్వంకోసం అనేకమంది బీదలు రక్తాన్ని ధారపోశారు. నేనూ, నాబోటివాళ్ళూ అని చెప్పడంలేదు. మొట్టమొదట ఫాసిష్టుసంఘాలలో, గుమాస్తాలు, రైల్వేపని వాళ్ళు, యిటికమోత పనివాళ్ళు, ట్రామ్ పనివాళ్ళూ, వేల కొద్దీ వుండేవారు. వాళ్ళెవరూ లక్షాధికార్లుకారు. బీదవాళ్ళే. వారిసహాయం లేకపోతే యీ ప్రభుత్వం ఒక్కరోజుకూడా అధికారంలో వుండి లేదు. టార్లోనియా రాజుకీ, క్రొత్తబ్యాంకీ ప్రభుత్వం సహాయం చేస్తోన్నకొద్దీ, ప్రభుత్వానికీ యిటు బీదలసహాయం కావాలి. ఆ బీదలచేత యీ ప్రభుత్వం రైతులదే అని నమ్మించడం అత్యవసరం" అని పిప్పినో చెప్పాడు.

ఆతను చెప్పినదానినిబట్టి సైనికులు, తమ అధికారిముందరే, యెందుచేత స్త్రీలని చెరిచారో, ఆ పనులన్నిటికీ, 'శాంతి

భద్రతల రక్షణ' అని పేరు పెట్టారో మాకు స్పష్టంగా ఇప్పుడు బోధపడింది.

చిన్నరైతులమీద పన్నుల నధికం చేసి, పెద్దరైతుల పన్నులని చాలా తగ్గించారు. కాని, ఇల్లాంటి న్యాయాలని ప్రతినిధులే వుపపాదించారనడంలో విశేషార్థం ఇప్పుడు స్పష్టమైంది.

ఏమీ తప్పుచెయ్యని నిర్దోషులైన రైతులను, సైనికులు లాఠీలతో మోది, కొన్ని కొన్నిసమయాల్లో కాల్చి చంపేవారు. అది యెందుకో యిప్పుడు బోధపడింది ఆ సైనికులని కంట్రాక్టరు మొదలైన అధికార్లు మెచ్చుకొని, బిరుదు లిచ్చేవారు. దానికి కారణం తెలిసింది.

ఈ కష్టాలన్నీ మాకు పూర్వంకూడా కలిగినవే. కాని అవ్వి మాకు కలిగేవిధానంలోమాత్రం గొప్ప మార్పువచ్చింది. ఇంతక్రితం మాకేమి అర్థం అయ్యేదికాదు.

పచ్చచేలలో వున్నప్పుడు పంటల్ని కంట్రాక్టరు కొంటేనేకాని రైతులకి పంటలు పండటంలేదు. సాధారణంగా డబ్బుఅంటె చాలా జాగ్రత్తగావుండే కంట్రాక్టరు. ధాన్యపుధర లెట్లా వుంటాయో యెవ్వరూ తెలిసికోలేని రోజుల్లో డబ్బుయిస్తా ననడంమూలాన్ని, మాకు డబ్బు అవసరం వుండటంతోటే మేము ముందే బదులుతీసుకున్నాం. ఊహపుటరోజులు వచ్చే టప్పడికి అందులోవున్న రహస్యం తెలిసింది. ప్రభుత్వం కొత్తధాన్యపుచట్టాలని చేశారు. అందుమూలకంగా, ధాన్యపు ధరలు పెరిగాయి. ఈ విషయాన్నిగూర్చి ఇంతె కితమే విన్న కంటాక్టరు ధాన్యపుబస్తా ఒకటికి బోలెడంత లాభం సంపాదించాడు.

ఈ విధంగా, మేము పండించిన పంటలమీద వచ్చినలాభం అంతా కంట్రాక్టరుకి వెళ్ళింది. దున్ని, దూడ్చి, కోసి, కుప్పలు వేసి, కళ్ళాలుచేసి, ఆ కుప్పలు నూర్చి తెచ్చిన పంటలమీద వచ్చిన—ఒక యేడాది శ్రమకి— ఫలితం అంతా కంట్రాక్టరు తన్నుకుపోయాడు.

మేము యీ అసంతృప్తిని వెల్లడించగలమా? చెయ్యకూడదు. ఆపని అంతా సంపూర్ణంగా న్యాయబద్ధంగా జరిగింది. మేము మా నిరసనను తెలియబరచడమే అశాస్త్రీయంగా, న్యాయ విరుద్ధంగా పరిగణింపబడి వుండేవి.

ఎంతోకాలంనుంచి యీవిధమైన దోపిడీలన్నీ న్యాయసమ్మతంగా పరిగణింపబడుతున్నాయి. ఇంతక్రితం వున్నచట్టాలు చాలకపోతే, కొత్తశాసనాలుచేసి, యీ దోపిడిని నిరాఘాటంగా సాగిస్తున్నారు.

నాకు, బెరార్డోకీ, రాఫేల్‌కీ, ఊళ్ళు వూడ్చినందుకు డాక్ సర్కోస్ట్రాంజా కొంతడబ్బు బాకీవున్నాడు. ఒకఆదివారం ఉదయాన 'ప్రజామిత్రు'డి దగ్గరకి డబ్బుఅడిగేందుకు వెళ్ళాం. డాక్ సర్కోస్ట్రాంజా తప్పతాగి వుండకపోయినా మా కరచాలనంచేసి యెన్నిరోజులకూలి (పను) లివ్వాలని అడిగాడు.

పదిహేనురోజులకూలి బెరార్డోకీ—నాకూ, రాఫేల్‌కీ చెరొక పన్నెండురోజులకీ బాకీపడ్డాడు.

సర్కోస్ట్రాంజాలాంటి చదువుకున్నవాడికి, మా కెంత డబ్బు యివ్వవలసివుంటుందో లెక్కకట్టడం కష్టమైన పనికాదు.

కాని, ఆ ప్రజామిత్రుడి మొఖం నల్లబడింది. పెదవి మెదపకుండా మౌనం వహించాడు. రెండుమూడుసార్లు పచార్లు

చేశాడు. కిటికీలోంచి తొంగిచూసి, యెవ్వరూ దాన్ని విన టంలేదని నిశ్చయించుకొని మాదగ్గిరకివచ్చి, తనభావాలని అణచుకోలేకపోతో, యిల్లా అన్నాడు.

"చాలా భయంకరంగావుంది. ఈ ప్రభుత్వం చేత యెలా బాధలు పొందుతున్నామో పరమేశ్వరుడికే తెలుసు. ప్రతిరోజూ మాప్రభుత్వం ఒక కొత్తచట్టం చేస్తోంది. మా స్వంతిపిల్లల తోటికూడా మేము స్వేచ్ఛగా వ్యవహరించడానికి వీల్లేకి పోతోంది."

ఈ మాటలు మాకు చాలా ఆశ్చర్యాన్ని కలిగించాయి. అయితే ప్రభుత్వంవారు పెద్దమనుష్యుల్నికూడా బాధిస్తున్నారన్నమాటే!

"మీరు మాట తెలవిచ్చారంటే, రైతులంతా ఒక్క క్షణంలో యెదురుతిరుగుతారు" అన్నాడు బెరాల్డో.

"అబ్బే, కాదు, అదికాదు."అంటూ భయపడుతో సర్దుకొంటూ అన్నాడు." అబ్బే, అది అంతకంటె చాలా చెడుగా వుంది. చూడండీ, మీ ముగ్గురికీ మూడుకవర్లు వ్రాసి వుంచాను."

బల్లమీద మూడు వుత్తరాలున్నాయి.

"మనం నిర్ణయించుకున్న కూలీ లెఖలు అన్ని అందులో వున్నాయి. నామాట నమ్మండి మీ కొక్కరికైనా కూడా అన్యాయం జరగలేదు.

"మీ మాటలో మాకు పూర్తిగా విశ్వాసం వుందండీ" అన్నాం ఒకేసారి.

మనోకసాని మాంతో కరచాలనంచేసి, కౌగిలించుకున్నాడు. (ఆయనన్న నమ్మకపోతే, మరెవ్వరిని నమ్మగలం !)

"బాగుంది. ఈరోజు వ్రాస్తూన్నా, మనరాష్ట్రంలో, వ్యవసాయ కూలీల రోజువారీ కూలినిబంధన లనే చట్టం నాకు పంపబడింది. ఎన్నడూ అనుకోనంత దారుణమైన అఘాతం తగిలింది. మన కూలీలకి చాలా ఘోరం జరిగిపోయింది.

సరోన్స్టాంజా యిచ్చిన పత్రిక తీసుకొని, ఆయన యెర్ర పెన్సిలుతో గీసినచోటున చదివాను.

"ప్రస్తుతం మొదటితరగతి వ్యవసాయకూలీల కీయబడుతోన్న రోజుకూలి నూటికి నలభై పాళ్ళచొప్పున తగ్గించబడింది. పంధొమ్మిది, అరవైయేళ్ళ మధ్యవయస్సుగలిగిన మొగవారు ప్రథమతరగతిలో లెక్కించబడుతారు.

"పదిహేను, పద్దెనిమిది యేండ్లవయస్సు కుర్రవాళ్ళ జీతాలు నూటికి యిరవైపాళ్ళచొప్పున పైజీతాలకు అదనంగా తగ్గించబడినవి. స్త్రీలకు, పిల్లలకు జీతాలు నూటికి నలభైఅయిదు చొప్పున తగ్గించబడినవి.

"అది దారుణంగా లేదు? చెప్పండి!" అని సరోన్స్టాంజా అన్నాడు.

నేను యింకా చదివాను.

"పొలములను మరమ్మతు చేయించుట, తోటలను వేయుట, తోటలను, ద్రాక్షతీగెలను బాగుచేయించుట, ఫలవృక్షాలని దొడ్లలో నాటించుట, యెరువులకుగాను చెత్త, పేడ మొద

తైనవాటిపై ప్రోగు చేయించుట, గోతులను త్రవ్వించుట, పూడ్పించుట, రోడ్లను వేయించుట మొదలైన పనులు, నిరుద్యోగ నివారణాకార్యాలు గాన, ప్రజోపయోగకర కార్యాలుగా పరిగణింపబడును. అందువలన పైన చెప్పబడిన కూలిరేటుకంటె నాలుగవవంతుకు మించకుండా వేతనములను తగ్గించవచ్చును.

"అది మహా దారుణంగా లేదూ? యజమానికి, పనివారలకీ వున్న సంబంధాన్ని కూడా మార్చేటందుకు ప్రయత్నిస్తోంది యీచట్టం! ఈ విధంగానే జరిగేట్లైతే, మనస్వేచ్ఛ యేమై పోతుంది?" అని విచారించాడు ఆ ప్రజామిత్రుడు.

"సరే, ఆ కవర్లని తీసుకుందాం. దాంతో మనబాకీలు వదలి పోతాయి" అన్నాడు బెరార్డో.

బెరార్డో తన కవరుని తీసుకోబోతోంటే, డాన్ సర్కోస్టాంజా వాణ్ణి వారించాడు.

"ఏమిటిది? నాయింట్లో నువ్వు యీవిధంగా ప్రవర్తిస్తావా? నాయింట్లోనే?" అని కోపంగా అన్నాడు.

"అది వాడి కవరేకదా, యెందుకు తీసుకోకూడదు? ముందు మనం నిర్ణయించుకున్న కూలికి, కొన్నిరోజులు పనిచేశాడు. ఈ లెఖ్ఖకట్టడం మీ కేమీ కష్టంవుండదు." అని నేనన్నాను.

"ఐతే చట్టం-ఆచట్టంసంగతి యేమంటారు? చట్టాన్ని అతిక్రమిస్తే, శిక్షయేమిటో తెలుసునా? ఆసంగతి మీకు తెలియదు. మీకోసం నేను ఖైదులోకి వెళ్ళనా? ఈ విషయాన్నిగూర్చి నాకు చాలా విచారంగావుంది. అయినప్పటికీ మీకోరకై

నేను శిక్షను తప్పించడానికి గాని సమర్థత లేదు. చట్టం చట్టమే. దాని ప్రకారం మనం అందరమూ నడుచుకోవలసిందే.'' అన్నాడు ప్రజామిత్రుడు.

''నువ్వు దొంగిలించరాదు, 'ఇతరులను మోసగించరాదు' అని మోజెస్ శాసనం'' అన్నాను నేను.

''మోజెస్ విషయం కాదు, ముస్సోలినీ విషయం, యిప్పుడు మనం ఆలోచించవలసింది ఈ శాసనాన్ని కాపాడవలసిన భారం నా మీద వుంది. ఈ శాసనం ప్రకారం మీరు నడుచుకోకపోతే పోలీసుల కోసం కబురుపంపుతాను'' అన్నాడు సర్కొస్తాంజా.

సర్కొస్తాంజాకి కోపంతో కళ్ళు యెర్రబడ్డాయి. గదిఅంతా కలయ చూస్తున్నాడు.

''మీరు ఇట్లా ప్రవర్తిస్తారని, నేను యెప్పుడూ అనుకోలేదు. ప్రజలకోసం, మీ కోసం నా జీవితం అంతా ధారపోశానే? నాకే మీరిట్లా అపకారం తలపెడతారా? మీ ఉద్దేశ్యం యేమిటి? నన్ను సర్వనాశనం చేస్తారా? నన్ను సర్వనాశనం చెయ్యాలనేనా మీ వుద్దేశ్యం, స్పష్టంగా చెప్పండి.''

కొన్నినిమిషాల తరవాత, ఆయన శాంతించాడు. మేజాబల్ల దగ్గరకివెళ్ళి, బెరార్డో కవరుతీసి, ఇరవైరూపాయిలు తీశాడు.

''శాసనంప్రకారం, 'నూటికి నలభైపాళ్ళచొప్పున తగ్గిస్తే పన్నెండురూపాయలు వుంటుంది. ప్రజోపయోగకరమైన పని కాబట్టి అందులోంచి మళ్ళీ నాలుగోవంతు తగ్గించాలి. పోతే బెరార్డోకి రావలసినది తొమ్మిదిరూపాయలు. బెరార్డో! నువ్వు

చాలా మంచివాడవు. పనిమంతుడవు. ఒళ్ళు దాచుకోవు. నీవిషయంలో కించగానేవుంది కాని శాస్త్రులని సంతోషించాలి. ఏం చెయ్యగలుగుతాం?”

నా కవరుతీసి పదహారు రూపాయలలోనుంచి, అన్ని ఖర్చులూ తగ్గించి యేడురూపాయల మూడణాలు చేతులో పెట్టాడు. స్కార్ఫెన్ విషయంలో కూడా యీవిధంగానే చేశాడు.

ఈ లెక్కల తరువాత, అతి ప్రేమతో మా యిద్దరికీ, తనకిష్టమైన నాలుగు గ్లాసుల మద్యాన్ని తీసికొని రమ్మని నౌకర్కి పురమాయించాడు.

చెయ్యగలిగిందేమీ లేక, ఆ పానీయాన్ని తాగాము.

ఆ వుదయాన్నే జిల్లాలో జమీందారిణి, సిమియరప్పని, అతని భార్యని ఒకసారి రమ్మని కబురు పంపింది. సిమియరప్పా కొద్దిపాటి పొలాన్ని, ఆ జమీందారిణిదగ్గర అద్దె కౌలికి పుచ్చుకొని, యివ్వవలసిన మగతా కొద్దిరోజుల క్రితం యిచ్చేశాడు. ఆ జమీందారిణీగారికి గతసంవత్సరం సిమియరప్పభార్య, రెండు డజన్ల కోడిగ్రుడ్లు యిచ్చింది. కాని యీ సంవత్సరం అవి ముట్టలేదు. కాని 'అలవాటు' (ఆచార) ప్రకారం ఆ కోడిగ్రుడ్లు తీసుకురాకపోతే, మగతా పూర్తిగా యిచ్చినట్లు కాదని ఆవిడ వాళ్ళతో నిష్కర్షగా చెప్పింది.

మేము వీధిలోకి రాగానే, నడివీధిలో, భార్యను పట్టుకొని చావబాదుతోన్న సిమియరప్ప మా కంటబడ్డాడు. వాళ్ళిద్దరూ చెప్పినమాటల్నిబట్టి తేలినకథ యిది. ముసలి సిమియరప్పయే కోడిగ్రుడ్లు బహుమతిగా జమీందారిణికి భార్యని యిచ్చి

రమ్మన్నాడు. కాని, అవ్వి ఆయేడాదికి బహుమతిగామాత్రమే యిస్తున్నామని అతనిభార్య చెప్పిరాలేదని, అతని వాదన. అందుచేత యిదంతా అవిడతప్పే. దానికి ఫలితంగా, యీయేడాది, వచ్చేయేడాది వాళ్ళు బ్రతికివున్నంతవరకూ, వాళ్ల సంతతికూడా యీ విధంగా యేడాదికి రెండు డజన్ల కోళ్లి గుడ్లు అదనంగా యిస్తోండవలసిందే.

ఈ విషయాలన్నిటినీబట్టి, పెద్దరైతులకీ, జమీందార్లకీ అనుకూలంగావుండే శాసనాలు క్రొత్తగా చేయబడుతున్నాయనీ, రైతుల కనుకూలించే పాత చట్టాలన్నీ రద్దు చెయ్యబడుతున్నాయనీ స్పష్టంగా తెలుస్తోంది.

ఆ జమీందారిణిగారింట్లో ఒక కొలతవుంగరం వుంది. తెచ్చిన కోడిగుడ్లని ఆ వుంగరంలో వుంచి, అవి సరిపోక పోతే మంచివి కావాలి, అవ్వి పనికిరావనీ తిరగగొట్టేస్తోంది. ఆ వుంగరం అతి పురాతనంది. అది మొదట చేయించిన రోజుల్లో కోళ్ళు పెద్దపెద్ద గుడ్లు పెట్టేవి. కాని యిప్పుడు కోళ్లు అంతంత గుడ్లు పెట్టడంలేదు. అదికూడా రైతుల అపరాధమేనా?

సరిగ్గా యీ సమయానికే, డాన్ అబ్బేషియోగారిచేత ఏసుక్రీస్తుపురాణం చెప్పిద్దామని టియోఫిలో అయిదు రూపాయలు ప్రోగుచేశాడు. అబ్బేషియోగారు, ఆడబ్బు సరిపోదు, యింకా కావాలని అన్నాడు. అతికష్టంమీద మరొక అయిదురూపాయలు వసూలు చేశాడు. వీలునిచూసుకొని ఆదివారం ఉదయంనాడు డాన్ అబ్బేషియో వచ్చాడు.

మా గ్రామ చర్చి చాలా పాడుపడిపోయింది. బూజుపట్టింది. గోడలమీదవున్న సున్నపుపూత రాలిపోయింది.

ఆ చర్చిలో వున్న వస్తువులన్నిటిలోను చాలా అందంగా వున్నది ఏసుప్రభువు మహాప్రసాదం. ఏసుక్రీస్తు ఒకచేత్తో తెల్లటి రొట్టెపట్టుకొని యీవిధంగా తెలవిస్తున్నారు. "ఇది నా శరీరం" అంటే తెల్లటిరొట్టె నా శరీరం అని తెలవిస్తున్నారన్నమాట.

తెల్లరొట్టె భగవంతుడన్నమాట. సత్యమూ, జీవితమూ తెల్లరొట్టే! అంతేకాని, రైతులుతినే మొక్కజొన్నరొట్టె కాదు, మతాచార్యులు పంచిపెట్టే పవిత్ర ప్రసాదపు చిన్నరొట్టెలు కాదు. ఏసుచేతిలో ఒక నిజమైన తెల్లటి గోధుమరొట్టెవుంది. "ఇదే (ఈ తెల్లటిరొట్టే) నా శరీరం," అని ఆయన చెబుతున్నాడు.

ఆయన ఆ రొట్టె పరమాత్ముడనీ, సత్యమూ, జీవితమూ, అని ఉద్దేశించాడు. "ఎవరికైతే యీ తెల్లరొట్టెవుందో వారు నన్ను (పరమేశ్వరుణ్ణి) కలిగివున్నారు" అని తెలవిచ్చారు. ఎవరైతే ఈ తెల్లటి గోధుమరొట్టెను కల్గివుండరో, యెవరు మొక్కజొన్నరొట్టెను తింటూవుంటారో, ఆ రైతులు, భగవదనుగ్రహానికి దూరులనీ, సత్యాన్ని తెలుసుకోనివారనీ, నిర్జీవులనీ, ఆయన వుద్దేశించాడు, ఎవ్వనికైతే, తెల్లగోధుమరొట్టె లేదో, అతనికి యేసుప్రభువు లేడు, అతనికి విమోచన యింకా రావలసివుంది.

చెమటోడ్చి, సంవత్సరంపొడుగునా శ్రమించి, పండించిన మా ధాన్యాలన్నీ, పచ్చచేలలోనే, కంట్రాక్టు చేతిలో పడి

పోతే, మేం యేవిధంగా తెల్లరొట్టినిగూర్చి తెలుసుకోగలం?
మేం పండించిన పంటలో మాకు ఏమీ దక్కక, శ్రీమంతు
లకీ, పట్టణవాస్తవ్యులకీ భోగ్యవస్తువు లౌతున్నాయి.
వేదికమీదినుండి, క్రీస్తు "తెల్లరొట్టె నాశరీరం" అని చెబుతు
న్నాడు కాని, మా మొక్కజొన్నరొట్టె అతని దేహం అనడం
లేదు.

"ఓ పరమపితా! మాకు ప్రతిదినమూ తెల్లరొట్టెను ప్రసా
దించుము" అని క్రైస్తవులమైన మన మందరిమూ చేసే
ప్రార్థనలోని రొట్టె, గోధుమరొట్టెకాని, మొక్కజొన్నరొట్టె
కాదు.

శ్రీ ఏసుప్రభువు, తన దేశంలోవున్న, రైతులందరి ఆకలి బాధను
అణచేందుకుగాను చేసినరొట్టె గోధుమరొట్టె కాని, మొక్క
జొన్నరొట్టె కాదు.

బైబిలు చదువుతో డాన్ అబ్బోచియో శాన్ బెరార్డో ఉపా
ఖ్యానం చెప్పాడు.

శాన్ బెరార్డో ఒక రైతు. ఆయన రైతుబుషి. దేశంలో కరువు,
కాటకాలు ప్రజలను వేధిస్తోన్న సమయంలో పెన్నినా రైతు
లకి రొట్టెలను పంచడమే, ఆయన జీవితంలో చేసిన పర
మాద్భుతకృత్యం.

శాన్ బెరార్డో ముసలితనంలో చనిపోయాడు. ఆయన జీవిత
కాలంలో చాలా బాధపడ్డాడు. ఆయన మరణించిన తర్వాత,
విచారణ వేదికవద్దకు వెళ్ళగానే, పరమేశ్వరుడు ఆయనను
కౌగలించుకొని "నువ్వు కోరుకున్నదంతా నీకు ప్రసాదించ
బడుతుంది. కోరుకో" అని శెలవిచ్చాడు.

శాక్ బెరార్డో యీ వరాన్ని విని చాలా వ్యధపొంది నేను 'యేమైనా' సరే కోరుకోవచ్చునా?" అని భయపడుతూ అడిగాడు.

"నీకేది కావలసివస్తే, అదే అడుగు, అది వెంటనే నెరవేరేట్లా అనుగ్రహిస్తాను. నేనేది చెయ్యదలుచుకుంటే, యీ స్వర్గంలో అది చెయ్యగలను. ఇక్కడ పూజార్లుగాని- పీఠాధిపతులు గాని లేరు. అంతేకాకుండా నీకు మేలు చెయ్యదలుచుకున్నాను. కాబట్టి నువ్వు కోరిందల్లా తక్షణమే యిస్తాను."

కాని శాక్ బెరార్డో తాను కోరదలచినది పైకి చెప్పసాహసించ లేక పోయాడు. తనకోరిక భగవంతుడికి కోపం కలిగిస్తుం దేమోనని భయపడ్డాడు. కాని భగవంతుడు, చాలా బల వంత పెట్టిన మీదట "ఓపరమాత్మా, నాకు పెద్దరొట్టెని ప్రసాదించు" అని కోరుకున్నాడు.

భగవంతుడు అన్నప్రకారం కోపం పొందక, ఆతనిని కౌగ లించుకొని, అతనితోపాటు పరితపించి, మేఘధ్వానంతో పండ్రెండుమంది దేవతలను పిలిచి, స్వర్గంలో ఆయన కోరు కున్నంతరొట్టె నివ్వమని ఆజ్ఞాపించాడు.

అది నాలుగువందల యేళ్ళక్రితం జరిగింది. ఆరోజునుంచి, యింతవరకూ ఒక్క రైతుకూడా స్వర్గానికి వెళ్ళలేదు.

మా ప్రాంతాల్లో ముసలితాతలు పిల్లలకిచెప్పే నిజమైన కథ యిది. మతగురువులు యీకథని మార్చిచెబుతారు. ఆధు నిక మతగురువుల ప్రకారం, స్వర్గలోకంలో అసలు తినవల సిన అవసరమే వుండదు. తిండికి బదులుగా నిరంతర భగవ

స్వరూపదర్శన భాగ్యంతో కడుపు నిండిపోతుం దట! అది నిజమే అయితే, యీలోకంలో సుకీ తృప్తిగా తినవలసిన అవసరం వుంది. డా॥ అబ్బేషియోకూడ అల్లాగే యెంచి వుండాలి, లేకపోతే ఆతని బొజ్జ బానలాగ పెరిగివుండక, మా రైతులవలెనే, వెన్నెముకకు అంటిపెట్టుకొని వుండేది.

భగవంతుని కటాక్షవీక్షణాలు ఫాంటమూరా ప్రజలమీద ప్రసాదించేందుకుగాను చాలా తరుచుగా బైబిలు పురాణ కాలక్షేపం చెయ్యడం, భగవత్పూజలు చేయించడం చాలా అవసరం అని చెప్పి అబ్బేషియో ముగించాడు.

"మీరు ఒక్కసారి పూజచేయించి, బైబిలు కాలక్షేపం చేశారు

మీరు కోర్టులో యేదైనా కేసుచేస్తే, ప్లీడర్ని ఒకసారికలుసుకొని, ఒక అరగంట మాట్లాడి తృప్తిపడతారా? అనేక పర్యాయాలు కలుసుకొని సలహా తీసుకుంటారు. ఆ విధంగానే, భగవంతుడితోకూడా పదేపదే మొరబెట్టుకొంటూ వుండాలి. చాలా తరుచుగా భగవంతుణ్ణి ప్రార్థించాలి. మీ భక్తిని వెల్లడించాలి. అందుచేత తొమ్మిదిరోజులు వరుసగా మీరు పూజలు చేయించాలి. ఈ పనికి మీకు షాతిక ముప్ఫై రూపాయలు ఔతుంది——"

"డబ్బు, డబ్బు, డబ్బు అస్తమానమూ డబ్బే" అంటూ అందరికీ వినపడేట్లా బెరార్డోఅని, విసవిసా పైకివచ్చేశాడు. మరికొందరు యువకులుకూడా అతణ్ణి వెంబడించారు.

అబ్బేషియో త్వరత్వరగా ముగించి, తెల్లటి పొడుగుఅంగీ ధరించి, ముఖం దాచుకొని వెళ్ళిపోయాడు.

బాగావున్న రోజుల్లో పురోహితులు, భగవత్కథలు చెప్పి పూజా పురస్కారాలు చేయించి, ఖనన సంస్కారాదులు చేయించి జీవితాన్ని గడిపేవారు. కరువుకాటకాల్లో, రైతులే తిండిలేక పస్తులుండే సమయాల్లో ఆ బీదపురోహితుల గతి వేరే చెప్పాలా?

కరువుకాలాల్లో రైతులు ఒకళ్ళతో ఒకరు వైరాలు పెంచుకుని కలహిస్తుంటారు.

ఫాంటమారాలోవున్న యే రెండుకుటుంబాలూ విరోధాలు లేకుండా కలిసిలేవు. పగలు స్త్రీలు స్త్రీలూ, రాత్రిపడి పురుషులింటికిరాగానే మొగవారు ఘర్షణలు పడేవారు. బదులుచేసిన పప్పు, ఉప్పులు తిరిగి యివ్వకపోయినందుకో, యిటికలు పోయాయనో, గడ్డి దొంగతనంగా తీసుకెళ్ళారనో, వంక పెట్టుకుని వీధిపడి తిట్టుకుంటారు.

బీదల్లో, అతి చిన్న విషయాలకోసం పెద్దదెబ్బలాటలు జరుగుతాయి. కాని నీటి తగాదాలు అన్నిటికంటె పెద్ద కారణం.

ఒక కొత్త కాలవ త్రవ్వబడింది. ఫాంటమారా జలధారలోని నీరు ఆ కాలవగుండా ప్రవహిస్తోంది.

రెండు పెద్దతూరలతో ఒక డాము కట్టబడింది. ఆ డాము నుంచి, కంట్రాక్టరు కెంత నీరు వెళ్ళాలో, ఫాంటమారా రైతుల కెంతనీరు వెళ్ళాలో నిర్ణయింపబడేరోజున ఫాంటమారా

రైతులందరూ ఆ డాము వద్ద గుమిగూడారు. మాకు, ఆ కంట్రాక్టరుకీ మూడేసిపాళ్ళు యెలావస్తుందో మాకింకా అర్థంకావడం లేదు.

పట్టణం నుంచి వందమంది సైనికులు వచ్చి బారులుతీర్చి నిలబడ్డారు. ఆ కాలవదగ్గరనుంచి మమ్మల్ని దూరంగా వెళ్ళి నిలబడమన్నారు. మేము వాళ్ళ ఆజ్ఞల్ని వ్యతిరేకించలేక పోయాము.

కొంచంసేపైన తరువాత, ఫాసిష్టుపటాలము, కంట్రాక్టరు, గౌరవనీయుడైన పెలినో ఇంకా అనేకమంది పెద్ద అధికార్లు వచ్చారు.

డాన్ సర్కోన్‌స్టాంజా తిన్నగా మాదగ్గరకివచ్చి, మాలో ప్రతి వారితోనూ కరచాలనంచేసి, మా మంచికొరకు గాను, ఆనీటి విషయాన్ని ఆయనచేతిలో వుంచమన్నాడు. ముగ్గురు పెద్ద మనుష్యులతో కూడిన సంఘాన్ని నియమించి, ఆ నీటిపంపకాన్ని జాగ్రత్తగా చూచేందుకు నిశ్చయించుకున్నాం. పిలాటో, లోసర్డో, నేను ఆ సంఘంలో వున్నాం. తక్కినవారంతా రోడ్డుమీద నిలబడ్డారు.

అంతా సిద్ధమైన తరువాత, దస్తావేజులు నమోజుచేసే రిజిష్ట్రారు కంట్రాక్టరు, ఫాంటమారా గ్రామస్తులు చేసుకున్న ఒడంబడికను పైకిచదివి యీ విధంగా అన్నాడు.

"ఈ ఒడంబడిక చాలా స్పష్టంగావుంది. మూడుపాళ్ళ నీరు కొత్తకాలవగుండాను, మూడుపాళ్ళనీరు పాత కాలవగుండాను ప్రవహించేందుకు మీ వుభయపక్షాలు ఒడంబడిక చేసుకున్నారు.

"అదితప్పు! ఒడంబడికలో, ఉభయపక్షాలకీ మూడేసిపాళ్ళు అంటే యిద్దరికీ చెరిసగం, అంటే మాకు మూడుపాళ్ళు, కంట్రాక్టరుకి మూడుపాళ్ళు అని వుంది. ప్రతిమనిషికి న్యాయమైనభాగంకావాలి అని నావుద్దేశం" అని పలాటో ఆవేశంతో అన్నాడు.

"అబ్బే, అల్లాకాదు, మనకి మూడువంతు లనీ, పైగా మిగిలింది కంట్రాక్టరుకనీ ఆ ఒడంబడికలో వ్రాసివుంది. అదైనా పైనమిగులు తేనే, కంట్రాక్టరు కివ్వడం" అని గట్టిగా లోసర్డా అన్నాడు.

"ఉభయపక్షాలకీ మూడేసివంతు లనడం శుద్ధతప్పు. నా జీవితంలో యెప్పుడూ యిల్లాంటిది వినలేదు. నిజానికి యీ నీరు ఫాంటమారాకు చెందినది. కంట్రాక్టరుగారికి ఒక గిన్నెడునీరు కూడా యివ్వనక్కర లేదు. ఇక ముందుకూడా మనకే చెంది వుండాలి." అన్నాను నేను.

రోడ్డుమీద గుంపులుకూడివున్న తక్కిన రైతులు, మేము వేసే కేకలువిని, మా ఖంగారుచూసి, రైతులకి అన్యాయం జరిగిందనే ఉద్దేశ్యంతో సర్వం పోగొట్టుకొన్న వారివలె గోల చెయ్యడం మొదలెట్టారు.

"ఫాంటమారా గ్రామస్తులు దౌర్జన్యంగా ప్రవర్తిస్తున్నారు గనుకనూ, వారి ప్రతినిధులు వారిలో వారికి కుదరక ఘర్షణపడుతోన్నందువలనను, నా ప్రజాసంఘాధ్యక్షు వాక్కుల విని యోగించి, పెవినో, సర్కోస్టాంజాగార్లను ఫాంటమారా ప్రతినిధులుగా నియోగిస్తున్నాను" అని కంట్రాక్టరుగారు ప్రకటించారు.

ఆరుగురు సైనికులువచ్చి మమ్మల్ని తక్కిన గ్రామస్థులున్న చోటకు తీసికొనివెళ్ళి, వదిలారు.

"శాంతంగా వుండండి! నాయందు విశ్వాసం వుంచండి! అంటూ సర్కోస్టాంజా బిగ్గరగా చెప్పాడు.

ఆ కాలవదగ్గర యేమిజరుగుతోందో మాకేమీ కనబడటం లేదు. సైనికులు, రిజిష్ట్రారు, ఒకశిల్పి, నలుగురు తవ్వేపని వాళ్లు కాలవగట్టున నిలబడ్డారు. సర్కోస్టాంజా, పెవినోలు, నిర్మాణశాస్త్రజ్ఞునితో పదే పదే ఆలోచనలు చేస్తున్నారు. "ఉభయపక్షాలకీ, ఒక్కొక్కరికి మూడేసిచంతుల పంపకం ప్రకారం నీరు యెట్లా పంచబడుతోందో మాకు తెలియడం లేదు. మేము నిలబడినచోటుకంటె, బాల్ద్రిస్సెరాతోటవగ్గర చూస్తే, మా కాలవలో యెంతనీరు తగ్గుతుందో తెలుస్తుంది అని అటువైపు తదేకదీక్షతో చూస్తున్నాము.

ఆకాలవలో నీటిమట్టము అంతకంతకు తగ్గిపోతోంది. మాకు ఘోరమైన అన్యాయం జరుగుతుందని మొదినుంచీ అనుకుంటోన్నప్పటికీ, యదార్థంగా మా కాలవలో నీరు తగ్గిపోతోవుంటే మాకు చాలా బాధకలిగి తిట్టనారంభించాం."

"దొంగలు! దొంగలు! దొంగలు!"

అనేకమంది స్త్రీలు మోకరిల్లి శాపనార్థాలుపెట్ట నారంభించారు.

అన్యాయంచేసి యెంతనీరు తీసికెడుతున్నారో అంతరక్తం కక్కుకుని చావ!

"వాళ్ల కడుపులు కాల!

"వాళ్ళ పెళ్లాంబిడ్డలకి దూరమైపోను!

"మా నీళ్లు వీళ్ల యెగాన పోసుకొని, యెంతకాలం ఉట్టిగిట్టు కొని వూరేగుతారు!

"దేవుడు లేడూ!

"వీళ్ళ అన్యాయం వీళ్లని కాల్చెయ్యదూ?

ఈలోపుగా నీరు పూర్తిగా తగ్గింది. అడుగున వున్న రాళ్ళు, రాళ్లకిపట్టిన నాచు మొక్కలు కనబడుతున్నాయి.

'మన నీరంతా! నీరంతా! కాలవలో నీళ్లన్నీ తీసుకపోతున్నారు. అని మళ్ళీ పిచ్చియెత్తినట్టు అరుస్తున్నాము. స్కార్పోన్ మరికొందరు కుర్రాళ్ళు సైనికుల్ని గెంటుకుని ముందుకువెడదామని ప్రయత్నించారు. సైనికులు లాఠీలతో బాదుతో, "వెనక్కిపొండి! వెనక్కిపొండి" అని గట్టిగా దమాయిస్తున్నారు.

ఆ గందరగోళంలో, చాలా కష్టంమీద సర్కోస్టాంజా మాకు వినపడేట్లా అరిచాడు.

"శాంతంగా వుండండి! శాంతించండి! దుడుకుగా ప్రవర్తించకండి! మీ లాభంకోసం ప్రయత్నిస్తున్నాను! అంతని నాకు వదిలెయ్యండి."

మా దగ్గిరికివచ్చి డాన్‌సర్కోస్టాంజా ఉపన్యాసం ఆరంభించాడు.

"నాలో విశ్వాసంలేదు, మీకు? నాలో విశ్వాసంలేదు కనుకనే మీకు కష్టాలు కలుగుతున్నాయి. ఊరికే అరిచినందు

వల్ల, దార్జన్యం చేసినందువల్ల మీకేమైనా లాభం కలుగుతుందనా, మీ వుద్దేశం ?''

కంట్రాక్టరువైపు తిరిగి,

'' వారిలో ప్రబలివున్న అసంతృప్తిని మీరు గుర్తించాలి. ఒక సమాధానమార్గం అన్వేషించాలి. మీరు వుదారులు, ప్రజామిత్రులు, మహాశయులు, పరోపకారపారీణులు కాబట్టి, యీ ఫాంటమారా గ్రామస్తులని గౌరవించమని మిమ్మల్ని కోరుతున్నాను. ప్రజాసంఘం చాలా డబ్బు ఖర్చుపెట్టి విశేష శ్రమకులోనైనమాట నిజమే. కాని జరిగిందేదో జరిగింది. అందుచేతనే భగవానుడైన ఏసుప్రభువు 'గతంనాస్తి' అని శెలవిచ్చారు. అందుచే యీ కాలవ సంపూర్తిగా యెప్పుడు ఫాంటమారావాళ్లకి తిరిగి యిచ్చివెయ్యబడుతుందో, శెలవియ్యండి. ఎన్నియేళ్లలో మీకు దానిమీదవున్న హక్కులన్నీ వదులుకుంటారు?''

'' వ్యాభైయేళ్లు!'' అని కంట్రాక్టరు అన్నాడు.

వెంటనే ప్రజలందరు రోషావేశంతో పళ్లు పటపటకొరికారు. '' మా పీకలు పోయినాసరే! జైలుకి వెళ్ళినాసరే! దొంగ! దొంగా!

మళ్ళీ సర్కోస్టాంజా మమ్మల్ని ఆపాడు. కంట్రాక్టరుతో

ఫాంటమారా ప్రజల ప్రతినిధినైన నేను పోడెస్టాగారి సలహాని అంగీకరించలేను. వ్యాభైయేళ్లు చాలా యెక్కువ. అంతకంటె చాలా, చాలా తక్కువకాలాన్ని మనం నిర్ణయించాలి.''

"నలభై యేళ్ళు" అన్నాడు అబ్బేపిరో.

"ఇరవైఅయిదు" అన్నాడు రిజిష్ట్రారు.

కాని ప్రతి కొత్తసలహాని మేము నిరసించాము.

నొస్ట్రాంజా ముందుకువచ్చి రాజీప్రయత్నం చేశాడు.

"అయ్యా, యీ ఫాంటమారా గ్రామస్థులు శ్రమజీవులు. వీరి విషయంలో తామూ మీ ప్రయోజనాలను, లాభాలను కూడా త్యాగంచేసి, మీ వుదారతను వెల్లడించాలని కోరు తున్నాను. పది నక్షత్ర కాలాల తరువాత మీరు ఫాంటమారా రైతులకు వదలివెయ్యాలి. ఒప్పుకోక తప్పదు. ఈ త్యాగం చెయ్యాలి!"

కంట్రాక్టరుని అందరూ చాలాసేపు బ్రతిమాలారు. కంట్రా క్టరు ఆఖరికి ఒప్పుకున్నాడు.

రిజిష్ట్రారు ఒక ఒడంబడిక పత్రాన్ని రాశాడు. రైతు ప్రతి నిధులు, కంట్రాక్టరు సంతకాలు చేశారు.

(పది నక్షత్ర కాలాలంటే పదిరాత్రులో, పదినెలలో, యెన్ని సంవత్సరాలో మాకో యెవ్వరికీ తెలియలేదు.)

౭

పదినక్షత్ర కాలాలంటే యెంతకాలం? అని ఫాంటమారాలో వాదోపవాదాలు జరిగాయి.

పోస్టాపిరో వీరుడు పది సంవత్సరాలు అన్నాడు. బాల్డిస్సేరా సేనాని పది శతాబ్దాలు అని వాదించాడు.

"పోనీ, పదినెలలు కాకూడదా?" అంటూ సోర్సనారా అనబోయింది.

ఏవిధంగా చూసుకున్నప్పటికీ, పది నక్షత్రకాలాలంటే ఫాంటమారా వాళ్ళకి పదకొండు నెలలు అన్నమాట. మా కాలవనీటితో తడుపబడే పొలాలు రోజు, రోజుకి యెండి నెరలుతీస్తున్నాయి. కరువు లో అధిక మాసం అన్నట్లు మే నెలనుంచి యింతవరకూ వర్షాలు లేవు

ఈ ఆకాశాన్ని చూసుకుని, పూజలు చేయించండి అంటూ అబ్బేచియో అడిగాడు. టియోఫిలో నోటికివచ్చిన బూతులు తిట్టి సాగనంపాడు.

మా పంటలన్నీ మెల్లిగా మండిపోతున్నాయి. గ్రామాన్నుంచి చూస్తే లంటోసియో, పిలాటోల పొలాలు కొద్దిగా బాగున్నట్లు కనపడుతున్నాయి. కాని అవికూడా యెండిపోయాయి. మొక్కజొన్న కాడలుమాత్రం పొడుగుగా పెరిగాయి. కాని పొత్తులు మాత్రామంటే కనబడటం లేదు. వేసిన పొత్తులలో గింజలు లేవు. అంతా పొల్లే, ఆ పంట పశువుల కుపయోగిస్తుంది.

సియురప్పా, మిచెలీ, నేను చిక్కుడుపాదులు పెట్టాం. వాటి స్థితి మరీ అధ్వాన్నంగా వుంది. చిక్కుడుకాయలు ఎండిపోయాయి. తక్కినవాళ్ళ పొలాలమీద అగ్నిపర్వతాలలోంచి శిలాద్రవం ప్రవహిస్తున్నట్లు భగ భగ మని పొగలు జిమ్ముతున్నాయి.

ఫాంటమారాలో నాలుగు మూలలా ఆకలిజ్వాలలు లేస్తున్నాయి.

సామాన్యంగా మా పొలాలమీద పండేపంట పన్నులకి భూమి శిస్తుకి సరిపోయేది. మేము మగతాలకి తీసుకున్న భూములమీద వచ్చే కొద్ది మొక్కజొన్న శీతకాలంలో తినేందుకు మిగిలేది. మా నీరు దొంగిలింపబడటంతో, వర్షాకాలంలోనూ, శీతాకాలంలోను మేము తిండిలేకుండా గడపవలసిన దుర్దినాలు వచ్చాయి. కాని తిండిలేకుండా మానవులు రోజులు గడపగలరా? అసాధ్యం. మేమెవ్వరమూ కడుపులో కాళ్ళు పెట్టుకొని పడుకోవాలని అనుకోవడం లేదు. కాని మాకు దిక్కెవ్వరు?

ఉభయపక్షాలకీ చెరి న్యూడేసిపాళ్ళు, అటుపైని పది నక్షత్ర కాలాల సంగతులు జరిగిన తరువాత చదువుకున్న పెద్దమనుష్యుల్లో మాకు విశ్వాసం క్షీణించింది. మేమెవరినైతే నమ్మామో, ఆయనే రెండుసార్లు మమ్మల్ని దగాచేశాడు. ఈ జీవితంలో మరెవ్వర్నీ నమ్మలేము. మాకు దిక్కెవ్వరు?

మేము నమ్మినవారే మమ్మల్ని గోతులో దింపుతే, కంచే చేను మేస్తే మాకు రక్షణ యేది? చదువుకున్నవాళ్ళు, పలుకుబడివున్న పెద్దరైతులూ పెట్టే కక్షల్లో యేదో ఒకదాంట్లో రైతులు జేరుతోవుంటారు. వాళ్లమీదనే ఆధారపడతారు. పెళ్ళిసంబంధాల విషయంలోను, కోర్టు వ్యాపారాల్లోను, యేదైనా కొత్తపనులు చూపించడంలోను, యింకా కొన్ని వందల చిల్లర మల్లర వ్యాపారాల్లోను ఆ ముఠానాయకుడు ఆదుకుంటాడు. ఆ నాయకుడు మా రైతుల్ని మోసగిస్తే, మాకుదిక్కు, తెన్నుతోచక అల్లాడిపోతాం.

పూర్వపురోజుల్లో, జిల్లా కలెక్టరుగారి దగ్గరికి గాని, రిజిష్ట్రారు ఆఫీసుకుగాని, తహశ్శీలుదారుగారి దగ్గరికిగాని, మరే ప్రభుత్వోద్యోగి కార్యాలయానికిగాని యే రైతైనా వెళ్లడానికి చాలా జంకేవాడు.

పూర్వపు రోజుల్లో గ్రామానికి యిద్దరో ముగ్గురో పెద్దరైతులుండేవారు. వారి పరిపాలన చాలా తేలిగ్గా వుండేది. పండిన పంటలో చాలాభాగం తీసుకుపోయి, కొద్దిగా తిండికి మిగిల్చే వారు. కాని, పైడమాంటీస్ ప్రభుత్వం రాగానే కోర్టులు, దస్తావేజులు, పన్నులు వసూలుచేసే ప్రభుత్వోద్యోగులు బయల్దేరారు. ప్రతి పనికీ వకీళ్లఅవసరం కలిగింది. పేరుకి మాత్రం కోర్టులో అందరికీ ఒకేవిధమైన న్యాయం లభిస్తుందనడమే గాని, భాగ్యవంతులుమాత్రం, న్యాయవాదుల వాదనలచేత వారికి అనుకూలంగా వుండేట్లుగా మార్చుకునే వారు. అందుచేత న్యాయవాదుల అవసరం బాగా హెచ్చింది.

నా చిన్నతనంలో, మా వూరుదగ్గరవున్న పట్టణంలో యిద్దరు న్యాయవాదులుమాత్రమే వుండేవారు. వారే దస్తావేజులు మొదలైన పత్రాలను రిజిష్టరుచేయించేవారు. కాని, యిప్పుడు వాళ్ళసంఖ్య విపరీతంగా పెరిగిపోయింది. ప్రతిరోజు, కొత్తతగాదాలుసృష్టించి, చిన్నవాటిని పెద్దవి చేస్తున్నారు. వాళ్ళుజీవించాలంటే, వంశపారంపర్యపు తగాదాలను రేపడం ఆస్తి, పాస్తుల విషయాల్లో కొత్తవిరోధాలు పుట్టించడం చేయవలసి వస్తోంది. పూర్వపు రోజుల్లో చులాగ్గా పంచాయతుల్లో పరిష్కరించబడే తగాదాలు, యీ న్యాయవాదుల

మూలాన్ని సంవత్సరాలవరకూ పొడిగింపబడుతో, విరోధా లని పొడిగిస్తున్నాయి. ఈ న్యాయవాదుల మూలాన్ని ఇరుగు పొరుగువాళ్ళకి పోత్తులు చెడ్డాయి. వారు ధరించే దుస్తులు, ఒకరికొకరు నమస్కారం చేసుకునేరీతి, మాట్లాడేరీతి ప్రవర్తన అన్నీ బీద ప్రజల మనస్సులను ఆకర్షించేటట్లు వుంటాయి.

ఒక న్యాయవాదని సలహాదారుగాను, విహితుడుగాను కలిగి వుండటాన్ని చాలా గొప్పగా రైతు యెంచుకుంటాడు. రైతుల యిండ్లలో జరిగే వివాహాది శుభకార్యాలకి న్యాయ వాదులు వస్తే రైతు చాలా గర్వించేవాడు.

ఆ న్యాయవాదులు జిల్లాబోర్డు అధ్యక్షులు, పురపాలక సంఘాధ్యక్షులు అయ్యేందుకు పెద్ద కక్షలను లేవదీసేవారు. ఆపదవులని సంపాదించిన కక్షవారు, తమపక్షములోనివారికే వుద్యోగా లివ్వడం, యితరులను పైకి రానివ్వకపోవడం, జరుగుతూండేది.

పోగొట్టుకునేందుకు, సంపాదించుకునేందుకూ కూడా యేమీ లేనివారు మాత్రమే యీ కక్షలకు అతీతులుగా వుండేవారు. వ్యవసాయ కూలీలు, బిచ్చగాండ్రు, దోషులు కండ్లమూసు కుని యెవ్వరికీ జోహార్లు చేసేవారుకారు.

ఈ మధ్యకాలంలో, యితర ప్రదేశాలను చూచి, మావైపున కూడా రాజకీయపక్షాలను స్థాపించారు. పాత విరోధస్తులు యీ కొత్తపక్షాలపేర్లు పెట్టుకుంటున్నారు. డాన్ సర్కోస్టాంజా పల్లెటూళ్ళలో తన పలుకుబడిని వృద్ధిచేసుకునేందుకు పీపిల్సు పార్టీ (ప్రజాపక్షం) ని స్థాపించాడు. తాను స్వతంత్రుడనీ,

మా కేవిధమైన హానీ జరుగనీయననీ, మా సేవ చేసేందుకే ప్రజాపక్షం ప్రయత్నిస్తుందనీ చెప్పేవాడు. కాని కంట్రాక్టరు అధికారంలోకి రాగానే మతం మార్చాడు.

కొత్తబ్యాంకి రావడంమూలాన్ని డాన్ కార్లో మొదలైన పెద్ద భూస్వాములు చాలా నష్టం పొందారు బజారులో ధాన్యాల ధరలు నిర్ణయించేది కంట్రాక్టరే గాని, వారేమీ చెయ్యలేక పోతున్నారు. వంతెనలు వేయించడం, రోడ్లు పోయించడం, పాఠశాల భవనాలు కట్టించడం మొదలైన అన్ని ప్రజోపయోగకార్యాలు చేయించే కంట్రాక్టు లన్నీ కంట్రాక్టరుకే లభిస్తున్నాయి.

కంట్రాక్టరువల్ల తాము పొందేనష్టాన్ని, బీదరైతులదగ్గర నుంచి రాబట్టుకునేందుకు భూస్వాములు ప్రయత్నిస్తున్నారు. రైతుల్ని, పనివాళ్ళని కంట్రాక్టరుమీద తిరగబడమని రహస్యంగా తీవ్రమైన ప్రచారం చేస్తున్నారు. డాన్ సర్కోస్టాంజా, తదితరులు కంట్రాక్టరు విషయంలో చాలా తమాషాగా ప్రవర్తిస్తున్నారు. బీదల్ని దోచుకోవడంలో ఆరితేరిన సర్కోస్టాంజా, జిత్తులమారి సర్కోస్టాంజా, రైతుల మనస్తత్వం తెలిసిన సర్కోస్టాంజా, కంట్రాక్టరుకీ రైతులకీ మధ్యవర్తిగా నటిస్తో, ఉభయత్ర పలుకుబడిని వృద్ధిచేసుకునేందుకు ప్రయత్నించేవాడు. కాని మా కష్టసమస్యా లన్నింటిలోను కంట్రాక్టరుకే సహాయంచేసేవాడు.

ఇంతక్రితం అనేక వందలసార్లు సర్కోస్టాంజా మమ్మల్ని మోసగించాడు. కాని మాతో చాలా స్నేహంగా, మర్యా

దగా ప్రవర్తించేవాడు. మాతో కరచాలనం చేసేవాడు. త్రాగివున్నప్పుడు కౌగిలించుకునేవాడు. అందుచేత మాకు ఆయనమీద కోపం వుండేదికాదు. అంతేకాకుండా ఆయన రక్షణకూడా మాకు చాలా అవసరం. కాని ఉభయ పక్షాలకీ మూడువంతులు, పది నక్షత్రకాలాలు పన్నాగాలు మాకళ్ళు పూర్తిగా తెరిచాయి.

అందరూ మాకు వ్యతిరేకంగా వున్నారు. మాకు ఎక్కన్నాయి? "రైతులకి తిండిలేదు. తోలు పనివాళ్ళకి చెప్పులు లేవు. దర్జీల చొక్కాలనిండా తూట్లు వున్నాయి. ఇటిక పనివాళ్లకి తలదాచుకునేందుకు కొంపలేదు. ఇల్లాంటి దైనిక పరిస్థితులు వచ్చాయి. ఇది బ్యాంకియుగం. ఈ యుగంలో స్వాం నాశనమే? అరాచకపు రోజులు వచ్చాయి" అంటూ బాల్డిస్సేరా ప్రచారం చేస్తున్నాడు.

నీటిని పోగొట్టుకోవాలని యెవ్వరికీ లేదు. కాని మా కాలవ నిండా యథాప్రకారంగా నీరు తెచ్చుకోవడానికి మార్గం యేమిటి? పిలాటో, జోంపాలు కంట్రాక్టరుమీద కేసు చేద్దామన్నారు. కాని నేను అందుకు అంగీకరించలేదు. ఈ కేసు కొన్ని శతాబ్దాలవరకూ జరుగుతుంది. వాయిదాలమీద వాయిదాలు. కోర్టుతరువాత కోర్టు తిరుగుతుంది. చివరకు తేలిచావదు. భాగ్యవంతులమీద వేసే కేసులన్నీ యీవిధంగానే జరిగాయి. ఒకవేళ కేసుచేసినప్పటికీ, యెవరు వాదించిపెడతారు? సరోక్కాస్టాంజా? మరొక పన్నాగం పన్నుతాడు. ఈ విషయం తలపెట్టక పోవడమే మంచిది.

పని యెల్లావున్నా, మా కాలవ నీటిని పోగొట్టుకునేందుకు మా కెవ్వరికీ యిష్టం లేదు. మా పంటలు పాడుచేసుకోవాలనీ, శీతాకాలంలో మాడిచావాలనీ యెవ్వరూ కోరుకోవడం లేదు. "ఈ దొంగలబారినుంచి మనకి రక్షణ లేకపోతే, ప్రళయం వస్తుంది" అన్నాడు, పిలాటో.

న్యాయస్థానాల్లోను, ప్రభుత్వశాసనాల్లోను, న్యాయం లేకపోతే, ఏ ప్రభుత్వోద్యోగులైతే ఆ శాసనాల్ని ఆచరణలో వుంచాలో, వారే వాటిని అతిక్రమిస్తోంటే, ప్రజాశాసనం అమలు జరిగేట్లాగు మనం అందరమూ ప్రయత్నించాలి." అన్నాడు బాల్డిస్సెరా.

"ప్రజాశాసనం అంటే యేమిటి?"

"తనకి తాను సహాయంచేసుకునే మానవుడికే, భగవంతుడు సహాయం చేస్తాడు" అంటూ బాల్డిస్సెరా, బెరార్డో యెప్పుడూ చెబుతోండే కార్యక్రమాన్ని మా ముందర వుంచాడు.

దానిని యెవ్వరూ కాదన లేదు.

రాఫేల్ జేబులోంచి అగ్గిపెట్టె తీసి, 'ఇదే ప్రజాశాసనం' అన్నాడు.

బెరార్డో యేమీ మాట్లాడ లేదు. పూర్వంమాదిరిగా లేడు. ఎల్వీరాతోటి మొదటిరాత్రి గడిపిననాటినుంచి అతని మనస్సు మనస్సులో లేదు. ఎల్వీరా మంచంమీదనుంచి లేవగలిగిన స్థితిలో లేదు. చిక్కి శల్యం అవుతోంది. ఐనప్పటికీ ప్రతిరాత్రి ఆమెతో వుంటున్నాడు.

"ఆ అమ్మాయిని చంపేస్తావు" అంటే ఒకసారి నా భార్య. భుజాలు ఎగరవేసి సమాధానం చెప్పకుండా వెళ్ళిపోయాడు. పది నక్షత్రకాలాల పన్నాగం అతనిలో ఏమీ మార్పు తీసికొని రాలేదు. మా నీటిని తిరిగి సంపాదించుకునేందుకు మేము చేసే ప్రయత్నాలు అతనిలో ఏమీ ఉత్సాహాన్ని తీసికొనిరాలేదు.

"దున్నుకునేందుకు నాకేమీ భూమి లేదు. నేను ఇదివరకు మల్లే కుర్రాణ్ణి కాదు. నా స్వంత వ్యవహారాలు నేను చూసుకో వలసిన బాధ్యత నెత్తిమీద పడింది. నా తంటాలు నేను పడాలి."

బెరార్డోలో ఒక ఆలోచన స్థిరపడింది. అక్కడినుంచి ఎక్కడి కైనా వలస వెళ్ళాలి. దున్నపోతులాగు రాత్రింబగళ్ళు పని చెయ్యాలి. ఒక యేడాదిలోనో, ఆరు నెలల్లోనో ఫాంటమారా వచ్చి, ఒకటి రెండెకరాలు భూమి కొనుక్కొని, వివాహం చేసుకోవాలి. ఈ ఆలోచన తప్ప అతనికి మరొక ఆలోచన లేదు. పూర్వపు మనిషి కాదు. సంపూర్ణంగా మారిపోయాడు. అనేకసార్లు పోర్టాపియో పీరుడితో ఈ విషయాన్నిగూర్చి ఆలోచిస్తుండేవాడు.

"చాలా కష్టపడి పనిచేస్తాను. వీళ్ళకీ వాళ్ళకీ. దాసీపిల్లల్ని తార్చే పనిలాంటి పనికాదు. ఫాసిష్టుపనీ నాకక్కర్లేదు. అసలైన పని నాకు కావాలి."

పోర్టాపియో పీరుడు రోమ్‌లోని చాలామందికి ఉద్యోగాల కోసం రాశాడు. ఓటలో పని ఖాళీగావుందని సమాధానం వచ్చింది.

"రోజుకి మూడు రూపాయలాట్టే యెక్కువ కావు. అది సాధారణపు జీతమే. ఐతేం, నేను అందరికంటె యెక్కువ కష్టపడతాను. ఎక్కువ సంపాదించుకుంటాను. పొట్ట గట్టిగా బిగించి, నాలుగురాళ్ళు నిలవ చేసుకుంటాను."

బెరార్డో వెయ్యి రూపాయలు నన్ను బదులు అడిగాడు. నా కొడుకు కూడా తీసుకొని వెళ్ళే పద్ధతిమీద యిస్తానన్నాను. బెరార్డో ఒప్పుకున్నాడు. ఎల్వీరా యిరవై రూపాయలు యిచ్చింది.

బెరార్డో వెళ్ళేముందు, నా కొడుకునిగూర్చి కొన్ని సలహాల నివ్వాలని బెరార్డో దగ్గిరికి వెళ్ళాను. యథాప్రకారంగానే, బెరార్డో, ఎల్వీరాదగ్గర కూర్చున్నాడు. నేను చెప్ప నారంభించాను.

"రోజుకి పదిగంటలకంటె యెక్కువగా నా కొడుకు పని చెయ్యకూడదు. చెడిపోయిన ఆడాళ్లుండేచోట మా అబ్బాయిని వుండకుండా కనిపెడుతో వుండు........"

సరిగ్గా యీ సమయానికే రాఫేల్ లోపలికి గబగబా వచ్చాడు. అతని వెంబడి వచ్చిన మరికొందరు అవతల వేచి వున్నారు.

"సులోమ్నా విప్లవం జరుగుతోంది! అంటూ గట్టిగా బెరార్డోతో రాఫేల్ చెప్పాడు.

"ఎల్లాంటి విప్లవం? మిఠాయివాళ్లు చేస్తున్నారా? అని అడిగాడు బెరార్డో.

"కాను, రైతులు యెదురు తిరిగారు' అంటూ రాఫేల్ చెప్పాడు. అతడు వేళాకోళాలని సహించేస్థితిలో లేడు.

"ఈ సంగతి యెవరు చెప్పారు?" బెరార్డొ అడిగాడు.

"బాల్దిస్సేరా"

"బాల్దిస్సేరాకి యెవరు చెప్పారు?"

"అది రహస్యం"

"ఐతే అది అబద్ధం" అని బెరార్డొ నిశ్చయించాడు.

స్కార్పోన్ వీధిలోకి వెళ్ళి బాల్దిస్సేరాకోసం కబురు పంపించాడు. బాల్దిస్సేరా వచ్చి "తోళ్ళుకొందామని పట్టణానికి వెళ్ళాను. జిజ్జోలా జమీందారిణిగారు అప్పుడే చర్చిలోంచి వస్తో, చిన్నప్పుడు నేను వారి నౌకరీలో వున్నాను కనుక నేను కనపడినప్పుడల్లా పలకరిస్తోంటారు. "భగవంతుడే నిన్ను పంపించాడు. మా యింటికిరా, నీతో కొన్ని సంగతులు మాట్లాడాలి." అని ఆవిడ పిలిచింది.

తోలు కొనుక్కున్న తరువాత, ఆవిడ యింటికి వెళ్ళాను. "ఈ సంగతి విన్నావా? సుల్మోనాలో రైతులు తిరుగుబాటు చేశారు. ఈ పట్టణంలోవున్న సైనికు లందర్నీ అక్కడికి పంపించారు. ఆ సుల్మోనాలోకూడ ఒకకంట్రాక్టరువున్నాడు. వాడు అక్కడవాళ్ళందరి కొంపలూ తీస్తాడట" అని ఆవిడ చెప్పింది. బజారులో ఆరంభమై, విప్లవం యీ మూడు రోజులూ జరుగుతూనే వుందిట. "అయితే మన బందిపోటు దొంగకి రోజులు యెప్పుడు మూడుతాయి?" అంది. నేనేం సమాధానం చెప్పలేదు. "రెండు నెలలనుంచి, ప్రతిరోజూ

పూజలు చేస్తున్నాను. ఇంతవరకూ వాడికి యేమీ హాని కలుగలేదు.'' అంటూ నా చెవిలో గుసగుస లాడింది. నేనింకా యేమీ జవాబివ్వకపోవడం మూలాన్ని, ఆవిడ స్పష్టంగా చెప్పింది. ''ఈ కంట్రాక్టర్ని తుదముట్టించేందుకు మంచి తరుణం వచ్చింది. సైనికులందరూ, సుల్మోనాలో వున్నారు. కంట్రాక్టరంటే అందరికీ ద్వేషంగా వుంది. వాడికి బుద్ధిచెప్పేందుకు మేమందరమూ సిద్ధంగా వున్నాం. ఫాంట మారా రైతులు ఆరంభించాలి అంతే. ఆ చర్చిదగ్గర నిన్ను కలుసుకోగానే, యేసుభగవానుడే నిన్ను పంపించినట్లు నా మనస్సుకి తట్టింది'' అని ఆవిడ నాతో అంది. నేను తోలు కొనుక్కునేందుకు మాత్రమే వచ్చానని చెప్పాను. ''అబ్బే, యేసుదేవుడే నిన్ను పంపాడు. ఈరోజు వుదయాన్ని నేను పూజ చేస్తోన్నప్పుడు. 'ఈ దొంగకి ఫాంటమారా రైతులే పాఠం నేర్పగలుగుతారు'' అని భగవంతుడు చెప్పినట్లు నాకు వినపడింది. ఆ తక్షణమే లేచి, బయటికి రాగానే నువ్వు కన పడ్డావు''.

ఆ జమీందారిణి బాల్డిస్సేరాతో, తుపాకులు కావాలంటే యిస్తానని వాగ్దానం చేసింది.

బాల్డిస్సేరా యీసంగతి చెప్పడంపూర్తిచెయ్యగానే, రాఫేల్ బెరార్డోవైపు తిరిగి ''సరే, యిప్పు డేమంటావ్?'' అని అన్నాడు.

''నీ వుద్దేశ్యం యేమిటి?'' అని బెరార్డో అడిగాడు.

''నేను, ఆంటోనియో, వెనర్డీ, జువ్వా, క్రాసూ కలిసే యిక్కడికి వచ్చాం. సుల్మోనా రైతులు చూపించిన ఉదా

హారణని మరంకూష అనుసరించాలని మా వుద్దేశ్యం. మనకి సహాయం చేస్తానన్నప్పుడు వద్దనకూడదు'' అని రాఫేల్ అన్నాడు.

''కాని యిదంతా చెయ్యడం యెందుకు?'' అని బెరార్డో అడిగాడు.

రాఫేల్‌కి కోపం వచ్చింది. ''నీ కేమన్నా పిచ్చియెత్తిందా? కంట్రాక్టరు మన్ని పెట్టిన బాధలన్నీ, చేసిన ద్రోహాలన్నీ మరచిపోయావా? రాత్రో రప్పలూ తప్పితే యీ శీతాకాలంలో మనకి తినేందుకు యేమీ వుండదని మరిచిపోయావా?''

అతని యిష్టం వచ్చినట్లు మాట్లాడనిస్తో, బాల్డిస్సేరా వైపు తిరిగి ''జజ్జోలాకి, కంట్రాక్టరుమీద ద్వేషం పుడితే భగవంతుణ్ణి యెందుకు ప్రార్థించింది? ఆమెకి భర్త లేడూ? భగవంతుడు ఆమెకి సహాయం చెయ్యదలుచుకుంటే, మన్ని చెయ్యమనడం యెందుకు? దేవత లెవ్వరూ దగ్గిర లేరూ?'' అని స్కార్పోన్ వైపు తిరిగి అదే కంఠస్వరంతో అన్నాడు.

కంట్రాక్టరు బిల్డింగులు తగులబెడితే, ఆ బొగ్గులు తిని బ్రతుకుదా మనుకుంటున్నావా? కంట్రాక్టరు సిమెంటు ఫాక్టరీలోనూ, తోళ్లషాపులోనూ పనిచేస్తోండే పనివాళ్లకి పనులు పోతే మనకి కడుపు నిండుతుందా?''

తన కంఠస్వరం మార్చి తన అసలు అభిప్రాయాన్ని పైకి తేల్చాడు.

''ఈ విషయాల్లో నాకేమీ నిమిత్తంలేదు. ప్రతి మనుష్యుడూ తన వ్యవహారాలు తాను చూసుకోవాలి. ఇంత

క్రితం, అందరి విషయాలకోసం నేను చాలా బాధపడ్డాను. ఇప్పుడు నాకు ముప్ఫైయేళ్లు వచ్చాయి. ఈ రోజున నేను పడుకునే యీ గడ్డిపరుపుతప్పితే, నాకు వేరే ఆస్తిలేదు. నేను కుర్రాణ్ణికాదు. నా స్వంత వ్యాపారం నేను చూసుకోవాలి. నన్ను శాంతంగా నా విషయాలు చూసుకోనివ్వండి.''

''మేము కాదు నిన్ను శాంతంగా బ్రతకనివ్వకపోవడం, నిన్ను, మమ్మల్నీ కూడా ఆ కంట్రాక్టరు బ్రతకనివ్వడం లేదు'' అని స్కార్పోన్ విసురుగా అన్నాడు.

''వినండి! వినండి! శాంతి కావాలని నాకంటె యెవ్వరూ యెక్కువగా కోరరు. కాని, యిప్పుడు శాంతి లేదు; భద్రత లేదు; న్యాయం లేదు; ప్రభుత్వం లేదు. నీ స్వంత వ్యవహారాలని చూసుకుంటో కూర్చునేందుకు యిది సమయంకాదు. ఎవ్వరికీ ప్రస్తుతం శాంతిలేదు. ప్రభుత్వంనుంచి వచ్చిన న్యాయరక్షకులు మీ స్త్రీల మానభంగం చేస్తోంటే ప్రక్కకు తిరిగి 'ఈ స్త్రీలలో యెవ్వరూ నాభార్య కాదంటావా? న్యాయరక్షకులు మన కాలవని యెండగట్టి, ఒక పెద్ద దొంగకి నీటిని ధారపోస్తే, మన కెవ్వరికీ పనుల్లేకుండా చేస్తోంటే, చేసినదానికి కూలి విరగ్గోయిస్తోంటే, యిదంతా ప్రభుత్వశాసనం, న్యాయం, ధర్మం అని వాళ్ళు దబాయిస్తోంటే, ప్రక్కకు తిరిగి ''ఇది నాకు సంబంధించిన విషయం కాదు'' అని అంటావా?'' అంటూ తీవ్రంగా బాల్డిస్సేరా గర్జించాడు.

బుర్ర ఆడిస్తో బెరార్డో వింటున్నాడు. ఈ వాదన లన్నీ బెరార్డో యింతకిత్రం అనేకసార్లు బాల్డిస్సేరాకి, యితరులకి

చెప్పాడు. కాని, యిప్పుడు పూర్వంవలె ఆతడు కుర్రాడు కాదు. ఇప్పుడు ఆతనిమీద పెద్దభారం పడింది. ఆతడు వెను కటిరోజులవలె లెఖ్ఖలేకుండా ప్రాణాలతో ఆడేందుకు వీల్లేదు. ఎల్వీరాతో సుఖంగా గడిపిన రాత్రినుంచి ఆతని ప్రకృతిలో గొప్ప మార్పు వచ్చింది. గ్రామం అంతా బెరార్డో దృక్పథానికి మారిన సమయాన్నే, ఆతడు ఆ దృక్ప థాన్ని త్యజించాడు.

" విను. నా విషయాన్ని స్పష్టంగా చెప్పనియ్యండి. మీ నీటికోసం, మీ భూములకోసం, నేను పురిస్థంభాన్కి వెళ్ళే ఉద్దేశ్యంలో లేను. నా స్వంత వ్యవహారాలు, బాధలు నాకుండనే వున్నాయి. నాతో వాదోపవాదాలు చెయ్య నక్కర్లేదు" అని తన దృఢాభిప్రాయాన్ని బెరార్డో తెలియ జేశాడు.

రాఫేల్, బాల్డిస్సేరాలు లేచి వెళ్ళిపోయారు.

"బెరార్డో భయపడి పోయాడు" అంటూ రాఫేల్ వీధిలో నిలబడిన కుర్రాళ్ళతో మాకుకూడా వినపడేటంత బిగ్గరగా అన్నాడు.

ఫొంటమారాలో వున్న యువకులందరికి బెరార్డో ఒక దేవుడు. ఆతనికోరకు ప్రాణాలు ధారపొయ్యమన్నా పోస్తారు.

అతను లేందే యేపనీ జరగదు.

ఈ గొడవ జరుగుతోన్నంతకాలం, ఎల్వీరా తన గడ్డిపరుపు మీదనే పడుకునివుంది. మొదటినుంచి చివ్వరివరకూ, ఆతని వంకే తదేకధ్యానంతో చూసింది. ముందు అతను చెప్పిన

మాటలు హృదయ పూర్వకంగా వచ్చినవి కావని అనుకుంది. కొంతసేపైన తరువాత ఆతని మాటలకి ఆశ్చర్యాన్ని పొందింది. ఆఖర్ని ఆమెకు చాలా ఆందోళన కలిగింది. అందరిమెదుట అతనితో వాదించేందుకు భయపడింది కాని, వాళ్ళు వెళ్ళిపోగానే ఆతని వైపు తిరిగి "నాకోసమనే నువ్వు యింత మారిపోయావు? యిప్పుడు మాట్లాడుతోన్నదానికి వ్యతిరేకంగా మాట్లాడినందువల్లనే, నువ్వుఅంటే నాకు అనురాగం కలిగింది" అని అంది. ఆమెముఖం చాలా వివర్ణమై వుంది.

ఎల్వీరాకూడా తనమీద యెదురు తిరగ్గానే, బెరాల్డో కోపాన్ని అణచుకోలేక, ఒక బండబూతు తిట్టి, మళ్ళీ మావంక తిరగకుండా విసవిసా నడిచి వెళ్ళిపోయాడు.

నేను యింటికి వెళ్ళేటప్పటికి అర్ధరాత్రి అయ్యుంటుంది.

నీ ప్రయాణం యీా తెల్లవారుఝామునే, వెంటనే పడుకో" అని నాకొడుకుతో చెప్పి పక్కమీద శరీరాన్ని వాల్చాను. మాకెవ్వరికీ నిద్ర పట్టలేదు. కాని అందరం పడుకున్నట్లు నటించాం. కళ్ళు మూసుకున్నా, నిద్ర రావడంలేదు. రెండు గంటలవేళ ఆకస్మికంగా చర్చి గంటమోత వినపడింది. మొదటిగంటల చప్పుడు స్పష్టంగా వుంది. క్రమక్రమంగా సన్నగిలింది.

భయపడుతో నా భార్య లేచి "ఏమండోయ్, . మిమ్మల్నే, మీకు గంటలచప్పుడు వినపడిందా? అని అడిగింది, నన్ను. "మన మేరియమ్మ దేవత అయి వుంటుంది. పడుకుందూ, నిద్ర వస్తోంది" అన్నాను.

నాకు నిద్ర రావడంలేదు. మేము ముగ్గురమూ వూపిరి బిగపట్టి వింటున్నాము. కాని వెంటనే మళ్ళీ గంటల గణగణ ధ్వని వినపడలేదు.

ఒక అరగంట గడిచిన తరువాత మరి రెండు దెబ్బలధ్వని వినపడింది. వెనుకటికంటె తక్కువగావుంది, ధ్వని.

"మీరు విన్నారా?" అంటూ చాలా భయపడింది నా భార్య.

"గాలి మూలాన్ని కదలి, గంట మోగివుంటుంది. పడుకో" అన్నాను.

కాని గాలి వీచని సమయంలో గాలివలన గంటమోగిందంటే యెవరు నమ్ముతారు?

మరి కొంతసేపైన తరువాత మరొకసారి గంటమోగిన ధ్వని వినపడింది. ఈపట్టు ధ్వని చాలా క్షీణించింది. మేము వింటున్నాము కనుక గాని, లేకపోతే, వినపడేదే కాదు.

"గుడ్లగూబ గంటని కదిలించివుంటుంది" అన్నాను.

గుడ్లగూబ చర్చిగంట యెలా మోగిస్తుంది?

గుడ్లగూబ, తీతువపిట్ట కాకపోతే దెయ్యం కదిపించివుంటుంది అనుకున్నాను. ఆ సమయాన్ని ఫాంటమారాలో చాలా తక్కువమంది నిద్రపోతూవుంటారు. ఆ చర్చిగంట ధ్వని విని మేలుకున్నవారు అనేక విధాలుగా అనుకునివుంటారు. గాని, అందరూ వారివారి పనులే చూసుకుంటున్నారుగాని, ఆ చర్చిగోపురం మీద యెవ్వరు వున్నారో చూసినవారు లేరు. ..

ఆ తరువాత యేమి జరిగిందో నా కొడుకు చెబుతాడు.

## ౯

మరుసటి వుదయం నేను, బెరార్డో కలిసి రోమ్‌నగరానికి వెళ్ళేందుకు బయల్దేరాం.

బెరార్డో ఉత్సాహంగా లేడు. నేను నమస్కారం అంటే బదులుకూడా చెప్పలేదు. ఆరంభంలోనే, దెబ్బలాటలు మొదలు, యేమిఅంటే యేంకోపం వస్తుందో అని వూరుకున్నా.

"నిన్న రాత్రి చర్చిగంట వినపడిందా, నీకు?" అంటూ ఆతణ్ణి మాటల్లోకి దింపాలని ప్రయత్నించాను. గాలితో మాట్లాడినట్లే వుంది, కాని ప్రయోజనం లేకపోయింది.

"రోమ్ నగరంలో వర్షాలు కురుస్తోవుంటాయా, యిప్పుడు? అని మళ్ళీ అడిగాను, కాని సమాధానం చెప్పలేదు.

పెద్ద పెద్ద అంగలు వేస్తో ముందుకి, దూకుడుగా వెడుతున్నాడు. నేను వగరుస్తో, ఆతనితో వెడుతున్నాను. మేము పట్టణం చేరుకోగానే, రైలుకూత వినపడింది. గబగబా రైలుకి పరుగెత్తాం. కాని ఆ కూత కూసిన రైలు, సామాన్లబండి. మా ప్రయాణీకుల బండి వచ్చేందుకు చాలా ఆలస్యం వుంది.

మూడవతరగతి ప్రయాణీకుల సాలలో కూర్చున్నాం. ఒక అరగంట తర్వాత రాఫేల్ గుమ్మందగ్గర సాక్షాత్కరించాడు. అతణ్ణి చూడనట్లు, బెరార్డో నటించి, గోడమీదవున్న ప్రకటన పత్రాన్ని చదువుతున్నాడు. కాని, రాఫేల్ తిన్నగా అతని దగ్గరకి వెళ్ళాడు.

"టిరియోఫిలో ఉరిపోసుకొని చచ్చాడు." అని చెప్పాడు. బెరార్డో ఆ ప్రకటనమీాదనుంచి కళ్ళు తిప్పలేదు.

"నిన్నరాత్రి చర్చిగంట తాడుతో ఉరిపెట్టుకున్నాడు. వాడి శరీరం యింకా వెచ్చగానే వుంది. రాత్రంతా వేళ్ళాడుతు న్నాడు కాబోలు." అని గాఫేల్ చెప్పాడు.

"అతని ఆత్మకి శాంతి కలుగుగాక." తల తిప్పకుండా, బెరార్డో అన్నాడు.

డాన్ అబ్బేచిరియో దగ్గిరకి వెళ్ళాను. మొదట, ఉదయాన్నే లేపినందుకు కోప్పడ్డాడు, తరువాత అంత్యకర్మలు చేసేందుకు రానన్నాడు. 'టిరియోఫిలో పూజారిత్వం చేశాడు. భగవ త్సేవ చేసినవారికికూడా అంత్యకర్మలు చెయ్యనంటారేమిటి?' అని అడిగాను. ఉరిపెట్టుకుని బలవంతపు చావు చచ్చినవారికి నరకం తప్పదు, అన్నాడు.

బెరార్డో యేమీ చలించలేదు. "ఆతని ఆత్మకి శాంతి కలుగు గాక!" అన్నాడు.

మేము టిరియోఫిలో శవాన్ని ఆచర్చిమధ్యనే పాతిపెట్టబోతు న్నాం. ఆ పురోహితుడు రాకపోతే, అతను లేకుండానే చెయ్యవలసివుంటుంది ముందు యిరవైనాలుగు గంటలు ఆ చర్చి మధ్యని ఆ శవాన్ని వుంచి, జీసస్ క్రీస్తు, ఆంథొని ఋషి జోసెఫ్, శాన్ బెరార్డో, తక్కిన యితరభక్తులు, ఋషులు చూసేందుకు టైము యిస్తాము. మన స్థితి యెంత వరకూ వచ్చిందో వాళ్ళే గ్రహిస్తారు........"

"ఆతని ఆత్మకి శాంతి కలుగుగాక!" అని బెరార్డొ అన్నాడు. ఈ సమయానికే మా రైలుబండి వచ్చింది.

"నువ్వు వెళ్ళవద్దు" అని హఠాత్తుగా రాఫేల్ అన్నాడు.

"ఏం, ఎందుచేత?" అని ఆశ్చర్యంతో బెరార్డొ అడిగాడు.

"వెళ్లవద్దు" అని మళ్లీ రాఫేల్ అన్నాడు.

బెరార్డో రైలువైపు నడిచాడు. నేను వెంబడించాను. ఏమీ తోచక, దిగాలుపడి, రాఫేల్ బుర్రవ్రాపుతో మా వెనక్కాల వచ్చాడు.

"సైనికులు వస్తారు. బెరార్డో, వెళ్ళిపోకు." అన్నాడు రాఫేల్.

కాని, మేము రైలుపెట్టిలోకి ఎక్కాం.

మా ప్రయాణంలో ఒక్క మాటకూడా మేము మాట్లాడుకో లేదు. ప్రయాణం పొడుగునా, నాకెదురుగావున్న రైలుపెట్టె లోనే కూర్చున్నాడు బెరార్డో. కిటికీలోంచి బయటికి చూస్తు న్నాడు. నేను అతణ్ణి పరీక్షిస్తున్నాను. ఏదైనా ఒక లక్ష్యం పెట్టుకుంటే, అది సిద్ధించేవరకూ అతడు వ్రాయకోడు. అతని మార్గాన్ని ఏదీ అడ్డలేదు. తాను కోరుకన్నది లభిస్తుందని తోస్తే, నన్ను కిటికీలోంచి అవతలికి తోసేందుకుకూడా వెనుక తియ్యడు అని ఆకస్మికంగా నాకు తోచింది. పెదవులు బిగబట్టి, తీక్షణంగా, పట్టుదలను సూచించే చూపులను విసురుతోన్న అతని ముఖం చూస్తేనే, తెలుస్తుంది యీ విషయం. "ఆకలివేస్తే, నన్ను విరుచుకొని తినేయగల సమ ర్థుడు" అనుకున్నాను.

రోమ్‌నగరంలో "పశ్చాత్తప్త తస్కరుడు" అని పేరువున్న ఒక హోటల్లో మేము మకాంచేశాం. క్రీస్తుభగవానునితో పాటు, ఆయన కుడిప్రక్కని శిలువ వేయబడి, భగవానుని గుర్తించి, పశ్చాత్తాపంచెంది, మోక్షం పొందిన "పశ్చాత్తప్త తస్కరుడి" పేరు ఆ హోటలుకి పెట్టారనుకుంటారేమో. కాదు, ఆపేరు, ఆ హోటలు యజమాని పేరునుబట్టి వచ్చింది. ఈ యజమాని అనేకసార్లు దొంగతనాలు చేసి, ఖైదుకి వెళ్ళి వచ్చాడు. పోర్గాపిరో వీరుడిలాగే చివరికి ఫాసిష్టులతో కలిసి, 'పరపతి సంఘము కాణాలు,' 'కార్మిక సంఘ కార్యాలయాలు,' 'కార్మిక వార్తాపత్రికల కార్యాలయాలు,' మొదలైనవాటిని దోచడంలో ఆరితేరిన చెయ్యి అని కీర్తిగడించాడు. ఆయన చేసినవన్నీ, దేశభక్తి ప్రేరిత దొంగతనాలు అని ఫాసిష్టు పత్రికలు ప్రకటించి, పొగడేవి. ఆయన చేసిన అఖండ దేశ సేవకి మెచ్చి గొప్ప అధికారిఅయిన పోలీస్ ఛీఫ్ ఒక గొప్ప బహిరంగ సభలో ఆయనకి 'పశ్చాత్తప్త తస్కరుడు' అని బిరుదు యిచ్చాడు. ఆయన నడిపిస్తోన్న హోటలు కనుక దీనికి ఆపేరు దఖలుపడింది.

మరునటిరోజు వుదయాన్ని, మాకు వుద్యోగం దొరుకుతుం దనుకున్న-ఓకల కార్యాలయానికి వెళ్ళాం.

ఆ కార్యాలయందగ్గరవున్న నౌకరు మమ్మల్ని మూడవ అంతస్తుపైకి వెళ్ళమన్నాడు. అక్కడ అనేకమంది వేచి వున్నారు. మేముకూడా వారిప్రక్క కూర్చున్నాం. మధ్యాహ్నసమయానకి మమ్మల్ని పిలిచారు. కాని యింతవరకూ

మేము కూర్చున్న చోటు నాలుగవ అంతస్తు అని చెప్పి, వెనక్కి వెళ్ళమన్నాడు.

మరుసటిరోజున, మూడవ అంతస్తుకి వెళ్ళాం. మేమిద్దరమే గాని, మరెవ్వరు అక్కడ లేరు. అనేకమంది మా ప్రక్కనుంచి గబగబా యిటూ అటూ వెడుతున్నారు. అంతేకాని మమ్మల్ని యెవ్వరూ పలకరించలేదు. ఆఖరికి మమ్మల్ని అయిదవ అంతస్తుపైకి పొమ్మన్నారు. అక్కడ రెండుగంటలు వేచివున్నాక కార్పొరేషనుకి వెళ్ళమని ఒక చిరునామా యిచ్చారు. ఈ విధంగా మూడు రోజులు గడిచాయి.

కార్పొరేషను కార్యాలయంలో "మీ కాగితాలు వున్నాయా అని అడిగారు.

"ఏ కాగితాలు?" అని ఆశ్చర్యపడుతో మేము అడిగాం.

మమ్మల్ని ఒక కిటికీ దగ్గరకి తీసుకొని వెళ్ళాడు. అక్కడ వున్న గుమాస్తా మా కాగితాలు తయారుచేసి పంపిస్తూ బిళ్లలు ఒక్కొక్కదానిమీద అంటించాడు.

ఆ గుమాస్తా యిరవైనాలుగు రూపాయలు ఇవ్వమన్నాడు. "డబ్బు చెల్లించు! డబ్బుకట్టు!" అని బెరాగ్గా గొణిగాడు. కత్తితో యిరవైనాలుగు గంట్లు పెట్టినా మాకింత బాధ పెట్టకపోవును. చేసేది లేక, చెల్లించాం.

ముందు వెళ్లినచోటికి వెళ్లి "ఇవిగో, మా కాగితాలు," అన్నాం.

సరే, రేపు 'ఉద్యోగశాఖ' కార్యాలయానికి వెళ్లి, మీరు

నిరుద్యోగులని సంతకంచేసి, ఉద్యోగహామ్కీ-పత్రాలని తీసుకు రండి'' అని చెప్పారు.

ఈ విధంగా నాలుగవరోజు గడిచింది.

బెరార్డో చాలా ఓర్పువహించి యివన్నీ సహించాడు. తప్పని సరిగా యీ కష్టాలన్నీ వస్తాయి అన్నట్లు భావించాడు.

"ఉద్యోగం సంపాదించుకునేందుకు యెంత కష్టపడతామో, అంతకు పదిరెట్లు యెక్కువ సంపాదించుకుంటాం'' అని పదే పదే చెబుతోండేవాడు.

ఆఫీసులన్నీ మూసివేసిన మధ్యాహ్నకాలంలో రోమ్‌నగరం అంతా తిరిగి చూశేవాళ్ళం.

"బ్యాంకి'' అని బల్లకట్టబడివున్న ఒక పెద్ద యెర్రరంగు మేడని మొదటిసారి చూసినప్పుడు "చూడు, చూడు'' అని అతి ఉద్వేగంతో అన్నాడు. దాని వైపు ఆశ్చర్యచకితుడై కొంచెంసేపు చూసి "చూడు యీ బ్యాంకినుంచే కంట్రాక్టరు డబ్బు తీసుకొస్తోవుంటాడు'' అని నాచెవిలో మెల్లిగా అన్నాడు.

మరికొంచందూరం సాగిపోయాక, మరొక బ్యాంకి కనపడింది. తరువాత మరొకటి, ఆ పైని యింకొకటి. అటుపైని మేము లెఖ్ఖపెట్టడం మానుకున్నాం. వీటిలో కంట్రాక్టరు బ్యాంకి యేది? ఆ బ్యాంకులు చాలా పెద్దవి. వేలకొద్దీ ప్రజలు, కార్ల మీాద, బళ్ళమీాద వచ్చి వెడుతున్నారు.

వాటిని చూసి, బెరార్డో ఆశ్చర్య పడుతున్నాడు.

ఒక సాయంకాలం, హోటలుముందు పెద్ద గుంపుగూడివుంది. ఒక పెద్ద సైనికుల ఆహారపులారీ తిరగబడివుంది. వాళ్ళందరూ దానికేసి గొడవచేస్తున్నారు కాని, సరియైన స్థితిలో పెట్టేందుకు ప్రయత్నించడం లేదు.

ఆ సమూహాన్ని యిటూ అటూ తోసుకుంటూ బెరార్డో ఆలారీ దగ్గరికివెళ్ళి, కోటువిప్పి, ఆ లారీక్రింద దూరి, మెల్లిగా వీపుతో పైకియెత్తి దాని చక్రాలమీద నిలబెట్టాడు. చుట్టూప్రక్కల చేరినవారందరూ మెచ్చుకున్నారు. ఆశ్చర్యచకితులయ్యారు. ఈ సంఘటన బెరార్డో మాటకారితనాన్ని మళ్ళీ యధాస్థితిలోనికి తీసికొనివచ్చింది. "బాంకుల శక్తిని నాశనంచేసేందుకు జిజ్జోలా జమీందారిణిగారు రోజూ పూజలుచేసేదిఅట. అందులో అర్థం యేమున్నా వుందా?" అన్నాడు ఆ సాయంకాలం.

వాదించాలనే వుత్సాహం లేదు. రాఫేల్ కి, తనకీ జరిగిన సంభాషణమీద మళ్ళీ తన అభిప్రాయాలని చెబుదామని, అతడు యెంచుతోన్నట్లు నేను గ్రహించాను. కాని, నేను చర్చించే మానసిక శక్తిలో లేను.

"కుర్రతనంలో, ముందూ వెనకా చూసుకోకుండా, జీవితంతో చెలగాటలాడుతో యెన్నెన్ని సాహసకృత్యాలైనా చెయ్యవచ్చును. జీడిగింజల్ని కాల్చడంలో అర్థం వుంది. కాని, కంట్రాక్టరు యిల్లు తగలబెట్టడంలో యేం అర్థంవుంది? ఆ యిల్లు కాల్చడానికీ, ధైర్యానికి యేం సంబంధం వుంది? నేను భయపడ్డానని రాఫేల్ అనుకున్నాడు. కాని చాల

పొరపాటు అభిప్రాయం. ఇతరులకంటే అదనంగా సంపాదించుకునేందుకు నా ప్రాణాలు ఒడ్డేసనా నీఅభిప్రాయం? ఇంతక్రితం యెవ్వరూ చెయ్యనంత కష్టమైన పనులు చేసేందుకు నాదగ్గర బలంవుంది. రేపు మనకి పని దొరకగానే అందరూ ఆశ్చర్యపడేటంత పని చేస్తాను''.

అతణ్ణి ఆపాలని ''టియోఫియోలోని యేవిధంగా పాతిపెట్టారో'' అన్నాను, నేను. ఈ ప్రశ్న అతనికి కొద్దిగా బాధ కలుగచేసింది.

''ధైర్యానికీ, యేమీ సంబంధం లేదు! దౌర్జన్యమూ యేమీ చెయ్యలేదు. మనమీద కంట్రాక్టరు దౌర్జన్యంచేస్తున్నాడా? చెయ్యడు. ధైర్యాన్నికాని, దౌర్జన్యాన్నికాని వుపయోగించకుండా, తన బుర్రని, తెలివితేటల్ని వుపయోగిస్తాడు. ఫాంటమారా కాలవని యెల్లాగు వశంచేసుకున్నాడో తెలుసునా? మొట్టమొదట పెలినోసి పంపించి గ్రామస్థుల సంతకాలు తీసుకున్నాడు. తరువాత ఒక్కొక్కరికి మూడేసివంతుల పన్నాగం, అటుపైని పది నక్షత్రకాలాల తమాషా యింతకంటే కంట్రాక్టరు యేంచేశాడు. తన మంచిచెడ్డలు. లాభం చూసుకుని, కంట్రాక్టరు ధర్మానుసారంగా పనిచేశాడు. అతని తప్పేమి వుంది?''

చివరకి బెరార్డో కంట్రాక్టరు చేసిందాంట్లో తప్పేమీ లేదు అనడంలోకి వచ్చాడు.

''భూమి ధర అమితంగా పడిపోతుంది. ఆ కాలవ లేకపోతే పొలాల ధర చాలా తగ్గుతుంది. ఇంతేగాకుండా ఆపొలాన్ని

పాతపద్ధతులమీదకూడా సాగుచెయ్యకూడదు'' అని అతని మనస్సులోవున్న భావాన్ని పైకి వెల్లడించాడు.

ఏభూమిని కొనాలో అప్పుడే నిర్ణయించుకున్నాను.

అయిదవరోజున వ్యవసాయ ఉద్యోగశాఖ కార్యాలయానికి వెళ్లాం.

''మీరే రాష్ట్రంనుంచి వచ్చారు?'' అని అడిగాడు.

''అక్విలా''

''అక్విలా రాష్ట్రీ ఉద్యోగశాఖకి తెలియబరుచుకోండి''.

''అక్విలా ఉద్యోగశాఖ యెక్కడుంది?''

ఆ గుమాస్తా నవ్వ నారంభించాడు. మా ప్రశ్నని తక్కిన గుమాస్తాలతో చెప్పాడు. అందరూ కడుపు ఉబ్బేట్లా నవ్వారు.

''ఇప్పటికే చాలా ఆఫీసులు తిరిగాం. పనికోసం రోమ్‌కి వచ్చాం కాని, యిటూ అటూ తిరుగుతో ఆఫీసులు చూసేందుకు కాదు'' అని నొక్కి బెరార్డో చెప్పాడు. ఆ మాటలు యెవ్వరూ వినిపించుకో లేదు.

మా హోటల్లోనే ఒక లాయరు గారున్నారు, ఆయనతో యీ సంగతులు మనవిచేసుకుందామని ప్రయత్నించాము. మేము రోమ్ వెళ్లిన ఆరవరోజున. ఆయన పడకగదిలోకి దర్శనంచేసుకునేందుకు రమ్మని కబురు పంపించాడు. మేము వున్న గదిపక్క నే ఆయన పడకగది వుంది. ఆ గది యిరుకుగా, చీకటిగా, అపరిశుభ్రంగా వుంది. డ్రాయరే జియంజూ ముసలివాడు. పదిరోజులనుంచి గడ్డాన్ని క్షౌరంచేసుకో లేదు.

పచ్చ లాగు, కోటు తొడుక్కున్నాడు. మాసిన తెలుపు కాన్వాసుబూట్లు తొడుక్కున్నాడు. ఒక గడ్డిటోపీ పెట్టుకున్నాడు. మేము వస్తున్నాంకదా, అని ఆయన మంచిబట్టలు వేసుకున్నాడు.

"సలహాకి అయిదు రూపాయలు యివ్వాలి" అని పేజియంజా సంభాషణ ఆరంభించాడు.

"అల్లాగే, సరే!" అన్నాను నిరాశతో.

అయిదు రూపాయలు ముందే యివ్వాలి.

అయిదు రూపాయలు యిచ్చాం.

"ఒక్కొక్కరికి అయిదేసి రూపాయలు".

మరొక అయిదు రూపాయల నోటు యిచ్చాం.

వెంటనే ఆయన లేచి, బయటికి వెళ్ళాడు. దారిలో దగ్గుతోన్న ధ్వని వినపడుతోంది. క్రమ క్రమంగా ఆ దగ్గుధ్వని క్షీణించి, మరికొంచంసేపైన తరువాత వినపడలేదు.

ఒక అరగంటవరకూ మేము వేచివున్న తరువాత, మెల్లిగా దగ్గుకుంటూ ఆ ముసలి లాయరుగారు మెట్లమీద పాకి గదిలోకి వచ్చాడు. ఒకరొట్టె, మెరప్పిసారాయి, తెచ్చుకున్నాడు. మెల్లిగా మంచంయెక్కి కూర్చొని "మీ కేసు మంచిదికాదు" అన్నాడు. మా కేసు యేమిటో యింతవరకూ చెప్పనేలేదు. "మీదగ్గర యింకా యెంత డబ్బు వుంది?" అని అడిగాడు.

మాదగ్గర చిల్లరఅంతా పోగుచేస్తే యెనిమిది రూపాయలు వుంది.

"మీ కేసు లెక్కలోకి రాకపోడమే కాకుండా, నెగ్గడం చాలా కష్టం" అని నిరాశతో లాయరు అన్నాడు. "ఫాంటమారానుంచి యింకా డబ్బు తెప్పించగలరా?" అని కొంచంసేపు ఆలోచించి అడిగాడు.

"తప్పకుండా, తెప్పించగలం" అని బెరార్డో జవాబిచ్చాడు.

"ఒక కోడిపెట్టని తెప్పించలేరు? ఒక్కటైనా, రెండా? నాదగ్గుకి కొంచం తేనో?" అని ఆముసలాయన అడిగాడు. "తెప్పించగలనండీ" అని వెంటనే బెరార్డో సమాధానం చెప్పాడు.

లాయరు నవ్వుతో "మీ కేసులో మనం నెగ్గిందాకా, మంచి బలవత్తరమైన అంశములు వున్నాయి" అన్నాడు.

బెరార్డో మా విషయం పూర్తిగా చెప్పాడు.

డాన్ పేజియంజా లేచి నిలబడి, పాతగొడుగు కామలాగ వున్న, చేతికర్రని తీసికొని, గాలిలో వూపుతూ "నా వెంట రండి" అన్నాడు.

మొదట పోస్టాఫీసుకి తీసికొని వెళ్ళి

"100 రూపాయలు, 7 పౌన్ల తేనె, కొన్ని కోడిపిట్టలు పంపించండి" అని టెలిగ్రాం రాశాడు.

"చిరునామా యేమని వ్రాయను? మీ యిద్దరిలో భాగ్యవంతులెవ్వరు?

"నాతండ్రి లింసెంజోవ మోలాకి వ్రాయండి" అని బెరార్డో

తక్షణమే అన్నాడు. బెరార్డ్ తండ్రి చాలాకాలం క్రితం చనిపోయాడు.

"బాదంపళ్ళు, మీా కిష్టం లేవండీ?" అని బెరార్డ్ అడిగాడు.

"చాలా యిష్టం. దగ్గుకి చాలా మంచివి" అని, టెలిగ్రాంలో బాదంపళ్లకికూడా రాసి, "టెలిగ్రాంఖర్చు యిచ్చి నాతో రండి" అన్నాడు.

డబ్బు చెల్లించి ఆయన వెనుక వెళ్ళాం. మొదటిరోజున మేము పంపివేయబడిన ఫాసిస్టు ఉద్యోగశాఖవద్ద, మమ్మల్ని బయటనాపి, లోపలికి వెళ్ళి పేజియంజా ఒక ఉద్యోగస్థుడితో ఉద్వేగంతో గట్టిగా మాట్లాడాడు. వారిద్దరు మాకు కిటికీ గుండా కనపడుతున్నారు. కొద్దిక్షణాల తరువాత మాదగ్గిరకి గబగబా పేజియంజా వచ్చి "ఫాంటమారా వెన్న తినేందుకు పనికి వస్తుందా, వంటకాల్లోకి పనికివస్తుందా?" అని అడిగాడు.

"అప్పుడే తయారుచేసిన వెన్న తినేందుకు, నిలవబాపతు వంటకాల్లోకి వుపయోగ పడుతుందండి" అని బెరార్డో లాయరుగారికి తృప్తికరమైన సమాధానం చెప్పాడు. ఆయన వెళ్ళి ఆ ఉద్యోగస్థునితో యీా సమాధానం చెప్పాడు.

కొంతసేపు తరువాత పేజియంజా మా దగ్గిరకి వచ్చి "వ్యవహారం నడుస్తోంది. పుట్టుక సర్టిఫికేట్లు, పోలీసురికార్డులు, మంచి ప్రవర్తన యోగ్యతా పత్రాలు తెప్పించగానే మీా పేర్లు నిరుద్యోగపట్టికలో చేర్చబడతాయి. తరువాత మీాకు పని వస్తుంది. ఉద్యోగశాఖవాళ్లు మీాకు కబురు పంపుతారు" అని తెలవిచ్చాడు.

రోమ్ వచ్చినతరువాత యేడవరోజున మా దగ్గర ఒక రూపాయమాత్రమే వుంది.

ఆపూట క్లుప్తంగా భోజనంచేసి, వెనక బాకీలు తీర్చేశాం. మా దగ్గర ఒకపైసాకూడా మిగల్లేదు.

"ఉద్యోగశాఖనుంచి త్వరలోనే మనకి కబురువస్తుంది." అంటో అస్తమానమూ బెరార్డో నాకు ధైర్యం చెబుతున్నాడు.

ఆ హోటలునుంచి మేము బయటికి కదలడంలేదు. ఉద్యోగం కబురుకోసం, అసలు తిండిలేక నీరసంగా వుండటం మేము కదలకపోవడానికి కారణాలు.

కాలిచప్పుడు వినపడగానే తలుపుదగ్గిరికి పరిగెత్తేవాళ్లం.

గౌరవనీయులైన పేజియంజాగారికి కూడా ఆతృత చాలా అధికంగా వుంది. ఆయన డబ్బుకోసమూ, మేము పనికొరకు అతి ఆతురతతో యెదురుచూస్తున్నాం! రాత్రింబగళ్ళు గదుల్లో పడుకుని కాలిచప్పుడు వినపడినప్పుడల్లా పైకి వెడుతున్నాం.

"నీ తండ్రికి హృదయం లేదోయ్. ఒక్క వందరూపాయలు పంపించేందుకు యింతకాలం తీసుకుంటున్నాడేమిటి? అంటూ పేజియంజా నిందించేవాడు.

"పని యేమన్నా వుందా లేదా చెప్పండి. పనివుంటే యీ సర్టిఫికెట్టులు, యీ తంతులు యెందుకు? అని సమాధానం యిచ్చేవాడు.

"తేనె, బాదంకాయలు, పార్శెల్లో రావాలి కనుక ఒకటి రెండు రోజులు ఆలస్యం అవుతుంది. కాని డబ్బు యీపాటికి రావలసిందే. నీతండ్రి వట్టి స్వార్థపరుడు."

"నా పుట్టుక సర్టిఫికెట్టుకీ, ఉద్యోగానికీ సంబంధం యేమిటి? ఒక మనిషి ఉద్యోగం కోరాడంటే, ఆతడు పుట్టివుంటాడని అనుకోవచ్చునుగదా? పుట్టక క్రితమే యేమానవుడు యింత వరకూ ఉద్యోగం కోరలేదుకదా!"

మూడురోజుల వుపవాసం తరువాత, నేను, బెరార్డో తపాలా బంట్రోతు అడుగుల చప్పుడు వినపడగానే తలుపులదగ్గరకు వెళ్ళడం మానుకున్నాం.

నీళ్ళు తాగేందుకు తప్పితే మేము లేవడమే లేదు.

"బెరార్డో! నీతండ్రి వట్టి గాడిద. నీతండ్రి నన్ను నాశనం చేస్తున్నాడు. బెరార్డో! నీ తండ్రి నన్ను చంపేస్తున్నాడు. నీతండ్రి మూలాన్నే మూడురోజులనుంచీ తిండి తినలేదు. ఈ మహాపాతకం నీ తండ్రిదే!" అంటూ పేజియుంజా శాపనార్థాలు పెట్టేవాడు.

బెరార్డో సమాధానం చెప్పేవాడుకాదు. వెనకటివలె నోరు మెదపకుండా, గంటలతరబడి మౌనంగా వుండేవాడు.

"ఏం చేద్దాం. అన్నంతినకుండా, యిలా యెంతకాలం వుంటాం" అని నేనన్నాను.

బెరార్డో జవాబివ్వలేదు.

మా వుపవాసాలు ఆరంభమైన తరువాత, నాలుగవ రోజున అకస్మాత్తుగా, మాకు ఒళ్ళు పులకరించే సంఘటన జరిగింది.

అయిదుఘంటలై యుంటుంది. పేజియుంజా, పశ్చాత్తప్త తస్కరుడు యిద్దరూ సంతోషంతో మాట్లాడుతూ మా గది వైపు వస్తున్నారు. లాయరు హుషారుగా పాడుతున్నాడు.

వాళ్ళిద్దరూ తలుపు తెరుచుకుని మా గదిలో ప్రవేశించారు. హోటలు యజమాని చేతిలో ఒక టెలిగ్రాం వుంది. లాయరు చేతిలో రెండు బ్రాందిసీసాలు వున్నాయి.

"బెరార్డో నీ తండ్రి చాలా మంచివాడు. మనిఆర్డరు వచ్చింది" అని లాయరు సంతోషంతో అన్నాడు.

"నిజంగానే ?" అంటూ బెరార్డో ఆశ్చర్యపడ్డాడు. చని పోయిన ఆతని తండ్రిదగ్గరనుంచి వచ్చిందని అతడు నమ్మ లేదు, కాని, నాలుగురోజుల వుపవాసం తర్వాత, లాయరు డబ్బు వచ్చిందనగానే అమితమైన ఆశ్చర్యమూ, సంతోషము కలిగాయి.

బెరార్డో టెలిగ్రాం తీసుకుని, విప్పి, చదువుకుని, మా వైపు చూసి, మడిచి జేబులో పెట్టుకుని, నోరు విప్పకుండా నిల బడ్డాడు.

"ఏమిటది ?" అని నేను అడిగాను.

బెరార్డో సమాధానం చెప్పలేదు. ఆతని ముఖం వివర్ణమైంది. ఆతనికళ్ళు చింతనిప్పుల్లాగున కసకస లాడుతున్నాయి.

"ఏమిటది ?" అని అతి మృదువుగా మళ్ళీ అడిగాను.

బెరార్డో కాళ్ళుజాపుకుని పక్కమీద పడుకున్నాడు. పేజియుంజా హోటలు యజమాన్లు, యీతని ప్రవర్తనను చూసి ఆశ్చర్య పడి వెళ్ళిపోయారు. ఆ పక్కమీదే పడుకుని, చాలాసేపటి

వరకూ పలకరించ లేదు. చివరకి మళ్ళీ "ఏమిటీగా ఔలిగ్రాం? ఏం జరిగింది? ఫాంటమారాలో యెవరైనా చనిపోయారా?" అని అడిగాను.

కాని అతడు సమాధానం చెప్పలేదు. ఎవ్వరో చనిపోయారని స్థిరపరుచుకున్నాను.

ఆరాత్రి యెనిమిది గంటలకి పేజియుంజా మాగదికి వచ్చి "ఫాసిస్టు ఉద్యోగశాఖాధికారి నన్ను చూసేందుకువచ్చారు, మీ కాగితాలు వచ్చాయి. మీ పోడెస్టాగారు జాతీయ దృక్పథంతో చూస్తే మీపవ్రవర్తన చాలా చెడ్డదని వ్రాశాడట. అల్లాంటి యోగ్యతాపత్రింతో మీమొఖాలకి ఉద్యోగం దొరకదు. అంతేకాకుండా పోలీసులకి మీమీద రిపోర్టులుకూడా వచ్చాయి" అని చెప్పి దఢాలున తలుపులు మూసి వెళ్ళిపోయాడు.

అయిదు నిమిషాల తర్వాత తలుపులు మళ్ళీ తెరవబడ్డాయి. హోటలు యజమాని వచ్చి "మీగది అద్దె కిచ్చాం. ఒక గంటలో ఖాళీచేసి వెళ్ళిపోవాలి" అన్నాడు.

ఆరాత్రి ఆహోటలుని వదిలిపెట్టేశాం.

"ఇప్పు డేం చేద్దాం?" అని నే నడిగాను. కాని అతను మాత్రిం యేం చెప్పగలడు? ఊరుకున్నాడు.

నాకాళ్ళు తేలిపోతున్నాయి. తలకాయ దిమ్ముగా వుంది. నాకు నీరసంతో స్పృహ తప్పిపోతుందేమో అనిపిస్తోంది. వీధిలో నడుస్తోన్న ప్రిజలు మాకేసి తేరిపారచూస్తున్నారు. నిజంగా బెరార్డొ ఆకారం భయంకరంగా వుంది.

మేము స్టేషను దగ్గిరకి వచ్చాం. అక్కడ పోలీసులు, సైని కులు ప్రయాణీకు లందర్నీ ఆపి ప్రశ్నలు వేస్తున్నారు. మోటారు కార్లనికూడ ఆపి వెతుకుతున్నారు, హఠాత్తుగా మా ముందు ఒక యువకుడు నిలబడి, 'నమస్కారం' అన్నాడు బెరార్డోతో.

అతనివైపు బెరార్డో సందేహంతో చూసి, సమాధానం చెప్ప లేదు.

"నిన్నుగూర్చి యిప్పుడు అనుకుంటున్నాను. ఫాంటమారా వద్దామని ప్రయత్నం చేస్తున్నాను. నువ్విక్కడే కనపడ్డావు" అన్నాడు.

"నా దగ్గర ఒక పైసాకూడా లేదు. ఎవ్వరినైనా మోసం చెయ్యదలుచుకుంటే, త్వరలో యింకొకరి దగ్గిరికి వెళ్ళడం మంచిది" అన్నాడు బెరార్డో.

ఆ యువకుడు నవ్వడం మొదలుపెట్టాడు. సగం విద్యార్థిలాగూ, సగం పనివాడులాగూ కనిపిస్తున్నాడు. పొడుగ్గా, పలచనగా వున్నాడు. అతని స్వరం, ఆకారం, దుస్తులు యేమీ అను మానాన్ని కలిగించడం లేదు.

"మీరు అవెజ్జానో వచ్చినప్పుడు, మొరప్రజుట్టు పోలీసు గూఢచారి మిమ్మల్ని హోటల్లోకి తీసికొని వెళ్ళినప్పుడు, మిమ్మల్ని వాడి మోసంలో పడకుండ చేసింది యెవ్వరో జ్ఞాపకం లేదూ?" అని నవ్వుతో అన్నాడు.

బెరార్డో తదేకధ్యానంతో అతనివంక చూసి చివరికి గుర్తించాడు.

ఈ అవకాశాన్ని కాస్తా బెరార్డొ జారవిడిచెయ్యడం చూసి, "మాకు కొద్దిగా ఆహారం కొనుక్కునేందుకు డబ్బివ్వండి" అని నిర్మొహమాటంగా అడిగాను.

మమ్మల్ని ఒక కాఫీహోటలుకి తీసికొని వెళ్ళి, కోడిగుడ్డు అట్లు, మాంసపు కూర తీసుకుని రమ్మని హోటలువాణ్ణి ఆజ్ఞాపించాడు.

అవ్వి మాకేనా? మా దగ్గిర ఒక రాగి దమ్మిడీకూడా లేదు" అంటూ సందేహిస్తో బెరార్డొ అడిగాడు.

మాకు నమ్మకం కలిగేందుకుగాను, డబ్బు ముందే చెల్లించాడు. వీడు పిచ్చివాడా యేమిటి? అని అర్థంవచ్చే చూపులు బెరార్డొ నా వైపు చూచాడు.

"ఈ మిలటరీవాళ్ళూ, పోలీసులు యేంచేస్తున్నారు" అని బెరార్డొ ఆ ఫలహారం తీసుకుంటో యువకుణ్ణి అడిగాడు.

"మాయమనిషికోసం వీళ్ళ మామూలువేటే, అది. కొంత కాలంనుంచి యీ మాయమనిషి, ప్రజాశాంతికి భంగం కలిగిస్తున్నాడు. ప్రత్యేక న్యాయస్థానాలముందు జరిగే ప్రతి కేసులోనూ యీ మాయమనిషి పేరు వినపడుతోంది. కరపత్రాలని అచ్చువేయించి పంచిపెడుతో వుంటాడు. ఈ నిషిద్ధ పత్రాలని రహస్యంగా ప్రజలకి పంచిపెడుతోన్నప్పుడు పట్టుబడిన మనుష్యులందరూ ఆకరపత్రాలు మాయమనిషి దగ్గరనుంచి తమకు వచ్చాయని చెబుతున్నారు. మొదట కొన్ని పెద్ద ఫాక్టరీల్లోనూ, తరువాత నగరంలోనూ, అటుపైని సైనిక నివాసాల్లోనూ, అటుపైని విశ్వ విద్యాలయమూ

ల్లోనూ యీ మాయమనిషి రహస్యంగా పనిచెయ్య నారంభించాడు. ఒకేరోజున పది పంద్రెండు ప్రదేశాల్లో కూడా కనపడినట్లు ప్రజలు చెప్పుకుంటున్నారు. దేశంలో వుండే పేరుమోగిన గూఢచార్లు, అపరాధ పరిశోధకులు ఆ మాయ మనిషిని పట్టుకునేందుకు ప్రయత్నిస్తున్నారు. ఆ మనిషిని పట్టుకునేందుకు గాను, యింతవరకూ ఆరువేల మందిని జైళ్లలో పెట్టారు. ఎప్పటి కప్పుడే ఆ మాయమనిషి తాము ఖైదులో పెట్టిన మనుష్యుల్లో వున్నాడని ప్రభుత్వంవారు అనుకునే వారు. కాని, మళ్ళీ రహస్య కరపత్రాలు దేశంలో నలు మూలల వెదజల్లివేయబడుతూ వుంటాయి. కొంతకాలం క్రితం అబ్రూజి పట్టణంలో ఉన్నట్లు ప్రభుత్వంవారు అనుకుంటు న్నారు.”

“అబ్రూజీలోనా!?” అని బెరార్డో ఆత్రతతో అడిగాడు.

“సుల్మోనా, ప్రెజ్జా, అవెజ్జానా, పట్టణాల్లో కూడాను. అతను యెక్కడ సాక్షాత్కరిస్తే అక్కడ రైతులు యెదురు తిరుగుతారు. రైతులు యెక్కడ యెదురు తిరుగుతే ఆయన అక్కడ సాక్షాత్కరిస్తాడు.

“అయితే ఆయన యెవ్వరండీ? దెయ్యమో, భూతమో కాదుగదా?” అని బెరార్డో అడిగాడు.

“అయితే, అయ్యుండవచ్చును” అని ఆ యువకుడు నవ్వాడు.

“ఆయనికి ఫాంటమారా త్రోవ యెవరైనా చూపించివుంటే? అని బెరార్డో అన్నాడు.

"ఆయనికి యింత క్రితమే తెలుసును" అని మెల్లగా అవె జ్ఞానోదయవకుడు అన్నాడు.

ఆ క్షణాన్నే ఒక పోలీసు, కొందరు సైనికులు మా హోటల్లో జొరబడి, మీ ఆనవాలు కాగితాలెవ్వి?" అని అడిగారు. ఉద్యోగ శాఖలో మేము తీసుకొన్న కాగితాలు చూపించాము. పోలీసు మా కాగితాలు పరీక్షిస్తున్నాడు. సైనికులు కాఫీహోటలంతా వెదుకుతున్నారు.

మా కాగితాలన్నీ సరిగ్గానే వున్నాయి. పోలీసు వెళ్ళి పోబోతున్న సమయంలో, సైనికులు టోపీలు తగిలించే కర్రకొంకి దగ్గర జేబు రుమాలుతో కట్టబడివున్న, ఒక కట్టనుతీసి, మా దగ్గరికి పరుగెత్తుకునివచ్చారు. "ఎవ్వరు పడేశారు యీకట్ట? ఇదెవరిది?" అంటూ కోపంతో మండిపడుతో అడిగారు.

మేము యేమీ సమాధానం చెప్పకుండానే, మమ్మల్ని అరెస్టు చేసి పోలీసుస్టేషనుకు తీసుకొని వెళ్ళారు.

ఆ మూటలో దొంగసొత్తు దొరికింది కాబోలు. అందుకని, మమ్మల్ని దొంగలనే వుద్దేశ్యంతో పట్టుకున్నారని బెరార్డో అభిప్రాయపడ్డాడు.

"మేము దొంగలం కాము! మీరే దొంగలు! మీరందరూ ప్రజల్ని దోచుకుంటున్నారు. ఫాసిష్టు ఉద్యోగశాఖనిండా దొంగ లున్నారు. మా దగ్గరనుంచి యిరవైనాలుగు రూపాయలుదొంగిలించారు. మేము దొంగలం కాదు. కంట్రాక్టరు గజదొంగ!" అంటో దారిపొడుగునా బెరార్డో గొడవచేయ నారంభించాము.

రోమ్ నగరంలో నాలుగు మూలలా అరెస్టు చెయ్యబడిన వందలకొద్దీ ఖైదీలు పోలీసుస్టేషను దగ్గిరికి తీసుకొని రాబడుతున్నారు.

"మాయమనిషి కోసం వేట యింకా జరుగుతూనే వుంది" అంటూ బెరార్డో చెవిలో అవెజ్జానో యువకుడు వూదాడు. మేము దొంగతనానికి అరెస్టు చేయబడలేదనే విషయాన్ని గ్రహించగానే బెరార్డో వూరుకున్నాడు.

మమ్మల్ని ఒక చీకటికొట్టులో బంధించారు. ఆ కొట్టులో యింతక్రితమే యిద్దరు వున్నారు. మాకు తలదాచుకునేందుకు కొంప, రేపు తినేందుకు తిండీ వున్నాయిగదా అని బెరార్డో నేనూ తృప్తిపడ్డాం.

ఆ కొట్టులో సగభాగం నేలయెత్తుగా కంకర చేయుబడివుంది. అది పడుకునేందుకు వుపయోగిస్తుంది. ఒకమూల తొక్కిన యిద్దరు ఖైదీలు పడుకున్నారు. నేనూ వెంటనే పడుకున్నాను. ఆ కొట్టులో యిటూ అటూ తిరుగుతో బెరార్డో, అవెజ్జానో యువకులు, తొందర తొందరగా రహస్యాలు చెప్పుకో నారంభించారు. ఆ యువకుడు గుసగుస లాడుతున్నాడుగాని, బెరార్డో వుద్రేకంతో బిగ్గరగా మాట్లాడుతున్నాడు. "ఈ మాయమనిషి కథ నాకు అర్థంఅవడంలేదు. పట్టణంవాడా? పల్లెటూరివాడా? పట్టణంవాడైతే పల్లెలకి వెళ్ళి రైతులమధ్య పనిచెయ్యాడంలో యేదో ప్రయోజనం వుండాలి......

"కాని పట్టణంవాళ్ల పని బాగుంది. వాళ్ళు రైతుల్ని కొట్టుకుని తింటారు. ఔను; ఔను. పట్టణాల్లోకూడా బీదవాళ్ళు

వున్నారని నాకూ తెలుసును. పెప్పినో చాలా కష్టపడ్డాడు. పేజియంజాకూడ యేమీ భాగ్యభోగ్యాలు అనుభవించడం లేదు. కాని వీళ్లు అబ్రూజీనుంచి పట్టణానికి వచ్చారు. అందు చేత బీదవాళ్ళుగా వున్నారు!''

ఇప్పుడప్పుడు బెరార్డో కూడా గుసగుసలాడేవాడు. అందుచేత వాళ్ళ సంభాషణ నాకు పూర్తిగా అర్థం అయ్యేది కాదు. కొన్ని సమయాల్లో బెరార్డో వుద్రేకం పట్టలేక, మా పక్క గదిలో వాళ్ళకికూడా వినపడేటంత గట్టిగా వాదించేవాడు.

''ఆ కాఫీహోటల్లో పోలీసులకి దొరికిన మూటలో అచ్చు కాగితా లున్నాయని అంటున్నావు. కాగితాల కట్టకోసం మన్ని అరెష్టుచేస్తారా? వాట్లకి అంత విలువవుండి యేదు స్తుందా?

ఆ యువకుడికి చాలా ఓపికవుంది. గట్టిగా మాట్లాడవద్దని గొంతుక తగ్గించమని బెరార్డోని కోరాడు. అల్లాగే తగ్గిస్తా నని వాగ్దానంచేసి మరుసటి క్షణమే మళ్ళీ గట్టిగా ఆరంభిం చాడు.

''పట్టణంవాళ్ళకి బాగా రాబడివుంది. పల్లెటూరి రైతులు తిండిలేక చచ్చిపోతున్నారు. పట్టణంవాళ్ళు శుభ్రంగా భోజ నం చేస్తారు. కడుపుపట్టేటంత తాగుతారు, సినిమాలకీ వెడ తారు, వాళ్ళేమి పన్నులు చెల్లించనక్కర్లేదు. వాళ్ళు తక్కువ కష్టపడతారు, యెక్కువ సంపాదిస్తారు. టోపీలకి, బట్టలకి, తోళ్ళకి మా దగ్గరనుంచి యెంత గుంజుతారో మీరు చూస్తే తెలుస్తుంది.......... రైతులు పురుగులకంటె

హీనంగా కనిపిస్తారు. ప్రతివాళ్లూ మా రక్తమాంసాలు పీలుస్తారు. అందరూ మా నెత్తిమెక్కి తొక్కుతారు. అందరూ మమ్మల్ని మోసగిస్తారు!''

అవెజ్జానో యువకుడు శ్రద్ధగా వింటున్నాడు. ''దారుణంగా వుంది. నువ్వు చెప్పేదంతా నిజమేనా? రైతు లందరూ యిల్లాగే అనుకుంటున్నారా?''

''పట్టణంవాళ్ళు పత్రికలు అచ్చువేయించి, వూరికే యెందుకు రైతుల కిచ్చివేయాలో నాకర్థం కావటంలేదు. ఆ మాయ మనిషి తన స్వంత వ్యాపారాలు యెందుకు చూసుకోవడం లేదో బోధపడడంలేదు. ఏ కాగితాల వర్తకుడికేనా, కాగితాలు అమ్ముడుపోకపోతే యీ విధంగా వుపయోగిస్తున్నాడా?'' అని బెరార్డో అన్నాడు.

కొంతసేపైన తరువాత ''ఈ ఖైదుకి వెళ్ళేవారంతా పిచ్చివాళ్ళా? పిచ్చి యెక్కకపోతే, వాళ్ళ వుద్దేశ్యం యేమిటి? గవర్నమెంటుచేత తుపాకులచేత కాల్చివేయబడ్డారంటున్నావే, వాళ్ళెందుకు ప్రాణాలు పోగొట్టుకుంటున్నారు?'' అని బెరార్డో ప్రశ్నించాడు.

తన స్వంత వ్యాపారాలు చూసుకోవాలనీ, పనిచేసుకొని నాలుగు డబ్బులు వెనకేసుకోవాలనీ బెరార్డో పెట్టుకున్న ఆశలన్నీ భగ్నం అయిపోయాక బెరార్డో మళ్ళీ తనపూర్వపు మానసిక స్థితిలోకి దిగాడు. ప్రస్తుత పరిస్థితులమీద ఆతనికి అసూయ అమితంగా కలిగివుండాలి. ఆతని అడ్డదిడ్డపు ప్రశ్న లన్నిటికీ ఆ యువకుడు సమాధానం చెప్పి ఆతని ద్వేషాన్ని రగుల్కొలుపుతున్నాడు.

వాళ్ల సంభాషణ క్రమక్రమంగా యితర దేశాలమీదికి వెళ్ళి వుంటుంది. బెరార్డో యీవిధంగా అనడం వినపడింది.

"రష్యా? నిజం చెప్పండి. అస్తమానమూ చాలా గొప్పగా రష్యానిగూర్చి చెబుతోంటారు. నిజంగా రష్యావంటి దేశం వుందా? అందరూ రష్యానిగూర్చి మాట్లాడుతారుగాని, యెవ్వరూ వెళ్ళినట్లు కనిపించదు. రైతులు అన్నిచోట్లకి వెడతారు—అమెరికాకి, ఆఫ్రికాకి, ఫ్రాంసుకి వలసపోతారు. కాని, రష్యాకి యెవ్వరూ వెళ్ళరెందుచేత?"

కొన్నికొన్ని అంశాలమీద బెరార్డో చలించడం లేదు.

"ఏమిటీ? వాక్స్వాతంత్ర్యమా? మనం లాయర్లమా? మనం అచ్చువేశేవాళ్లమా? మన కెందుకు వాక్స్వాతంత్ర్యం ఉద్యోగస్వాతంత్ర్యం అనీ, భూమిహక్కు స్వాతంత్ర్యంఅనీ, యెందుకు అనరు?"

ఈ సమయానికి నాకు నిద్ర వచ్చింది. కొన్నిగంటల తరువాత బెరార్డో నన్ను లేపాడు.

ఆ యువకుడు, బెరార్డో యింకా మెలకువగానే వుండి, మాట్లాడుకుంటోన్నందుకు, నాకు చాలా ఆశ్చర్యం కలిగింది. "పాపం, నీ నిద్ర పాడుచేశాను. ఇప్పుడే పడుకుందువుగానిలే, టార్లోనియా రాజకుమారుడి కథ తెలుసునా?" అని బెరార్డో అన్నాడు.

"నాకు వినాలని లేదు. అందరు రాజులకథలు ఒకటే. నన్ను చంపక, పడుకోనియ్యి," అన్నాను.

"టార్లోనియా రాజకుమారుడని పిలువబడుతోన్న యీ పెద్దమనిషి మహారాజూ కాదు. అతని పేరు టార్లోనియా కాదు.

"నువ్వు కలగంటున్నావా?" అన్నాను నేను.

"మహారాజుఅని రైతులందరూ కొలుస్తోన్న యీ టార్లోనియా రాజకుమారుడు ఒక వందయేళ్ళ క్రితం ఒక ఫ్రెంచి పటాలంతో పనివాడుగ వచ్చాడు. వీడు రాజవంశానికి చెందినవాడు కాదు. వీడిపేరు టార్లోనియా కాదు. టార్లోన్. వాడు ఫ్రెంచివాడు. వాటాల వ్యాపారి. యుద్ధసమయంలో అనేక కంపెనీల తాలూకు వాటాలు కొని వ్యాపారం చేశాడు. ఉప్పు కంపెనీల్లో వాటాదారు. మతగురువుల దగ్గరనుంచి, పైకమాంటీస్ ప్రభువుల దగ్గర విశేషంగా డబ్బు గుంజాడు. ప్రజల్ని, ప్రభువుల్ని మోసగించి డబ్బు దోచుకున్నాడు. వాడికి ముందారని, ఆపైని రాజకుమారుడని బిరుదులు వచ్చాయి........."

"నువ్వు కలగంటున్నావా? పలవరిస్తున్నావా?" అని బెరార్డోని అడిగాను.

బెరార్డో నా మాట వినిపించుకోకుండా ఆ యువకునివైపు తిరిగి మళ్ళీ సంభాషణ సాగించాడు.

టార్లోనియా రాజకుమారుణ్ణిగూర్చి బెరార్డో చెప్పిన సంగతులన్నీ నాకు నిజంగా కథలాగుంది.

వాళ్ళు మాట్లాడుకుంటోంటే మళ్ళీ నేను పడుకున్నాను. నేను లేచేటప్పటికి బాగా పొద్దు ఎక్కింది. బెరార్డో బోనులో

పెట్టిన సింహంలాగు గదిలో తిరుగుతున్నాడు. అవెజ్జానో యువకుడు నా ప్రక్కనే పడుకున్నాడు. కాని, నిద్ర పోవడం లేదు. నేను లేవగానే "బెరార్డొమీద నీకు నమ్మకంవుందా?" అని మెల్లగా చెవిదగ్గర నోరుపెట్టి అడిగాడు.

"ఆ! వుంది!" అన్నాను.

ప్రతి రైతు ఆయన్ని విశ్వసించాలి. ఫాంటమారాలోవున్న రైతులందరితో ఆయన్ని నమ్మమని నువ్వు చెప్పాలి. అతను మన అందరివంటి సాధారణుడు కాడు. అతనివంటి రైతు యీ ఇటలీలో మరొకడు వున్నాడని నాకు తోచదు. ఫాంటమారాలో యీ విషయం అందరితోనూ చెప్పాలి. బెరార్డొ యేంచెబుతే అది చేస్తాండు. నిన్ను, బెరార్డొని ఒకటి రెండురోజుల్లో వదిలేస్తారు. అందులో సందేహంలేదు. నా పరిస్థితి వేరుగా వుండవచ్చును. ఆవిషయం యిప్పుడు తెలియ చెయ్యనందుకు క్షమించు. ఫాంటమారాలో బెరార్డొ నీకు చెబుతాడులే. వెళ్ళగానే, రాఫేల్‌కి, బెరార్డొకి మాటలు కలపాలి. తరువాత చెయ్యవలసిన విషయాలు బెరార్డొకి తెలుసును."

ఎనిమిది గంటలవేళ మాకు కాఫీ తీసుకు వచ్చాడు ఒక వార్డరు. ఇటూ అటూ తిరగడంమాని బెరార్డొ "ఒకసారి జిల్లా పోలీసు అధికారిగారితో మాట్లాడాలి" అన్నాడు.

ఆ వార్డరు "అవకాశం వచ్చేవరకూ ఆగు" అని వెళ్ళి పోయాడు.

బెరార్డో మాటలు వినగానే, అవెజ్జానో యువతి కి భయం కలిగింది. అతని మనోభావాల్ని సంశయ దృక్కులే తెలియ పరుస్తున్నాయి.

తొమ్మిదిగంటల వేళ పోలీసు అధికారిముందర మమ్మల్ని నిలబెట్టారు. బెరార్డో ముందుకు అడుగువేసి నిలబడ్డాడు.

"అయ్యా, అన్నివిషయాలూ వెల్లడించేసేందుకు నేను సిద్ధంగా వున్నాను."

"చెప్పు" అన్నాడు పోలీసు కమీషనరు.

"ఆ నిషిద్ధ పత్రాలు నావే. ఆ కరపత్రాలను నేనే అచ్చు వేయించి పంచిపెడుతో వుంటాను. నేనే మాయమనిషిని!".

## ౧౦

ఈ విధంగా ఆ మాయమనిషి పట్టుబడ్డాడు.

ఈ వార్త తెలియగానే, ఫాసిస్టు ఉద్యోగస్తులు, పత్రికా విలేఖరులు, ప్రభుత్వాధికారులు, మేము బంధింపబడివున్న పోలీసుస్టేషనుచుట్టు మూగారు. మాయమనిషి ఒక పల్లెటూరి రైతే!

రోమ్‌నగరా న్నంతనీ పోలీసులు గాలించేస్తున్నారు. ఆ నగర వాసుల్లో పోలీసులకి, గూఢచారులకి తెలియనివారు లేరు. ప్రతి నగరవాసి ఒక్కొక్క వృత్తిలో జేర్చబడ్డాడు. రహస్యంగా పరీక్షించ బడుతున్నారు. కాని ఇంతవరకూ రైతులని సిఘాలో వుంచ లేదు. రైతుల నెవ్వ రెరుగుదురు? నేటి

వరకూ రైతుల నెరిగిన ప్రభుత్వం యిటలీలో వుంచేకదా? ఐనప్పటికి, ప్రతి రైతుని ప్రభుత్వావృత్తి పట్టీలలో చేర్చి, నిఘాలో వుంచడానికి సాధ్యం ఔతుందా?

ఇంతా చేస్తే, నా మాయమనిషి ఒక సాధారణ రైతు. పెద్ద వుద్యోగస్థుడు వచ్చినప్పుడల్లా, బెరార్డోని బయటికి తీసికొని వెళుతోం డేవారు. నన్ను, బెరార్డోని, అపెజ్జానో యువకుణ్ణి రాత్రిపగుయిాల్లో వేరు వేరు గదుల్లో వుంచేవారు. తరువాతిరోజుల్లో, చాల తరుచుగా విచారణ జరుగుతోం డేది.

బెరార్డో దగ్గరనుంచి రహస్యాలన్నీ తెలుసుకోవాలని, పోలీసు కమిాషనరు చాలా ప్రయత్నించేవాడు. ఆ అచ్చు యంత్రాలు యెక్కడ వున్నాయో, ముద్రాపకుడెవ్వరో, ఆతనికి సహాయం చేసేవారు యెవ్వరో చెప్పమని అడిగాడు. బెరార్డోమాత్రం నోరు విప్పేవాడు కాదు.

ప్రతీ విచారణకీ అతని స్థితి మరీ దుర్భరం అయిపోతోంది. మొదటిసారి, ఆతని యెడమ కంటిక్రింద ఒక పెద్ద నల్లటి మచ్చ వుంది. తరువాత, ఆతని శరీరాన్ని గుర్తుపట్టడమే కష్టంగా వుంది. దేహంనిండా, దౌర్జన్యపు చిహ్నాలు వున్నాయి. అయినా ఆతడు యేమిా ఆచోకీ యిచ్చేవాడు కాదు. పెదవులు బిగించి వుంచలేనప్పుడు తన దృఢనిశ్చయాన్ని పోలీసు కమిాషనరుకి తెలియపరచేందుకు గాను పళ్ళను బిగించేవాడు.

నన్నుకూడా విచారించేందుకు ఒకసారి పిలిపించారు. ఒక చీకటి గదిలో, ఒక బల్లమిాద పడేసి, నాచేతులు వెనక్కి

విరిచి కట్టారు. అటుపైని, నా వీపుమీద అగ్నివర్షం కురుస్తోన్నట్లేవుంది. నా వీపుమీద పెద్ద రంధ్రంచేసి, అందులో నిప్పులు పోస్తోన్నట్లువుంది.

నాకు స్పృహవచ్చి చూసుకున్నప్పుడు, నానోట్లోనుంచి రక్తం ఓడుతోంది. నా గొంతుక మండిపోతోంది కనుక, నాలుక చివరతో ఆ రక్తాన్ని నాకేను.

మరుసటి రోజున, అవెజ్జానో యువకుణ్ణి వదిలి వేశారు.

నన్ను, బెరార్డోని ఒక్క చీకటికొట్టులోనే బంధించారు: మరొకడుకూడా ఆగదిలో వున్నాడు. అతణ్ణి చూడగానే, పోలీసు గూఢచారి అనే అనుమానం తట్టి బెరార్డోతో రహస్యంగా చెప్పాను.

"ఏమీ భయంలేదు. నేను చెప్పదల్చుకున్నదంతా, యిదివరకే చెప్పాను" అన్నాడు బెరార్డో.

అవెజ్జానో యువకుణ్ణి వదిలివేసిన సంగతి చెప్పాను.

"ఇంక మనంకూడా బయటికి తప్పించుకునే మార్గం చూడాలి. ఇంక యీ ఆట ముగిసేవిధానం వెతకాలి" అన్నాడు బెరార్డో.

ఈ ఆటని ఆరంభించడం తేలిగ్గానేవుంది కాని, ముగించడం కష్టంగా కనపడుతోంది.

పోలీసు కమీషనరుతో, తానిదివరకు చెప్పినది అబద్ధమని బెరార్డో అన్నాడు, ఆ కమీషనరు "నీకు తెలిసిన రహ

స్యాలు బయటపెట్టకపోతే, నీ పుర్యాం పుచ్చింపనిమాత్రం మరిచిపోకు" అంటో ఒక విషపునవ్వు నవ్వాడు.

ఆ సాయంకాలమే మరొక ప్రత్యేక విచారణకోరకు బెరాగ్గోని తీసుకువెళ్లారు. బెరాగ్గో యితరులు కొడుతోంటే ప్రతిఘటించకుండా వుండలేడు. ప్రతిసారి, ఆతణ్ణి కట్టి బల్లమీద పడుకోబెట్టేందుకు పది పన్నెండుమంది కావలసివచ్చారు. కాని ఆ సాయంకాలం ఆతడేమీ కష్టంకలిగించకుండా కట్లు కట్టించుకున్నాడు. ఒక పోలీసు ఆతని మీద వంగినప్పుడు, హటాత్తుగా ఆతని పీక పళ్లతోగట్టిగా పట్టుకొని కొరికేస్తున్నాడు. అందరూ పరుగెత్తుకునివచ్చి, బెరాగ్గో తలమీద, దవడమీద బలంగాదెబ్బలుకొట్టారు. మా కొట్టులోకి రక్తపు ముద్దయిన బెరాగ్గోని తీసుకొనివచ్చి పోలీసులు పడేశారు. సిలువనుంచి క్రిందికి తీసినక్రీస్తు దేవుడిశరీరంలాగుంది బెరాగ్గో దేహం.

మరుసటి వుదయం ఆతడు క్షీణస్వరంతో ఝల్లాగు అన్నాడు " ఆతడు బయటపడ్డాడు. నేనిక్కడ ఆతనికోసం చచ్చిపోతున్నాను. పట్టణంవాళ్ళు, పట్టణంవాళ్ళే. నేను నానాబాధలు అనుభవిస్తోంటే, బయట స్వేచ్ఛగా కులుకుతున్నాడు. నాకు ఆతడు చెప్పిందంతా యెందుకు చెప్పివెయ్యకూడదు? నాకు తెలుసునవుకొని, ఊహించినవీ, ఊహించానని అనుకొన్నవీ, విన్నవీ, నాకు తెలియనివీ, ఊహించనివీ, అన్నీ యెందుకు బయటపెట్టకూడదు?"

మేము పోలీసుగూఢచారి అని అనుమానపడిన బందీ, చెవులు పెద్దవిచేసుకొని వింటున్నాడు.

నేను పోలీసు కమీషనరు ముందుకి తీసుకొని రాబడ్డాను. అవేళ్టానో యువకుడు తనకు చెప్పిన విషయాలన్నీ వెల్లడించే స్తాడేమో బెరార్డో అని అనుకున్నాను. రహస్యాన్ని వెల్లడించడం మంచిదో, చెడ్డదో నిర్ణయించుకోలేకుండావున్నాను. నీకు తెలిసిన విషయాలన్నీ వెల్లడించేందుకు సిద్ధంగా వున్నావా?'' అని కమీషనరు అడిగాడు.

"ఆ!'' అన్నాడు, బెరార్డో.

కమీషనరు ఒక పత్రిక బెరార్డో ముందు పెట్టాడు. దాని మీద పెద్ద అక్షరాలతో ఈ విధంగా వ్రాయబడివుంది.

"బెరార్డో వయోలా నర్దిల్లాలి!'' అని వ్రాయబడివుంది.

"రహస్యంగా అచ్చువేయబడిన యీ పత్రికమీద నువ్వు అరెస్టు చెయ్యబడింది మొదలుకొని, నేటివరకూ, పోలీసులు నీచేత రహస్యాలు వెల్లడింపచేసేందుకు చేసిన ప్రయత్నాలన్నీ వ్రాయబడి వున్నాయి. నువ్వు రహస్యాలు వెల్లడించేందుకు సిద్ధంగా వున్నావు కనుక, నువ్వువున్న చీకటికొట్టునుంచి యీ రహస్య పత్రికకి సర్వవిషయాలు యేవిధంగా పంపించావో, మొదట చెప్పు.''

బెరార్డో సమాధానం చెప్పలేదు.

ఫాంటమారాని గూర్చి యీపత్రికలో అనేక విషయాలు వ్రాయబడి వున్నాయి. ఫాంటమారా జలధారని కమీషనరు తన కొత్తకాలవలోకి మార్చివెయ్యడం, గ్రామకంఠాన్ని ఆక్రమించడం, టియోఫిలో అనేవాడు వురిపోసుకుని చచ్చి

పోవడం, ఎల్వీరా అనే పిల్ల చచ్చిపోవడం యింకా అనేక విషయాలు వున్నాయి. ఫాంటమూరా గారిమస్సును కాకపోతే యీవిషయాలన్నీ యెల్లా తెలుస్తాయి? ఈ కోటనుంచి, యీవిషయాలన్నీ యెలా తెలియపరిచావో చెప్పు!'' అని కమీషనరు అడిగాడు.

బెరార్డో మాట్లాడకుండా, ఆ పత్రికవేపు సమ్మోహితుడై నట్లు రెప్ప వెయ్యకుండా చూస్తున్నాడు. అతని కంఠ్లముందు పత్రిక మీదవున్న తన పేరు, ఎల్వీరా పేరు హృదయాన్ని సంభింపజేశాయి.

''చెప్పు, బెరార్డో, చెప్పు అని కమీషనరు నొక్కి అడిగాడు.
''చెప్పలేను. నేను చచ్చిపోయేందుకైనా సిద్ధంగావున్నాను, కాని చెప్పను'' అన్నాడు బెరార్డో.

కమీషనరు అనేకసార్లు రహస్యంగా వెల్లడించమని అడిగాడు. బెరార్డో యీలోకంలో లేడు. చనిపోయేందుకు దృఢనిశ్చయు డయ్యాడు. అతని శరీరాన్ని కోట్టులోకి యీడ్చుకొని వెళ్ళారు.

ఆ రాత్రి మేమిద్దరము నిద్రపోలేదు.

తన బురి బ్రద్దలయ్యేందుకు సిద్ధంగావున్నట్లు, బెరార్డో రెండు చేతుల్తో శిరస్సు గట్టిగా నొక్కి పట్టుకున్నాడు. తాను విన్నవిషయాలు వెల్లడిద్దామని కొంతసేపు అనుకు న్నాడు. మళ్ళీ మనసు మార్చుకున్నాడు. మళ్ళీవెల్లడించేం దుకు స్థిరపరచుకున్నాడు. ఈ క్షేమంలో యెందుకు వుండాలి? ముప్పై యేళ్ళ వయస్సప్పుడు క్షేమంలో యెందుకు బలవంతిపు

చావు చావాలి? ప్రతిష్ఠకోసమా? ఆశయంకోసమా? కాని అతనికి రాజకీయాల్లో యెప్పుడూ అభిరుచి లేదే? ఈ ఆలోచనలతో, తర్జన భర్జనలతో గంటలు గడిచి పోయాయి. తనలో తాను, నాతో యీవిధంగా చర్చిస్తున్నాడు బెరార్డో. మాగదిలోవున్న మూడవవాడు చెవులు నిక్కపొడుచుకుని ప్రతిమాటా వింటున్నాడు. బెరార్డోలో యీ సంఘర్షణ తీవ్రంగా జరిగిపోతోంది.

"నేను ద్రోహి క్రింద మారుతే, సర్వనాశనం అయిపోతుంది. నేను ద్రోహినైతే ఫాంటమారా నాశనం అయిపోతుంది. నేను ద్రోహినైతే, ఇల్లాంటి అవకాశం వచ్చేందుకు శతాబ్దాలు పడుతుంది. కాని, నేను చచ్చిపోతే?........

తనకోసం కాకుండా, ప్రజలకోసం చచ్చిపోయిన రైతుల్లో నేనే ప్రథముణ్ణి ఔతాను. ఇతర రైతులకోసం, రైతుల ఐకమత్యంకోసం ప్రాణాలు ధారపోసినట్లు ఔతుంది."

ఈ తర్జనభర్జనలోంచి తేల్చిన సారాంశం యిది. ఈమాటలు అతనికి కళ్ళపొరలు విడతీసి నట్లున్నాయి. అఖండమైన ప్రకాశాన్ని కలిగించాయి.

"ఐకమత్యం!" అన్నాడు. ఐకమత్యం అంటే యేమిటి? ఈ మాట యెప్పుడైనా నువ్వు విన్నావా? అదొక కొత్త పదం. ఐకమత్యం. అదే సార్వత్రిక క్షేమం. అదే—బలం. అదే—స్వాతంత్ర్యం. అదే పన్నులు కట్టనక్ఖర్లేని భూమి. ఈమాట యెప్పుడేనా విన్నావా? ఎంత చిన్నమాటో చూశావా? ఈ మాటనే ఫాంటమారాకి తీసుకొని వెళ్ళాలి. నేను చచ్చి

పోతే, యీమాటనే ఫాంటమారాకి నువ్వు తెలియపరచాలి. ఐకమత్యం రాఫేల్‌తో, మిచెలీజోంపాతో, బాల్డిస్సేరా సేనానితో, సిలాటాతో, అంటోనియోతో అందరితోను యీ ఐకమత్యాన్నిగూర్చి చెప్పాలి. ఐకమత్యం రైతు రైతుకీ మధ్యనుండే స్నేహాన్ని. వైషమ్యాన్ని పోగొట్టాలి. మనకి లేనిది— ఐకమత్యం ఒక్కటే. అది వుంటే తక్కిన వన్నీ దాని వెంబడినే వస్తాయి.

ఈ మాటలే బెరార్డో దగ్గరనుంచి నేను విన్న ఆఖరిమాటలు. మరుసటి ఉదయాన్న మిమ్మల్నిద్దరినీ విడతీశేసారు.

రెండురోజుల తరువాత పోలీసుకమిషనరు నన్ను పిలిచాడు. "బెరార్డోవయోలా ఆత్మహత్యచేసుకున్నాడు. నిరాశతో వురిపోసుకుని చచ్చిపోయాడు. ఈ విషయంలో అబద్ధం లేదు. కాని, సాక్ష్యం లేదు. బెరార్డో వురిపోసుకుని చనిపోయాడని ఒక వాఙ్మూలంమీద నువ్వు సంతకంచేస్తే నిన్ను వెంటనే వదిలివెళ్ళేస్తాం".

అని కమిషనరు నాతో చెప్పాడు.

బెరార్డో చచ్చిపోయాడని వినగానే, నాకు యేడుపు వచ్చి భోరుమని యేడ్చాను.

ఆ కమిషనరు వాఙ్మూలాన్ని తయారుచేశాడు. నేను చదవకుండానే సంతకం చేశాను.

పోలీసు చీఫ్‌కమిషనరు దగ్గిరకి నన్ను తీసికొని వెళ్లాడు.

"చనిపోయిన బెరార్డో స్నేహితుడవేనా నువ్వు?"

"చిత్తం, అయ్యా."

చనిపోయిన మనిషి, యెప్పుడూ ఆత్మహత్య చేసుకోవాలని ప్రయత్నిస్తోండే వాడనే విషయాన్ని నువ్వు అంగీకరిస్తున్నావా?

"చిత్తం అయ్యా".

ఈతడు యీ మధ్యకాలంలో ఒక ప్రేమ వ్యవహారంలో తిరస్కృతుడయ్యాడా?

"చిత్తం అయ్యా"

"ఈతడుకూడా నువ్వు బంధింపబడిన గదిలోనేవుండి నువ్వు నిద్రపోతోన్న సమయంలో ఉరిపోసుకుని చనిపోయాడని అంగీకరిస్తావా?"

"చిత్తం అయ్యా"

నాచేత ఒక వాఙ్మూలంమీద సంతకంచేయించి ఒక న్యాయమూర్తి దగ్గరకు తీసికొనివెళ్ళారు.

"నువ్వు యీ చనిపోయినమనిషి స్నేహితుడవేనా?

"చిత్తం, అయ్యా"

"ఈతడు ప్రేమవ్యవహారాల్లో తిరస్కృతుడయ్యాడా?"

"చిత్తం, అయ్యా"

నిన్ను బంధించిన గదిలోనే, నువ్వు నిద్రిస్తోన్న సమయంలో వురిపోసుకొని చచ్చిపోయాడని నువ్వు ఒప్పుకుంటావా?

"చిత్తం అయ్యా"

ఆయనకూడా నాచేత సంతకం చేయించి వెళ్ళిపోమ్మన్నాడు. మధ్యాహ్నానికి నన్ను ఖైదులోంచి వదిలిపెట్టారు. నాతో కూడా పోలీసులు వచ్చి, అక్కడ్నా రైలుయెక్కించి వెళ్ళిపోయారు. తరువాత జరిగిన విషయాలు మాబాబు చెబుతాడు.

నా కొడుకు ఫాంటమారా వచ్చేముందే, యీ విషయాలన్నీ మాయమనిషి నాతో చెప్పాడు.

నా కొడుకు వచ్చే సమయానికి, మాయమనిషి మా కిచ్చి వెళ్ళిన ఒక అచ్చుయంత్రంచుట్టూ మేము పదిహేనుమంది వరకూ మొట్టమొదటి రైతుపత్రికను అచ్చువేసేందుకు కూర్చుకున్నాం. .

ఆ యంత్రం ఒక కర్రపెట్టెలో అమర్చబడివుంది. పైనూతలోపలి భాగాన్ని ఒక నున్నటి రాయివుంది. లోపల కొన్ని ద్రావకాలు, సిరాలూ వున్నాయి. ఒక కాగితంమీదవ్రాసి తెల్లకాగితాలమీద కొన్ని వందలు ప్రతులు యీ యంత్రంతో తీయవచ్చును.

పోర్టాపిఝోవీరుడి అక్షరాలు చాలా అందంగా వుంటాయి. ఆతడు వ్రాతప్రతిని రాశేందుకు కూర్చున్నాడు. బాల్డిస్సేరాకి వ్యాకరణము, వర్ణక్రమము బాగా తెలుసును. ఆ యంత్రంచే పని చేయించే విధానాన్ని రాఫేల్‌కి మాయ మనిషి నేర్పాడు. వీరే కాకుండా తక్కిన అందరూ ఆ యంత్రంచుట్టూ వున్నారు.

ఆ పత్రికకి యేం పేరు పెడదామా అనే విషయాన్ని గూర్చి ముందు ఆలోచించాము.

పట్టణాల్లోని పత్రికల పేర్లవంటిది 'యుగవాణి' అని పేరు పెట్టమన్నాడు కాని బెరార్డో ప్రవస్తానని పుణికిపుచ్చుకున్న రాఫేల్, అట్లాంటి పేరు చెప్పక నోరు మూసుకొమ్మని

"మనం యితర్లని అనుకరించకూడదు. ఇదే రైతుల మొట్ట మొదటి పత్రిక !" అన్నాడు.

మిచెలీజోంపా "సత్యం" అని పేరు పెడ్తానన్నాడు. ఆ పేరు చాలా బాగుంది. కాని రాఫేల్ అందుకూ ఒప్పుకోలేదు.

సత్యం, సత్యంయేమిటో, అబద్ధంయేమిటో యే దెయ్యానికి తెలుసును?" అన్నాడు.

"మనకి తెలియకపోవచ్చును, కాని తెలుసుకునేందుకు ప్రయత్నిస్తాం" అని మిచెలీ అన్నాడు.

అది తెలుసుకున్నాక, దానితో పులుసు వండుకుంటావా అన్నాడు, రాఫేల్.

బాల్డిస్సేరాసేనాని, "న్యాయం" అని పెడ్తానన్నాడు.

"నీకు మతిపోయింది. న్యాయం మన కెప్పుడూ వ్యతిరేకం గానే యేడవలేదూ?" అన్నాడు.

ఆతని వుద్దేశం మీరు అర్థం చేసుకోవాలంటే, మా పల్లె టూరివాళ్లకి, న్యాయం అంటే పోలీసులుఅనే అర్థం ఔతుం దని, మీరు మనస్సులో వుంచుకోవాలి. న్యాయం చేతుల్లో చిక్కాడంటే పోలీసుల చేతుల్లో పడటం అన్నమాటే. ధర్మంకోసం పాటుపడటం అంటే, పోలీసులు చెప్పినదాని నంతా ఔననడం.

"కాని, నిజమైన 'ధర్మం' అని పెట్టాలని నా వుద్దేశ్యం. అందరికీ సమానమైన న్యాయం జరగాలి" అని బాల్డిస్సేరా కోపంతో అన్నాడు.

"అందరికీ సమానమైన న్యాయం స్వర్గంలో దొరుకుతుంది". అన్నాడు రాఫేల్.

"నువ్వు చెప్పు. మంచిపేరు వుండాలి" అన్నాడు పోట్రాఫియో పీరుడు.

"మన మేం చెయ్యాలి?"

ఆ మాటే మూడుసార్లు రాఫేల్ చేత అనిపించి, రాఫేల్ ఉద్దేశ్యం మన మేం చెయ్యాలి, అనే పేరుతోనే పత్రికని నడిపించాలని తెలుసుకున్నాం. ఆశ్చర్యంతో ఒకరివంక మరొకరం చూసుకున్నాం.

"కాని ఇ దేంపేరయ్యా? పత్రికకి యీ పేరు బాగుంటుందా? పత్రిక ముఖపత్రింమీద అందంగా ముచ్చటగా రాసేందుకు అనుకూలంగా యేదైనా పేరుండాలి" అని పీరుడు అన్నాడు.

"సరే, బాగుంది. పత్రిక ముఖపత్రంమీద, అందంగా మన మేం చెయ్యాలి? అని రాయి. అదే మన పత్రికపేరు ఔతుంది." అన్నాడు రాఫేల్.

"ఆ పేరు అసహ్యంగా వుంది. మన పత్రిక రోమ్‌కి వెళ్ళిం దంటే వాళ్ళు తాటాకులు కడతారు" అని పీరుడు తన అభ్యంతరాన్ని తెలిపాడు.

రాఫేల్‌కి కోపం వచ్చింది. ఆ పత్రిక రైతులది. రైతులచేత,

రైతుల కొరకు నడిపింప బడుతుంది. దీన్నిగూర్చి పట్టణ వాస్తవ్యు లేమి అనుకుంటే రైతుల కేమి?

రాఫేల్ ఉద్దేశ్యంతో బాల్డిస్సెరా యేకీభవించాడు. అందు చేత 'మన మేం చెయ్యాలి?' అనే పేరే పెట్టబడింది.

పీరుడు అయిష్టంగానే పత్రిక పేరు వ్రాస్తున్నాడు. మేమందరం మొదటి వ్యాసాన్ని గూర్చి ఆలోచిస్తున్నాం.

మొదటి వ్యాసానికి 'వాళ్ళు బెరార్డో వయోలాని ఖూనీ చేశారు' అని పేరు పెడదాం మీరు ఒప్పుకుంటారా? అని మిచెలీ జోంపా అడిగాడు.

రాఫేల్ ఒప్పుకుంటూ 'వాళ్ళు బెరార్డో వయోలాని ఖూనీ చేశారు! మన మేం చెయ్యాలి?' అని కూడా చేర్చమన్నాడు. 'మన మేం చెయ్యాలి' అన్నది పత్రిక పేరులోనే వుంది'' అన్నాడు జోంపా.

ఒక్కసారివుంటే చాలదు. మనం చాలాసార్లు రాయాలి. మనం దాన్ని తిరిగి తిరిగి రాయకపోతే, ఆ పేరు పెట్టినందుకు వుపయోగం వుండదు. వాళ్ళు మన నీరు తీసుకుపోయారు, మన మేం చెయ్యాలి? పురోహితుడు చనిపోయిన మన రైతుల్ని ఖననం చెయ్యడు. మన మేం చెయ్యాలి? న్యాయం పేరు చెప్పి మన స్త్రీల మానభంగం చేస్తారు. మన మేం చెయ్యాలి? డాన్ సర్కోన్స్టాంజా కపటి. మన మేం చెయ్యాలి?'' అని రాఫేల్ చెప్పాడు.

రాఫేల్ ఉద్దేశ్యం గ్రహించి, అందుకు ఒప్పుకున్నాం. తరు వాత వారు వ్యాసాలు రాస్తోంటే నేను నా కొడుకుని తీసు

కొని యింటికి వెళ్ళాను. మళ్ళీ నా కంటబడతేమోనని, భయపడిన పుత్రుణ్ణిచూశాక యింటిదగ్గర వాడితో కొంత కాలం గడుపుదా మనుకున్నాను.

అర్ధరాత్రివేళ రాఫేల్ నా దగ్గరకి వచ్చి 'మన పోరు చెయ్యాలి' పత్రిక ప్రతుల్ని ముప్పై యిచ్చి, శాంబెనిడెట్టో గ్రామంలో పంచిపెట్టి రమ్మన్నాడు. మరుసటిరోజున అనేక గ్రామాల్లో అయిదువందల ప్రతులని పంచిపెట్టేందుకు ప్రయత్నాలు జరిగాయి.

నా భార్య బంధువులు బెనిడెట్టో గ్రామంలో వున్నారు. నేనూ, నాభార్య, పుత్రుడు ఆ మరుసటి వుదయాన్ని బయల్దేరి, మధ్యాహ్ననికి ఆవూరు చేరుకున్నాం. ఒక గంటలో ఆ పత్రికల్ని పంచిపెట్టాను. ఆరాత్రి అక్కడే భోజనంచేసి తొమ్మిది గంటలకే ఫాంటమారా వెళుతున్నాం. సగందూరం వచ్చాక, దూరాన్ని తుపాకులు పేలుతోన్న ధ్వని వినపడుతోంది.

"ఈ రోజున యేం పండుగ?" అంటూ నా భార్య అడిగింది. ఆ రోజున యేపండుగో గ్రహించడం కష్టం. లూయీబుషి పండుగ అయిపోయింది. ఆనీబుషి పండుగ యింకా చాలా రోజులకిగాని రాదు.

"ఫాంటమారానుంచే ఆ ధ్వని వినపడుతోంది" అన్నాను నేను.

మా పట్టణంనుంచి మా ప్రక్కవూరి బండివాడొకడు ఆ సమయాన్ని మమ్మల్ని కలుసుకున్నాడు.

"ఫాంటమారావాళ్ళొయ్! ఫాంటమారాలో యుద్ధం జరుగుతోంది" అంటూ బిగ్గరగా అరుస్తూ చెప్పాడు.

"ఏమిటి? యుద్ధమా? యుద్ధం యెందుకు??" అని మేము ఆశ్చర్యపడ్డాం.

"ఫాంటమారావాళ్లు ఒకరితో ఒకరు యుద్ధం చేస్తున్నారా? అసంభవం. అదెప్పుడు జరగదు." అని మాలో మేము అనుకున్నాం.

కంట్రాక్టరు ఫాంటమారాప్రజలతో యుద్ధం చేస్తున్నాడా? ఎందుకు?

అప్పుడప్పుడు తుపాకుల మోత ఆగుతోంది. కాని మళ్ళీ ప్రారంభం అవుతోంది. ఫాంటమారా సమీపిస్తున్నకొద్దీ, ఆ తుపాకీమోత ఆ వూరునుంచే వినపడుతోందని స్పష్ట పడింది.

"మనమేంచెయ్యాలి?" అని మాలో మేము తర్కించుకున్నాము. ఆ ప్రశ్నే స్కార్పోను వేశాడు. మనమేం చెయ్యాలి?

సమాధానం చెప్పడంకంటె, ఆ ప్రశ్న వెయ్యడం చాలా తేలిక. ఈ లోపుగా నడక సాగిస్తున్నాం.

పెస్సినా, పాంటమారా రోడ్లు కలిసే చోటుకి వెళ్ళేటప్పడికి సిపొల్లా మమ్మల్ని కలిశాడు.

"ఎక్కడికి వెడుతున్నారు? ఫాంటమారాకా? మీకు పిచ్చెత్తిందా?" అంటూ పెస్సినా వైపు పరుగెత్తాడు.

మేంకూడా సిపోల్లా వెనక పరుగెత్తాం.

"చెప్పవయ్యా! ఫాంటమారాలో యేం జరుగుతోంది? ఎందుకు తుపాకులు పేలుస్తున్నారు" అంటూ పరుగెత్తుతోనే అడిగాను.

"అదా? యుద్ధం! యుద్ధం జరుగుతోంది. రైతులమీద— పత్రికమీద యుద్ధం చేస్తున్నారు!" అన్నాడు.

"తక్కినవాళ్ళంతా యేం చేస్తున్నారు?"

"పరిగెత్తగలిగిన వాళ్ళు పారిపోయారు. తప్పించుకో గలిగిన వాళ్ళు తప్పించుకున్నారు."

"స్కార్పోనె తప్పించుకున్నాడా?" అని నాకోసం అడిగాను.

"ఆయన ఆత్మ శాంతించుగాక!" అంటూ విచారసూచకంగా చెప్పాడు.

"వెనర్డి శాంటో జీవాలతో తప్పించుకున్నాడా?"

"ఆయన ఆత్మ శాంతించుగాక"

"పిలాటో విషయం యేమైంది?"

"కొండమీదనుంచి తప్పించుకుపోయాడు."

"మిచెలీ జోంపా సంగతి?"

"...నావైపు పారిపోయాడు".

"బాల్దిస్సెరా సేనానో?"

"ఆయన ...కూడ స్వర్గం చేరుకున్నాడు".

"ఇంకా యెవరు చచ్చిపోయారు?"

ఆసమయాన్ని మా వెనకనుంచి గుఱ్ఱండెక్కల టకటకధ్వని వినపడింది. సైనిక పటాలం పెస్సినోనుంచి ఫాంటమారా వెళుతోంది కాబోలు.

ప్రాణాల్ని రక్షించుకునేందుకు, రోడ్డుప్రక్క పొలాల్లోకి పరుగెత్తాము. ఆ రాత్రి గాఢాంధకారంలో, సిపొల్లా మాకరా కనబడలేదు ఆరోజు మొదలుకొని, నేటివరకూ అతని గతి యేమైందో మాకు తెలియలేదు.

అతని విషయమేకాకుండా, తక్కినవాళ్ళ సంగతికూడా మాకు తెలియదు. ఎవరు చనిపోయారో, యెవరు తప్పించుకున్నారో, మా యిల్లు యేమైందో, పొలం యేమైందో, తెలియదు.

నేటికి యిక్కడికి చేరుకున్నాము. మాయమనిషి మమ్మల్ని యిక్కడికి సురక్షితంగా చేర్చాడు. కాని మేము యితర చోట్లవుండి ప్రాణాలని నిలబెట్టుకోవడం అసాధ్యం అనే విషయం స్పష్టంగా కనబడుతోంది. మే మేం చెయ్యాలి?

ఇన్ని కష్టాలు, బాధ, కన్నీళ్ళు, గాయాలు, రక్తం, క్రోధం, నిరాశల తరువాత— మే మేం చెయ్యాలి ?

మా కర్తవ్యం యేమిటి ?